# రామాయణం

## ఎందుకు చదవాలి?




రచన :

**గాలి సుబ్బారావు**, ఎం.ఏ.,

# రామాయణం ఎందుకు చదవాలి?




రచయిత

**గాలి సుబ్బారావు,** యం.ఏ.,

రిటైర్డ్ ప్రిన్సిపాల్

మాజీ పాలక మండలి సభ్యులు, ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం

# రామాయణం ఎందుకు చదవాలి?

## ముందు మాట

వాల్మీకి మహర్షి రచించిన రామాయణ మహాకావ్యం భారతీయ మహోత్కృష్ట గ్రంథాల రెండింటిలో మొదటిది. శ్లోకబద్ధమైన మొదటి కావ్యము గనుక ఈ కావ్యాన్ని ఆదికావ్యమన్నారు. బ్రహ్మదేవునిచే ఆమోదింపబడిన గ్రంథమిది.

పుల్లెల శ్రీరామచంద్రుడుగారు వ్రాసిన వచన రామాయణాన్ని ఏడుకాండములను నేను ఏకాగ్రతతో చదివాను. చదవటము పూర్తి అయిన పిమ్మట రామాయణం మీద ఒక పుస్తకం వ్రాద్దామనే బలమైన కోరిక నాలో బయలుదేరి బలపడ్డది. అంతకుముందే మహాభారతము శాంతిపర్వములోని భీష్ముడు ధర్మరాజుకి చెప్పిన రాజధర్మాలను ప్రస్తుత భారతదేశ పాలనతో పోలుస్తూ **"రాజనీతి-రాజధర్మాలు మహాభారతము-నేటి భారతావని"** అనే గ్రంథాన్ని వ్రాశాను. ఆ పుస్తకాన్ని మాన్యశ్రీ డా॥ కోడెల శివప్రసాదరావుగారు, నవ్యాంధ్ర తొలి శాసన సభాపతి ది. 29-10-2018 న ఆవిష్కరించారు. ఆ సందర్భాన రామాయణం మీద ఏమీ వ్రాయలేదా అని నన్నడిగారు. అప్పటినుండి నా మనస్సులో రామాయణం మీద ఒక పుస్తకము వ్రాయాలనే బలమైన కోరిక, పట్టుదల పెరిగాయి.

రామాయణం ఏ ఒక్క అంశము మీద వ్రాయాలన్నా ఏడు కాండాలు చదవాలి. గుర్తుపెట్టుకోవాలి. వ్రాసేటప్పుడు అన్ని కాండములను చూడాలి. ఇది చాలా కష్టమైన పనిగా నాకు తోచింది. రామాయణం మీద ఏమి వ్రాయాలి? అని నేను తొమ్మిది అంశాలను గుర్తించాను. అవి

1) వాల్మీకి రామాయణం - సత్యధర్మాలు

2) వాల్మీకి రామాయణం - విలువలు - నాడు నేడు

3) వాల్మీకి రామాయణం - పాప పుణ్యాల ప్రస్తావన

4) వాల్మీకి రామాయణం - కైకేయి పాత్ర

5) వాల్మీకి రామాయణం - కావ్యవిమర్శ

6) రావణ పాత్ర - విమర్శ

7) వాల్మీకి రామాయణం - కావ్య సందేశము

8) రామాయణం ఎందుకు చదవాలి?

9) వాల్మీకి రామాయణం - స్త్రీ పాత్రలు

ఈ తొమ్మిది అంశాలలో "రామాయణం ఎందుకు చదవాలి?" అనే అంశాన్ని ఎన్నుకొని పుస్తకము వ్రాశాను. ఈ పుస్తకములో 12 అధ్యాయాలు ఉన్నాయి.

మొదటి అధ్యాయంలో మరుజన్మను నమ్మితే రామాయణాన్ని చదవమన్నాను. సీత లక్ష్మీదేవి, రాముడు విష్ణుమూర్తి అవతారాలు - ఆదర్శ దంపతులు. రెండవ అధ్యాయములో రాముని గుణగణాలను, అన్నదమ్ముల అనుబంధాన్ని వ్రాశాను. మూడవ అధ్యాయములో సీతారాములు అనుభవించిన కష్టాలను పేర్కొన్నాను. నాల్గవ అధ్యాయములో రామాయణం - విలువలు అనే అంశాన్ని, ఐదవ అధ్యాయములో రామాయణ కాలమునాటి గూఢచారి వ్యవస్థను, నేర పరిశోధనను, ఆరవ అధ్యాయములో సీత గుణగణాలను, ఏడవ అధ్యాయములో రామాయణంలో హనుమంతుడు నిర్వహించిన పాత్రను, ఎనిమిదవ అధ్యాయములో దశగ్రీవుని గుణగణాలు, పరాక్రమము, గొప్పతనము, పతనాన్ని వ్రాశాను, తొమ్మిదవ అధ్యాయములో అయోధ్య రాజ్యము - రాముని పాలన - రామరాజ్య ప్రస్తావన గావించాను. పదవ అధ్యాయములో రామాయణం మానవ సంబంధాల ప్రాధాన్యతను వివరించాను. పదకొండవ అధ్యాయంలో రామాయణం సత్యధర్మాల ప్రస్తావన చేశాను. పన్నెండవ అధ్యాయంలో రామాయణం - కాల మహిమ, సూర్యుని ప్రభావము, రామాయణ కావ్య మహాత్మ్యాన్ని వివరించాను.

ఈ పన్నెండు అంశాలను పరిశీలిస్తే రామాయణాన్ని ఎందుకు చదవాలో అర్థమవుతుంది. ఈ విషయాన్ని ముగింపులో వ్రాశాను. ఇది ఈ గ్రంథ స్వరూపము.

మానవ జీవితంలో "తొలిదశ", "మలిదశ" అని రెండు దశలుంటాయి. తొలిదశలో విద్యాభ్యాసము, వివాహము మొదలైన కార్యక్రమాలు పూర్తి అవుతాయి.

మలిదశలో సంతానము, మనుమలు, మనుమరాళ్ళు మొదలగు కుటుంబ భారము తదితర కార్యక్రమాల్లో మునిగిపోతారు. భగవత్ చింతన అధికమవుతుంది. జీవిత తొలిదశలోనే భారతీయ మహోత్కృష్ట గ్రంథాలైన రామాయణ, మహాభారత, భగవద్గీత చదివితే భారతీయ జీవన విధానము, విలువలు, సత్యధర్మాలు, జీవిత కష్టాల మీద అవగాహన ఏర్పడుతుంది. తరువాత జీవితములో తప్పులు చేయకుండ సరిదిద్దుకునే అవకాశము లభిస్తుంది. మలిదశలో పైన పేర్కొన్న గ్రంథాలు చదివితే అందులో చెప్పబడిన విలువలు, కష్టాలు, సత్యధర్మాలు తెలుసుకొని జీవితాన్ని సరిదిద్దుకొనే అవకాశము ఉండదు. కనుక **జీవిత తొలిదశలో** ఉన్నవారే పైన పేర్కొన్న గ్రంథ త్రయాన్ని చదవాలి.

రామాయణ కావ్యాన్ని చదవటము, చదివి ఆ గ్రంథము మీద మరొక గ్రంథాన్ని వ్రాయటము నాకు భగవంతుడు కల్పించిన అదృష్టంగా భావిస్తున్నాను.

నా ఈ రచనకు ఆధార గ్రంథంగా శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు వ్రాసిన వచన రామాయణ గ్రంథాన్ని స్వీకరించాను. వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు, ధన్యవాదములు.

ఇట్లు
**రచయిత**

డా॥ కందిమళ్ళ సాంబశివరావు
సెల్ : 9848351517

# అందుకు.. కాదు.. అందుకే చదవాలి!

వేదం ప్రభు సమ్మితం.. ఇలాగే జరగాలి అని శాసిస్తుంది. పురాణం మిత్ర సమ్మితం.. మంచి చెడ్డలను విశ్లేషణాత్మకంగా అరటిపండు ఒలిచినట్లు హితోక్తితో చెబుతుంది. కావ్యం కాంతా సమ్మితం.. విషయాన్ని వెన్నపూసంత మెత్తగా, మనసుకు హత్తుకొనేలా చెబుతుంది. రామాయణ; భారత; భాగవత పురాణాలు భారతీయుల, మీదు మిక్కిలి తెలుగువారి ఆరాధ్య నిదర్శన దర్శనాలు. పంచమ వేదంగా వినుతికెక్కిన భారతం ధర్మప్రతిపాదనతోపాటు రాజనీతిని రంగరించి అందరి మస్తిష్కాలలో చిరముద్రను వేసింది. భాగవతం నవవిధ భక్తి ప్రతిపాదనతో భగవంతునికి భక్తునికి అనుసంధాన రాచబాటలను వేసింది. ఇక రామాయణం విశ్వజగతికే అనుసరణీయమైన.. ఆచరణాత్మకమైన కుటుంబ జీవన వైశిష్ట్యాన్ని ; మానవీయ విలువలను ; అనుబంధాల చిక్కదనాన్నీ చాటిచెప్పిన మహత్తర మణిదీపిక. రామాయణ దర్శనం మానవ సంపూర్ణ దర్శన నిదర్శనం. అందుకే యుగాలు మారినా.. తరాలు గడిచినా నిత్యపఠనీయంగా.. భారతీయ ఆదర్శాలకు జీవగట్టుగా నిలిచింది.

రామాయణ; భారత; భాగవత కథలన్నీ పండిత ప్రకాండుల నుండి పామరుల వరకూ నిత్య సత్య పరిచయాలే. అవన్నీ చర్విత చర్వణాలే. ఆ పురాణాలను స్థాలీపులాక న్యాయంగా చదివినవారు కొందరైతే సమగ్రంగా చదివి తరించినవారు మరికొందరు. విహంగ వీక్షణంలా చదవడం వేరు.. సాకల్యంగా చదివి అర్థాన్నీ, పరమార్థాన్నీ మనస్సుకి పట్టేలా అవగతం చేసుకొనేలా చదవడం వేరు. ఈ పురాణాలను మేము చదివాము అని గొప్పగా చెప్పుకొనేవారు ఎందరో... కానీ నిజంగా "చదివితే" వైయక్తిక జీవితం; ఆలోచనాలోచనం; అంతరంగ తరంగాలలో పరిపూర్ణ సిద్ధి కలుగుతుంది. ఒక పుస్తకం మస్తకగతిని మారుస్తుందనటానికి ఈ మూడు పురాణాలు ముచ్చటైన నికషోపలాలు. అందుకే భూత ; భవిష్యత్ ; వర్తమాన కాలాలు

నెత్తిన పెట్టుకొని పూజించదగిన అరుదైన ; అపురూపమైన పురాణ కల్పవృక్షాలు అవి.

ఒక గొప్ప వ్యక్తిని చూసినా; ఒక అరుదైన వస్తువును పరికించినా; ఒక అద్భుతమైన పుస్తకాన్ని "చదివినా" వారి వైయక్తిక అవగాహనా శక్తి; అభిరుచి; స్థాయిల మేరకు ఆ కోణంలో కన్పిస్తుంది. దృష్టి కోణం ప్రధాన హేతువుగా నిలుస్తుంది. స్థాయిగల పరిశోధకుడు; పండితుడు, విశ్లేషకుడు, విమర్శకుడు దృష్టికోణాన్ని సశాస్త్రీయంగా; సహేతుకంగా వివరిస్తాడు. ఆ కోణాన్ని పాఠక, ప్రేక్షకలోకం పరిశీలించి తమ ఆమోదాన్నో.. అసంతృప్తినో వెల్లడిస్తుంది. ఏది ఏమైనా ఆ దృష్టికోణం నూతన పార్శ్వాలను ఆవిష్కరిస్తుంది. సామాన్య పాఠకులు; ప్రేక్షకులకు ఒక నూతన విషయ అవగాహనకు ఆకరమై నిలుస్తుంది. ఒక పుస్తకాన్ని చదవనివారికి; చదవాలను కొన్నవారికి ఆ విషయ పిండీకృత రూపాన్ని సరళ సుబోధకంగా కరతలామలకంగా వివరిస్తూ ఒక కౌతుకాన్ని కలిగిస్తుంది. ఆయా దృష్టి కోణాలలో ఆ పుస్తకాన్ని "చదవ"డానికి ఉద్యుక్తులౌతారు.

ఇక శ్రీయుత గాలి సుబ్బారావు మాష్టారి నేపథ్యం. ఆంగ్లభాషలో ఉన్నత పట్టభద్రులు. దశాబ్దాల అధ్యాపక అనుభవం.. నిక్కచ్చిగా వ్యవహరించే పాలనాదక్షులు. అన్నిటికీమించి మంచి - కాదు - గొప్ప "చదువరి". ఉద్యోగానంతర విశ్రాంత జీవితాన్ని అర్థవంతంగా, ఫలప్రదంగా మలచుకొన్న అపురూప శిల్పి. మహాభారతంలోని రాజధర్మాలను, పాలకుల విధి విధానాలను విశ్లేషించి.. సమకాలీన అరాజకీయ వ్యవస్థలోని పాలకుల వీపులపై చెర్నాకోలాతో చెళ్లున చరిచారు; అస్తవ్యస్త గమన రాజకీయ మదకరీంద్రంపై అంకుశాన్ని గుచ్చారు.

ఇప్పుడు రామాయణం మీద దృష్టిని సారించారు. నిజంగా చదివి రామాయణ సారాన్ని మెదడుకు పట్టించారు. రామాయణాన్ని చదివితే కలిగే వైయక్తిక పారమార్థిక రససిద్ధి; లౌకిక జ్ఞాన సముపార్జనలను సూటిగా; స్పష్టంగా.. సర్వజన సుబోధకంగా వివరించారు. రామాయణంలోని సత్యధర్మాలు; విలువలు; పాపపుణ్య వివేచన; పాత్ర చిత్రణ; విమర్శ; సందేశం అనే అంశాల మథనంతో 12 అధ్యాయాలుగా మాష్టారు సహృదయ విశ్లేషణ చేశారు. ఈ 12 అధ్యాయాలలో రెండు అంశాలను సమాంతరంగా

నడిపారు. ఒకటి రామాయణంలోని పాత్ర వైశిష్ట్యం. శ్రీరాముడు, సీత; లక్ష్మణుడు; భరత శత్రుఘ్నులు; హనుమంతుడు; రావణుడు; దశరథుడు; కైకేయి వంటి పాత్రల సాలోచన విశ్లేషణ. యుగాలు గడిచినా కాలానికి నిలిచి నిత్య సత్య అనుసరణీయాలుగా; అనునిత్య ఆదర్శ శిఖరాలుగా ఆ పాత్రలు ఎందుకు నిలిచాయో హృద్యంగా విశ్లేషించారు.

ఇక రెండవ కోణం. రామాయణంలోని నైతిక విలువల ప్రతిష్ఠాపన; మానవీయ విలువలు; సత్య, ధర్మ ప్రస్తావన; రాజ్యపాలన వంటి అంశాలను సోదాహరణంగా వివరించారు. తన అవగాహన, అవలోకన, పరిశీలన, పరిశోధనల పిండీకృత విషయాన్ని ఉపసంహారంలో సహృదయంతో వివేచించారు. అనురాగాలు; అనుబంధాలు; అపేక్షలు; అపోహలు; అహంకారాలు; అపార్థాల మధ్య జీవితం సుడులు తిరుగుతుంది. నీతి; న్యాయం; ధర్మం; చట్టం; సత్యం మధ్య వ్యక్తిత్వం రాటుదేలుతుంది. వీటి అవగాహన; ఆలోచన; ఆలోకన; ఆచరణలతో కాల పురుషులుగా నిలుస్తారు.. మెరుస్తారు. రామాయణంలోని పాత్రలు; విలువలు ఎందుకు శిథిలం కాలేదో.. కాలధర్మం చెందలేదో.. ఎందుకు సజీవంగా కాలక్రమణికలో నిలిచాయో శ్రీ సుబ్బారావుగారు చక్కగా విశదీకరించారు.. విశ్లేషించారు. అవగాహన ప్లస్ అనుభవం ఇంటూ విషయ వివేచన మైనస్ అహంకారం ఈజ్ ఈక్వల్ టు శ్రీ గాలి సుబ్బారావుగారు. కుటుంబ జీవన మూలాలు; నైతిక ధర్మాలు; ధర్మ ప్రతిష్ఠాపన; ఆదర్శ పాత్రలు వివిధ పార్శ్వాల ప్రతిష్ఠితమైనందున రామాయణం చదవాలని మాష్టారి ప్రతిపాదన. "రామాయణాన్ని ఎందుకు చదవాలంటే" మాష్టారు ప్రశ్నించి ఇందుకు చదవాలని చేసిన చక్కని విశ్లేషణ ఇది.

**- కందిమళ్ళ సాంబశివరావు**

బ్రహ్మర్షి, విద్యా వారిధి
**డా॥ వేదాన్తం సత్య శ్రీనివాస అయ్యంగార్**
ఎం.ఏ. (తెలుగు), ఎం.ఏ. (సంస్కృతం). పి.హెచ్.డి.,
రిటైర్డ్ అసోసియేట్ ప్రొఫెసర్ (సంస్కృతం)
యస్.యస్.&యన్. కళాశాల, నరసరావుపేట.

శ్రీ సదనం
2-4-35/సి, వేదాన్తంవారి వీధి,
ఏనుగుల బజారు, నరసరావుపేట

# నేటి తపస్వి తపన

వేదం రామాయణమైతే, వేదవేద్యుడు రాముడుగా అవతరించాడని విజ్ఞుల విశ్వాసం. అంటే జ్ఞానమయమైన ధార్మిక జీవనశైలికి రామాయణం మార్గదర్శమనటమే. వ్యక్తి-కుటుంబం-సమాజం ఎలా ఉండాలో చూపటమే కాక, సృష్టిలోని సర్వప్రాణులతో మానవుడెలా మెలగాలి, స్నేహం సహకారం ప్రేమబంధాలను నిలుపుకోవటంలో ఉన్న ఆనంద-శక్తి-సామర్థ్యాలను రసమయంగా హృదయాలకందించిన భారతీయ సాంస్కృతిక ఐతిహాసిక కావ్యం రామాయణం. జ్ఞానం - జ్ఞాని - సత్యాన్వేషుల మేలు కలయికయైన ప్రణవమే రామాయణం. ఉత్తమ సమాజ నిర్మాణానికి మార్గదర్శకుడైన నాయకుడిని లోకానికి అందించాలని తపించిన తపస్వి వాల్మీకికి లభించిన ఉత్తమోపదేశకుడే నారదుడు. మహాజ్ఞానియైన గురువు యొక్క ఉపదేశంతో మహాశ్రద్ధాలువైన శిష్యుడు పొందే జ్ఞానసాక్షాత్కారమే వాల్మీకికి లభించిన బ్రహ్మ సాక్షాత్కారం. ఇంతటి పూర్వరంగంతో భూతభవిష్యద్వర్తమాన కాలాలకు ఆదర్శవంతంగా తాను రచించిన గాథకు ప్రత్యక్షసాక్షిగా వాల్మీకి మహాకవి ఆవిష్కరించిన ఐతిహాసిక మహాకావ్యం రామాయణం. కనుకనే రామాయణం నిన్నటికి నేటికి రేపటికి ఉత్తమ సమాజ నిర్మాణ శిల్పిగా ఉన్నది, ఉంటున్నది, ఉండబోతున్నది.

ప్రపంచంలోని వివిధ భాషలలో అనువదింపబడి విశ్వసాహిత్యంగా పరిమళిస్తున్న రామాయణాన్ని అనేకమంది సంస్కృతాంధ్ర విద్వన్మణులు బహుముఖంగా తెనుగులోనికి అనువదించారు. బహుభాషావేత్త, బహుగ్రంథప్రణేత మహామహోపాధ్యాయ ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు - వారు తెనుగులోనికి అనువదించిన వచన రామాయణాన్ని అధ్యయనం చేసి రామాయణ సారాన్ని ఆస్వాదించిన మనీషి శ్రీ గాలి సుబ్బారావుగారు. ఆంగ్లోపన్యాసకులుగ ఆంగ్ల

సాహిత్యపు లోతులను ఎందరో విద్యార్థులకు దర్శింపజేసి వారి జీవన ప్రగతికి పూలబాటలు వేసిన శ్రీ సుబ్బారావుగారు, కళాశాల ప్రిన్సిపాల్‌గా విశ్రాంత జీవితాన్ననుభవిస్తూ నేటి తరానికి భారతీయ జీవన విలువలను తన సాహితీ ప్రస్థానం ద్వారా అవిశ్రాంతంగా అందిస్తున్న సాహితీ కృషీవలుడు. కనుకనే భారతీయ సాంస్కృతిక ఐతిహాసిక కావ్యంగా మాత్రమే కాకుండా జనజీవనాడిగ నిలచిన రామాయణకావ్యం సమాజానికి అందిస్తున్న మాధుర్యాన్ని, సందేశాన్ని, స్వారస్యాన్ని, జీవన విలువలను, జీవ సమతౌల్యాన్ని, నేటికీ ఆదర్శంగా నిలచిన రామాయణ కాలం నాటి కౌటుంబిక సామాజిక జీవన వైవిధ్యాన్ని, పాలనలోని విలువలను విధానాలను సునిశితంగా పరిశీలించిన శ్రీ సుబ్బారావుగారు తన అనుభూతిని సమాజానికి పంచాలని తాను తపస్వియై తపించి రచించిన రచనయే "రామాయణం ఎందుకు చదవాలి?'' అనే గ్రంథంగా మన జీవన కరదీపికయై నిలిచింది. మన సాంస్కృతిక వైజ్ఞానిక నాగరిక మానవీయ మాననీయ చైతన్యాన్ని సింహావలోకనం చేసుకోమంటున్నది.

సూర్యవంశీయుడైన రాముని గాథ రామాయణం. కనుకనే శ్రీ గాలి సుబ్బారావుగారు ద్వాదశాదిత్యులకు ప్రతీకగా 12 అధ్యాయాలుగా ఈ గ్రంథ రచన చేశారని భావిస్తున్నా. పదిరెండు అధ్యాయాలలో ప్రధానంగా ఇరువది అంశాలను స్పృశించారు శ్రీ గాలివారు. కానీ సందర్భానుగుణంగా ధర్మం, కుటుంబ వ్యవస్థకు మూలమైన భార్యాభర్తల, అన్నదమ్ముల బంధం, ప్రజాపాలకుడైన రాజునకు ఉండ వలసిన లక్షణాలు, స్నేహసౌరభం, సత్యధర్మాల తారతమ్యం, సత్యాసత్యమూల్యాలలో ఉన్న హస్తిమశకాంత వ్యత్యాసం, ఉపకార-అపకార గుణాలకు ప్రతీకలైన రామాయణ పాత్రలు, క్షమాధైర్యం సనాతన ధర్మాల మహిమ, భార్యాభర్తల బంధానికి కావలసిన అవగాహన, స్త్రీ వధ వలన కలిగే పాపం, స్త్రీ సంరక్షణ బాధ్యత, స్త్రీ వ్యామోహం వలన కలిగే వినాశనం, గూఢచర్యం, నేరపరిశోధన, నేరానికి తగిన శిక్ష, యుద్ధరీతులు మరెన్నో తాను ఆస్వాదించిన రామాయణ కావ్య విషయ ప్రాభావాలను కొండను అద్దంలో చూపినట్లు ఈ చిరు పొత్తంలో చూపించారు శ్రీ సుబ్బారావుగారు. చివరిగ కాలమహిమ సూర్యప్రభావం, రామాయణ మాహాత్మ్యలను వివరిస్తూ, నేటి బహుముఖీన సామాజిక రుగ్మతలకు రామాయణం దివ్యౌషధమని ఓ సాహితీమూర్తిగ,

వయోజ్ఞానవృద్ధునిగ జగతికి తన అక్షర సందేశాన్ని అందించిన శ్రీ గాలి సుబ్బారావుగారు బహుధా ప్రశంసామాత్రులు మాత్రమే కాదు. నేటి మేధావులకు చక్కని దిశానిర్దేశం చేసిన వేగుచుక్క. ఇది నేటి తపస్వి తపన అనటమెంతైనా సముచితం.

శతకోటి శ్లోక విస్తరమైన రామగాథలోని ప్రత్యక్షరం విశ్వ మానవుడిని చెడునుండి మంచికి మరల్చే దివ్య ప్రభావభరితమని సర్వదా శిరోధార్యమైన బుధకౌశిక మున్యుపదేశం. ఈ సందర్భంగా సర్వథా స్మరణీయమ్.

**చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్ ।**
**ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్ ॥**

వ్యాసపూర్ణిమ
ది. 16-7-2019
నరసరావుపేట.

ఆత్మీయతతో
**వేదాన్తం సత్య శ్రీనివాస అయ్యంగార్**

**పోలూరి వేంకట శివరామప్రసాదరావు**
విశ్రాంత ప్రధానోపాధ్యాయుడు
నరసరావుపేట.

అన్ని ధర్మములకు మూలము వేదము. ఆ వేదమునకు ప్రతిరూపమే రామాయణము. భారతీయ లౌకిక వాఙ్మయములో ఆదికావ్యము రామాయణము. చతుర్విధ పురుషార్థములను సాధించే ఉపాయములను రమణీయముగ చెప్పినది రామాయణము. కొండలు, నదులు భూమిపైనున్నంత కాలము ఉండే గ్రంథము రామాయణము. మానవుడు ఏ పరిస్థితిలో ఎలా నడవాలో చక్కగ చూపినది రామాయణము. వాల్మీకి భగవానులు రామాయణమును చెప్పిననాటినుండి ఈనాటి వరకు వివిధ ప్రక్రియలలో వందల వేల సంఖ్యలో వ్రాయబడినది, రామాయణము. రామాయణములో ఇంతమందిని ఆకర్షించిన విషయమేమి? ఎందుకు ఇంతమంది వ్రాశారు ? అసలు రామాయణములోనున్న విశేషము ఏమి ? శ్రీరాముని చరిత్రము రామాయణమని సాధారణ అర్థము. సీతా సాధ్వి చరిత్రము రామాయణము. అధర్మాన్ని జయించిన ధర్మము, రామాయణమునందలి ఇతివృత్తము. కనుక రామాయణము సార్వకాలీనము, సార్వజనీనము అయినది. అట్టి శ్రీరామాయణమును అందరు చదువవలసినదే. అయితే శ్రీరామాయణమును ఎందుకు చదవాలి అని అడిగితే, "మా దేవుడైన శ్రీరాముని కథ కనుక" అని కొందరు అంటారు. మరికొందరు "మర్యాదా పురుషోత్తముడైన శ్రీరాముని కథ కనుక" అంటారు. అలా కాకుండా అందరూ మెచ్చే సమాధానమే, ఈ గ్రంథము, "రామాయణం ఎందుకు చదవాలి?".

గ్రంథకర్త శ్రీ గాలి సుబ్బారావుగారు. వీరు ఆంగ్లమున స్నాతకోత్తర విద్యనభ్యసించిరి. ఆంగ్లమున గ్రంథములు వ్రాసిరి. ఆంధ్రమున "శతక త్రయము"ను రచించిరి. "మహాభారతము - రాజనీతి" అను గ్రంథమును వ్రాసిన రాజనీతిజ్ఞులు. వీరు డిగ్రీ కళాశాల ప్రిన్సిపాల్‌గ, స్పెషల్ ఆఫీసర్‌గ, విశ్వవిద్యాలయ పాలకమండలి సభ్యులుగ, ఎన్నో గురుతర బాధ్యతలను చక్కగ నిర్వహించిన ధీశాలురు. శ్రీ సుబ్బారావుగారు, శ్రీరామాయణమును సాకల్యముగ చదివి ఈ గ్రంథమును వ్రాసిరి.

“ఏదో వ్రాసితినంటే వ్రాసితిని” అన్నట్లుగాక, మూలమును సాకల్యముగ, నిశిత పరిశీలన చేసి, నేటి తరము వారికి అర్థమగునట్లు వ్రాసిరి. ఒక్క మాటలో చెప్పవలెనన్న, శ్రీ సుబ్బారావుగారు తమ జీవితానుభవములతో రామాయణమును మరల చెప్పిరి. ఒక్కొక్క పాత్రను గురించి చెప్పేటప్పుడు బాలకాండమునుండి ఉత్తర కాండము వరకు ఆ పాత్రల ప్రాధాన్యాన్ని వివరించిరి. రామాయణ కథను వివరిస్తూ పాత్రల స్వరూప స్వభావాలను గుణసంపత్తిని సంగ్రహముగా సూటిగ తెలిపిరి. పోలికలను, తేడాలను బేరీజు వేసి స్పష్టముగ పాత్రల వైశిష్ట్యాన్ని తెలిపిరి. సత్య, ధర్మ స్వరూప స్వభావాలు సార్వకాలీనములని, వాటిని లెస్సగా తెలిపిన శ్రీరామాయణము ఈనాటికీ ఆదర్శ గ్రంథమేనని సోదాహరణముగ, సోపపత్తికముగ నిరూపించిరి. శ్రీరామాయణ కావ్యాన్ని చక్కగా అధ్యయనం చేసిన, లోకంలో సుఖ, సంతోషాలు వర్ధిల్లుతాయని, అందరూ కోరుకొనే “రామరాజ్యం” తప్పక వస్తుందని తెలిపిరి. ఈ కాలంలో ఇటువంటి గ్రంథము అవసరము. బృహద్గ్రంథములను చదవటానికి సమయం చాలని విద్యార్థులకు, ఉద్యోగులకు, ఈ గ్రంథము ఎంతగానో ఉపయోగపడుతుంది.

ఈ సంసార మిదెన్ని జన్మలకు నేనీ మౌని వాల్మీకి భాషా సంక్రాత ఋణంబు తీర్పగలదా? అన్నారు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు. వాల్మీకి ఋషి ఋణమును తీర్చుకొనుటకే శ్రీ సుబ్బారావుగారు ఈ గ్రంథమును వ్రాసిరి. ఇటువంటి ఉత్తమ గ్రంథాలు మరెన్నిటినో శ్రీ సుబ్బారావుగారు వ్రాయాలనీ వ్రాసే ఆసక్తినీ, ఆ శక్తి ధర్మ విగ్రహుడైన శ్రీరామచంద్రుడు వీరికి ప్రసాదించాలని, హృదయ పూర్వకంగా కోరుకొంటున్నాను. ఇంత మంచి గ్రంథాన్ని గురించి నాలుగు మాటలు వ్రాసే అదృష్టాన్ని నాకు కలుగజేసిన శ్రీ గాలి సుబ్బారావుగారికి నమస్సుమాంజలుల నర్పిస్తూ......

లలితా సదనమ్,
ది. 12-6-2019

బుధజన విధేయుడు
**పోలూరి వేంకట శివరామప్రసాదరావు**

**డా॥ చేరెడ్డి మస్తాన్‌రెడ్డి**
ఎం.ఏ., పిహెచ్.డి. (గోల్డ్ మెడలిస్ట్)
ప్రిన్సిపాల్ (రిటైర్డ్)
నరసరావుపేట - 522 601
సెల్ : 9949179268

"మధురవక్త"
**డా॥ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి**
ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి. (గోల్డ్ మెడలిస్ట్)
తెలుగు లెక్చరర్ (రిటైర్డ్)
నరసరావుపేట. సెల్ : 8978525456

# ఇందుకు చదవాలి!

ఏ సాహిత్యానికైనా ప్రయోజనాలు రెండు. ఒకటి : ఆనందం, రెండవది : ఉపదేశం - నీతిబోధ. ఈ రెండూ పుష్కలంగా ఉన్న కావ్యం 'ఆదికవి' వాల్మీకి రచించిన రామాయణం. దీనిని ఎంతోమంది కవులు, కళాకారులు, మేధావులు అనేక కోణాలలో దర్శించి వారి వారి దృక్పథాలను వివిధ ప్రక్రియలలో మన కందించారు. ప్రస్తుతం మా ప్రియమిత్రులు ఆంధ్ర, ఆంగ్ల భాషా విశారదులు, పరిపాలనాదక్షులు, ఆదర్శ అధ్యాపకులు శ్రీ గాలి సుబ్బారావుగారు ఈ రామాయణాన్ని తాము దర్శించిన పితృభక్తి, భ్రాతృభక్తి, చిత్తస్థైర్యం, సత్యధర్మాలు, క్షమాగుణం, అపకార ఉపకారాలు, పాతివ్రత్యం, ఏకపత్నీవ్రతం, రాజనీతి మొదలైన కోణాలను ఈ గ్రంథరూపంలో మన కందించారు. ఇన్ని విశిష్ట లక్షణాలతో శోభిల్లుతున్నది కనుకనే రామాయణాన్ని తప్పకుండా చదవాలి అనే నిర్ణయానికి వచ్చి "రామాయణం ఎందుకు చదవాలి?" అన్న ఆకర్షణీయమైన శీర్షికతో ఈ గ్రంథాన్ని రచించారు.

ఆదర్శరాజ్యం - పాలకులు, మంత్రులు, ప్రజలు; ఆదర్శకుటుంబం - తల్లి, తండ్రి, కుమారులు, భార్యాభర్తలు; ఆదర్శ జీవితం - సన్మైత్రి, సేవాతత్పరత - వీటిని గురించి కావ్యంలో చాలా దూరానికీ, లోతుకీ వెళ్లి, నిశిత పరిశీలన చేసి, విషయాలను సూటిగానూ, ధాటిగానూ, సులభంగానూ, సుందరంగానూ సుబ్బారావుగారు మన కందించారు.

త్రేతాయుగంలో నడచిన "రామరాజ్యం" ఆధునిక యుగంలోనూ అనుసరణీయమైనదే! శ్రీ సుబ్బారావుగారు ఆ రామరాజ్య వైశిష్ట్యాన్ని ఈ గ్రంథంలో చక్కగా వివరించి వర్తమాన పరిపాలనం ఆ బాటలో నడచినట్లయితే మన భారతదేశం స్వర్గతుల్యమవుతుందనీ, అన్ని దేశాలకు ఆదర్శమవుతుందనీ ఉద్ఘాటించారు.

శ్రీ సుబ్బారావుగారు ఈ గ్రంథాన్ని ఆంగ్లీకరించి, ప్రచురించినట్లయితే దీనికి ప్రపంచవ్యాప్తి సిద్ధిస్తుంది. అద్యతన భావిలో ఈ కృషి జరగాలని కోరుకొంటున్నాం.

బాల్యాన్ని ఆనందమయంగా గడిపి, అసలైన జీవితంలోకి ప్రవేశిస్తున్న యువతీ యువకులు సుబ్బారావుగారు రచించిన ఈ గ్రంథాన్నీ, వారు చూపించిన కోణాలలో వాల్మీకి రామాయణాన్నీ ప్రశాంతంగా చదివి, వారు ఆశించిన పరమ ప్రయోజనాన్ని పొందాలనీ, సమాజ పురోభివృద్ధికి తోడ్పడాలనీ ఆశిస్తున్నాం. ఇంత మంచి గ్రంథాన్ని రచించి, మనందరికీ అందించిన మాన్యమిత్రులు శ్రీ సుబ్బారావుగారికి హార్దికమైన అభినందనల నందిస్తున్నాం.

**- చేరెడ్డి మస్తాన్‌రెడ్డి,**
**పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి.**

వికారి, ఏరువాక పూర్ణిమ,
ది. 17-06-2019, సోమవారం.

**పాతూరి కోటేశ్వరరావు**
విశ్రాంత అధ్యాపకులు
జె.కె.సి. కళాశాల, గుంటూరు

## రామాయణం ఎందుకు చదవాలి?

**రచయిత : గాలి సుబ్బారావు**

# ఒక సింహావలోకనం

గౌరవనీయులు గాలి సుబ్బారావుగారు వ్రాసిన ఈ గ్రంథాన్ని ప్రతి ఒక్కరూ చదవాలి. ఇంతకు ముందు చదివినవారు కూడా మరొక్కసారి సంశయనివృత్తుల కొరకు, రామాయణంలోని కొన్ని సంఘటనలకు పూర్వాపరాలు తెలుసుకొనుటకు, పదిమంది తెలియనివారికి వివరించుటకు తప్పకుండా చదవాలి. ఎంతో శ్రద్ధ తీసుకొని వివిధ రామాయణ గ్రంథాలను పరిశీలించి నాయకా నాయకిల జన్మ వృత్తాంతాలను వారు చేసిన తపస్సులను, పొందిన వరాలను వక్రబుద్ధులకు లభించిన శాపాలను చాలా వివరంగా "విశదీకరించుట" జరిగింది. ప్రజల్లో ఈ పురాణ గాథలపై ఉన్న అనుమానాలను నివృత్తి చేయటం జరిగింది. ఉదాహరణకు రావణుడు అశోకవనంలో నిస్సహాయురాలై ఉన్న సీతను బలాత్కరించ లేకపోవటానికి కారణం, తన పాతివ్రత్య ప్రభావం కాదని రావణుడు దేవకన్య రంభను బలాత్కరించిన శాప ఫలమని వివరించటం జరిగింది. ఇలాంటి అనేక సందేహాలను సుబ్బారావుగారు విస్తృత పరిశోధనా పఠనం ద్వారా విశదీకరించగలిగారు.

ఒక్కొక్క విషయాన్ని ఒక అధ్యాయంగా ఎంచుకొని అనేక అంశాలను ప్రస్తావించారు. రామాయణం అంటే ప్రామాణికంగా పరిగణించే అంశాలు :

1. తండ్రి మాట జవదాటని సంతానం
2. అన్నదమ్ముల మధ్య అనుబంధం
3. ఏక పత్నీ వ్రతం, పాతివ్రత్యం
4. రాజ్యాధినేత సుపరిపాలన

5. ప్రజా సంక్షేమం

6. నాయకుల ధీరోధాత్తత, పరాక్రమము

7. సత్యము, ధర్మము, న్యాయం మూల సూత్రంగా పాటించుట

8. ప్రజలు పాడిపంటలతో సుభిక్షంగా ఉండుట

9. అత్యుత్తమ స్నేహ సంబంధాలు - మొదలగునవి.

ఈ అంశాలన్నీ సుబ్బారావుగారు తన పుస్తకంలో సందర్భాన్ని బట్టి సంఘటనల ద్వారా, వ్యక్తుల ద్వారా, సన్నివేశాల ద్వారా ఆనాటి కాల మాన పరిస్థితుల ద్వారా గొప్పగా వివరించి "రామాయణం ఎందుకు చదవాలో" సమాధానాలు చదువరులే ఊహించుకునేటట్లు బహుళ సమాచారాన్ని అందజేశారు.

సుబ్బారావుగారు ఆంగ్లంలో పి.జి. డిగ్రీ చేసినా, ఆంగ్ల శాఖలో అధ్యాపకుడిగా పనిచేసినా, తెలుగు భాషపైనా, సాహిత్యం పైనా అభిరుచిని పెంచుకున్నాడు గాని పరిత్యజించలేదు. అందుకే ఆయనను ఆంగ్లాంధ్ర సాహిత్య సవ్యసాచి అని పిలువ వచ్చు. పురాణాలపై ప్రేమ తగ్గుతున్న ఈ రోజులలో ఇలాంటి పుస్తకాలు, తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు చదివి రాముడు, సీత, లక్ష్మణ, భరత, శతృఘ్నుల వ్యక్తిత్వాన్ని, రాజులకే రాజైన రావణుడి క్రూర ఆలోచనల వల్ల కలిగిన పతనాన్ని పిల్లలకు తెలియజెప్పాల్సిన అవసరం ఎంతైన ఉంది. ఎదిగే పిల్లలను మనోస్థైర్యం ఎవరు పెంచుతారు మనం తప్ప.

సుబ్బారావుగారిని భారతంపైన కూడా ఇలాంటి పరిశోధన చేసి "తిక్కన వ్యక్తిత్వ చిత్రీకరణ" ఆధారంగా మంచి పుస్తకం తీసుకురావాలని నా ఆకాంక్ష.

**- పాతూరి కోటేశ్వరరావు**

# కృతజ్ఞతలు

1. "రామాయణం ఎందుకు చదవాలి?" అనే గ్రంథాన్ని పరిశీలించి వారి అభిప్రాయాన్ని వ్యక్తపరచిన డా॥ కందిమళ్ళ సాంబశివరావుగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

2. అట్లే ఈ గ్రంథాన్ని నిశితంగా పరిశీలించి వారి అమూల్య అభిప్రాయాన్ని వ్రాసిన డా॥ వేదాన్తం సత్య శ్రీనివాస అయ్యంగార్ గారికి నా కృతజ్ఞతలు.

3. పండిత ప్రాచార్యులు శ్రీ పోలూరి వేంకట శివరామప్రసాదరావుగారికి నా కృతజ్ఞతలు.

4. డా॥ చేరెడ్డి మస్తాన్‌రెడ్డి, డా॥ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి గార్లకు నా కృతజ్ఞతలు.

5. చివరిగా తాను రసాయన శాస్త్రంలో ఎం.ఎస్సీ., చదివి అధ్యాపకులుగా పనిచేసి జె.కె.సి. కళాశాలలో పదవీ విరమణ చేసిన కెమిస్ట్రీ అధ్యాపకులు, సాహిత్యాభిలాషి శ్రీ పాతూరి కోటేశ్వరరావుగారికి నా కృతజ్ఞతలు.

6. ఈ గ్రంథములోని అక్షర దోషాలను సరిచేసిన డా॥ మడకా సత్యనారాయణ, డా॥ చేరెడ్డి మస్తాన్‌రెడ్డిగార్లకు నా కృతజ్ఞతలు.

7. ఈ రచనను పుస్తక రూపంలో అందించిన శ్రీ రాజేశ్వరి ఆఫ్‌సెట్, నరసరావుపేట వారికి - అందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఇట్లు
**రచయిత**

# రామాయణం ఎందుకు చదవాలి?

## విషయ సూచిక

# రామాయణం ఎందుకు చదవాలి?

## అధ్యాయము - 1

సీతారాములు మానవులుగా జన్మించినప్పటికీ వారు సాక్షాత్ లక్ష్మీదేవి, విష్ణుమూర్తి అవతారాలు. లోకంలో దుర్మార్గాన్ని అంతం చేయటానికి అవతరించిన అవతారమూర్తులు. ఈ విషయాన్ని తెలుసుకోవటానికి రామాయణం చదవాలి.

వాల్మీకి రామాయణం, వ్యాస మహాభారతము రెండూ కుటుంబ గాథలే. రెండూ భారతావనిలో గొప్ప ఇతిహాసాలే! మానవజాతి మనుగడ భారతదేశంలో ఉన్నంత కాలం ఈ మహోత్కృష్ట గ్రంథాల మనుగడ కొనసాగుతుంది. భారతీయ సంస్కృతికి, విలువలకు మూలం ఈ గ్రంథ ద్వయం.

**వాల్మీకి రామాయణ జననం :**

తపఃశాలియైన వాల్మీకి ఒక రోజున దేవర్షియైన నారదుని భూలోకంలో ఈనాడు మంచి గుణగణములు, గొప్ప పరాక్రమము కలవాడు, ధర్మము తెలిసినవాడు, కృతజ్ఞుడు, సత్యమైన వాక్కు, మంచి నడవడిక, సర్వప్రాణి హితమును ఆచరించువాడు, అసాధ్యములైన కార్యములను సాధించు సామర్థ్యము కలవాడు, మహాపురుషుడు ఎవడున్నాడని ప్రశ్నించాడు.

అందుకు నారదుడు ఇక్ష్వాకు వంశమునందు జన్మించిన రాముడు లోకమంతా ప్రసిద్ధుడని జవాబిచ్చాడు. అతడు సకల ధర్మములు తెలిసినవాడు, ఆడిన మాట తప్పనివాడు, ప్రజా హితము కోరుచుండువాడని చెప్పాడు.

రాముని చరితమును కావ్యముగా రచింపుమని బ్రహ్మ వాల్మీకిని ఆదేశించాడు. నారదుడు బ్రహ్మలోకమునకు వెళ్ళిన వెంటనే వాల్మీకి తమసా నదికి స్నానానికి వెళ్ళాడు. గురువిధేయుడైన భరద్వాజుడు వాల్మీకికి నారచీరలిచ్చాడు. ఇంతలో నదీతీరమున మనోహరంగా కూయుచున్న క్రౌంచ పక్షుల జంటను వాల్మీకి చూచాడు. ఒక బోయవాడు ఆ మహర్షి చూచుచుండగానే ఆ క్రౌంచ పక్షుల జంటలో

మగపక్షిని చంపాడు. ఆ మగపక్షి చనిపోయినందున ఆ పక్షి భార్యయైన ఆడ పక్షి విలపించింది. ఈ దృశ్యం చూచిన వాల్మీకికి జాలి కలిగింది. "రతి కాలమునందు చంపుట ధర్మము కాదని వాల్మీకి వాపోయాడు". వాల్మీకి మహర్షి ఆ బోయవానిని ఈవిధంగా శపించాడు. "జంట పక్షులలో ఒకదానిని చంపిన నీవు చాలాకాలము జీవించకుందువుగాక!" అన్నాడు. తన నోటినుండి ఇటువంటి వాక్యము వచ్చినదేమి అని వాల్మీకి ఆలోచించాడు. వాల్మీకి మాటలు విని శిష్యుడు "మానిషాద" అనే వాక్యమును స్వీకరించాడు. ఆ సమయమున చతుర్ముఖ బ్రహ్మ వాల్మీకిని చూచుటకు వచ్చాడు. వాల్మీకి బ్రహ్మ దేవునికి నమస్కరించి ఆతిథ్యమిచ్చాడు. రామకథను శ్లోకబద్ధము చేయమని బ్రహ్మ వాల్మీకికి చెప్పాడు. ఆ విధముగా రామాయణ రచన ప్రారంభమైనది. లోకములో నదులు, పర్వతాలు ఉన్నంత కాలము రామాయణం భూతలమందు వ్యాపించి ఉంటుంది (బాలకాండము 1,2 సర్గలు). రామాయణ శ్లోకాల సంఖ్య 24000.

## రామాయణాన్ని ఎందుకు చదవాలి? -

ఈ అంశాన్ని పరిశీలించేముందు మరుజన్మ ఉందని నమ్మితే **రామాయణాన్ని చదవాలి.** మరుజన్మ లేదని నమ్మితే రామాయణం చదవనవసరము లేదు. ఈ విషయాన్ని చదువరులు మొదటగా గుర్తుంచుకోవాలి. ఉత్తరకాండము 17వ సర్గములో "రావణుడు" అవమానించుటచే "వేదవతి" అగ్నిలో ప్రవేశించి జన్మాంతరమున జనకుని ఇంట సీతగా జన్మిస్తానన్నది.

ఆ తరువాత వేదవతి ఆమె చెప్పినట్లు జనకుని ఇంట అయోనిజగా నాగటి చాలులో దొరికినది. జనకుని ఇంట పెరిగి పెద్దదై యుక్తవయస్సులో దశరథ మహారాజు జ్యేష్ఠపుత్రుడైన రాముని పరిణయమాడింది.

## వేదవతి వృత్తాంతము (ఉత్తరకాండము 17వ సర్గము)

పూర్వము రావణుడు భూమి మీద సంచరించుచు హిమవత్పర్వత ప్రాంతమున దేవతాకన్యవలె ప్రకాశించుచున్న ఒక కన్య నియమము పాటించుచు కృష్ణాజినమును, జటలను ధరించి ఉండుట చూచి ఆమె సౌందర్యానికి మెచ్చి కామ

మోహితుడై ఆమె వివరములడిగి యౌవనవంతురాలైన ఆమెకు తపస్సు తగదని లోక సుఖములు అనుభవించుమని ఆమెతో అన్నాడు. అందుకు ఆమె తాను "కుశధ్వజుడ"ను బ్రహ్మర్షి కుమార్తెనని తన పేరు "వేదవతి" అని చెప్పింది. తన తండ్రి "విష్ణువు" తన అల్లుడిగా కావాలని కోరుకుంటున్నాడని, అందుకు "శంభువు" అనే దైత్య రాజు నిద్రించుచున్న తన తండ్రిని హత్య చేయగా తన తల్లి అగ్నిప్రవేశము చేసిందని చెప్పింది. అందువలన విష్ణువుకై తాను తపస్సు చేస్తున్నట్లు చెప్పింది. అట్లు చెప్పుచుండగా రావణుడు వేదవతి చేయి పట్టుకున్నాడు. అది అవమానంగా భావించిన ఆమె అగ్నిప్రవేశము చేసి జన్మాంతరము "సీత"గా జనకమహారాజు ఇంట నాగటిచాలులో జన్మిస్తానని శ్రీరాముని వివాహమాడి రావణ సంహారము చేస్తానని చెప్పింది.

వేదవతి చెప్పినట్లు ఆమె జన్మాంతరము జనకుని ఇంట నాగటిచాలులో అయోనిజగా జన్మించింది. యుక్తవయస్సులో దశరథ మహారాజు జ్యేష్ఠకుమారుడైన శ్రీరాముని వివాహమాడి రావణ సంహారానికి కారకురాలైంది. ఈ మరుజన్మ విషయాన్ని చదువరులు నమ్మకపోతే రామాయణం మీద నమ్మకముండదు. అందుకే నేను ముందుగానే రామాయణాన్ని చదవాలంటే మరుజన్మను నమ్మితేనే చదవమన్నాను.

## సీతారాములు సాక్షాత్ లక్ష్మీదేవి, విష్ణుమూర్తి అవతారాలు :

బాలకాండము 15వ సర్గములో దేవతలు రావణుని దుశ్చర్యలకు భయపడి చింతించుచున్న సమయంలో బ్రహ్మదేవుడు అచటికి రాగా ఆయనకు రావణుని దుశ్చర్యలను వివరించి తమకు రక్షణ కల్పించమని వేడుకొనగా ఆయన ఉపాయము ఆలోచించి తాను రావణునికిచ్చిన వరములలో మనుష్యులతో మరణము చెందుననే విషయాన్ని జ్ఞప్తికి తెచ్చుకొంటాడు. అంతలో విష్ణుమూర్తి అచటకు వచ్చాడు. లోకముల హితము కొరకై ఒక కార్యము చేయవలసిందిగా బ్రహ్మ శంఖ, చక్ర, గదాధారియైన విష్ణుమూర్తిని కోరాడు. అప్పుడు విష్ణుమూర్తి దేవతలను భయపడవద్దని చెప్పి "రావణుని వాని పుత్ర - పౌత్ర - అమాత్య - జ్ఞాతి - బాంధవులను యుద్ధమునందు సంహరించి పదకొండు వేల సంవత్సరములు మర్త్యలోకంలో నివసించి ఈ భూమిని పాలిస్తాన"ని

చెప్పాడు. దేవతలకు ఆ విధముగా వరమిచ్చి తగిన స్థానమును గూర్చి ఆలోచించి తదుపరి ఇక్ష్వాకు వంశ రాజైన దశరథ మహారాజు ఇంట రామునిగా జన్మించాడు.

ఈ సంఘటన రాముడు సాక్షాత్తు విష్ణుమూర్తి అవతారమే అని ఋజువు చేస్తున్నది.

**సీతారాములు సాక్షాత్ లక్ష్మీదేవి, విష్ణుమూర్తి అవతారమని మరొక ఆధారాన్ని చూద్దాం:**

యుద్ధకాండము ముప్పది ఐదవ సర్గములో ''మాల్యవంతుడు'' సీతాపహరణము తరువాత రామునితో సంధి చేసుకోమని రావణునికి సలహా ఇస్తూ "రాముడు మనుష్య రూపము ధరించిన విష్ణువే'' అని తాను భావించుచున్నట్లు చెప్పాడు.

బాలకాండము పందొమ్మిదవ సర్గములో విశ్వామిత్రుడు యాగరక్షణకై రాముని పంపమని దశరథుని కోరగా దశరథుడు దుఃఖించిన సందర్భంలో విశ్వామిత్రుడు రాముని గూర్చి ఈ విధముగా అభిప్రాయపడ్డాడు. "మహాత్ముడు, సత్య పరాక్రముడును అగు రాముని గూర్చి నాకు తెలియును. నీ సభలోనున్న మహర్షులకు తెలియును. రాముడు నీ కుమారుడగుటచే నీవాతని సామాన్యుడిగా తలపవచ్చును. అతని యథార్థ రూపము మావంటి తపోధనులకు తెలియునన్నాడు''.

దశరథుడు తన వద్ద అక్షౌహిణి సైన్యమున్నదని రాక్షసులను చంపగలరని విశ్వామిత్రునితో తెలుపగా అందుకతడు అంగీకరించలేదు. దీనిని బట్టి రాముని యథార్థ స్వరూపము విష్ణువే!

అయోధ్య కాండము 117వ సర్గములో అగ్నిప్రవేశము చేసిన సీతను చూచి కుబేరుడు, యముడు, ఇంద్రుడు, వరుణుడు, శ్రీమంతుడు, బ్రహ్మదేవుడు, మహేశ్వరుడు రాముని వద్దకు వచ్చి దుఃఖించుచున్న రాముని చూచి ఆ దేవతా శ్రేష్ఠులు ఈ విధముగా పలికారు. "సకల లోకములకు కర్తవు, జ్ఞానవంతులలో శ్రేష్ఠుడవు, సర్వసమర్థుడవైన నీవు సీత అగ్నిలోపడుచుండగా ఎందుకుపేక్షించినావు? నీవు రుద్రులలో ఎనిమిదవ రుద్రుడవు. సాధ్యులలో ఆరవ సాధ్యుడవు. అశ్వనీ దేవతలు నీ చెవులు, సూర్యచంద్రులు నీ నేత్రములు. నీవు లోకములకు ముందు,

వాటి నాశనాంతరము కూడా ఉండువాడవు''.

అప్పుడు రాముడు వారితో "నేను దశరథ కుమారుడైన రాముడను పేరుగల మానవుడను అనియే అనుకొనుచున్నాను. నేను ఎవరివాడను, ఎందువలన ఇట్లున్నానో భగవంతుడైన నీవు చెప్పుమ''ని బ్రహ్మదేవుని అడిగాడు.

అప్పుడు బ్రహ్మదేవుడు రాముని యదార్థ రూపమును చెప్పాడు. "సత్యమైన పరాక్రమము గల రామా! నేను చెప్పుచున్న సత్యమైన మాట వినుము. నీవు స్వప్రకాశ స్వరూపుడు, లక్ష్మీ సమేతుడు, చక్రము ఆయుధముగా గలవాడు, సర్వసమర్థుడైన నారాయణుడవు. నీవు ఒక కొమ్ముగల వరాహమూర్తివి. భూతకాలములోని శత్రువులను జయించినవాడవు. భవిష్యత్తుకు సంబంధించిన శత్రువులను జయించగలవాడవు. వినాశరహితము, మధ్యయందు, అంతమునందు కూడా సత్యము అయిన బ్రహ్మవే. లోకుల అత్యుత్తమ ధర్మము, యజ్ఞము నీవే. నీ సైన్యము అంతటా వ్యాపించియున్నది. నీవు నాల్గు భుజములు కలవాడవు. నీవు శార్ఙ్గమును ధరించువాడవు. ఇంద్రియములను నియమించువాడవు. మానవుల హృదయములలో నివసించువాడవు. గొప్పబలము కలవాడవు.... నీ నాభియందు పద్మమున్నది. యుద్ధములో వినాశము చేయువాడవు. మానవుల హృదయాలలో నివసించువాడవు. నీవు శరణుజొచ్చినవారిని రక్షింపగలిగిన శరణమని దేవర్షులు చెప్పెదరు. నీవే ఓంకారము. నీవే అందరికంటె ఉత్కృష్టుడవు. నీ పుట్టుకగాని, నాశనమునుగాని, నీవు ఎవరవు అను విషయముగాని ఎవరూ ఎరుగరు''.

ఇంకా ఈ విధముగా అన్నాడు, "రామా నేను నీ హృదయమును, సరస్వతీ దేవి నీ నాలుక. నీవు ఈ లోకమునందు రావణుని వధించుటకై మనుష్య శరీరము దాల్చినావు''.

బ్రహ్మదేవుడు రామునికి స్పష్టం చేసి విషయాలు రెండు. **1)** రాముడు సాక్షాత్తూ విష్ణువని, **2)** రావణుని చంపటానికి మనుష్య శరీరము దాల్చిన విష్ణువని. దీనిని బట్టి రాముడు సాక్షాత్తు విష్ణువే అనటానికి బలమైన, తిరుగులేని ఆధారము బ్రహ్మదేవుని సాక్ష్యము.

## సీత సాక్షాత్ లక్ష్మీదేవి

ఈమె అయోనిజ. నాగటిచాలులో జనక మహారాజుకి దొరికిన దివ్యశక్తి. రావణ సంహారము కొరకు సీతగా జనకుని ఇంట జన్మిస్తానని చెప్పిన వేదవతియే! వేదవతి పలికిన మాటలు సత్యము చేయటానికి అవతరించిన అవతారమూర్తి. కనుకనే అనేక కష్టాలను ఓర్చి జీవితాన్ని గడిపింది. ఆమె జీవితంలో సుఖం కంటె దుఃఖాన్నే అధికంగా అనుభవించింది. ఆమెకు 18 సంవత్సరాల వయస్సులో వివాహమైంది. యౌవనవతిగా ఉన్న సమయంలోనే భర్తననుసరించి నారచీరలు ధరించి అరణ్యవాసానికి వెళ్ళి రావణుని చేత అపహరించబడి లంకా నగరములో ఉన్న అశోక వనములో నానా ఇబ్బందులు, కష్టాలు, నరకయాతన అనుభవించింది.

ఒక దశలో ఆత్మహత్య చేసుకుందామనే ఆలోచన కూడా చేసి విరమించుకుంది. ఈ కష్టాలన్నీ రావణ సంహారము కోసమే భరించింది. రావణ సంహారము తరువాత అగ్నిప్రవేశము చేసిన మహాపతివ్రత కనుకనే భూమాత చివరగా తనలో ఇముడ్చుకుంది. చివరకు రాముని కూడా సీతను కోరుకొనుట ధర్మము కాదని ఆకాశవాణి పలికింది.

అగ్నిప్రవేశము చేసినపుడు దేవతాశ్రేష్ఠులందరూ రాముని దర్శించి ఎందుకు మిన్నకున్నావని ప్రశ్నించారు. "రాముడు సీతకోసమై సముద్రము వరకు వ్యాపించిన జగత్తునంతను తలక్రిందులు చేసినా యుక్తమేనని నా అభిప్రాయము. మూడులోకములపై అధికారము గొప్పదా, జనకుని కూతురైన సీత గొప్పదా అని చూచినచో, మూడు లోకములపై రాజ్యాధికారము సీతలో పదహారవపాలకు కూడా సరికాదు" అని హనుమంతుడు సీత శీలాన్ని సుందరకాండలో ప్రశంసించాడు. (సుందరకాండము 16వ సర్గము)

సీత పవిత్రురాలని అగ్నిదేవుడు రామునికి చెప్పగా తనకా విషయము తెలుసుననియు లోకాపవాదముగా ఆ విధముగా చేశానని రాముడు పలికాడు. ఆ సందర్భమున రాముడు ఈ విధముగా చెప్పాడు, "కాంతి సూర్యుని విడచి ఎక్కడకీ వెళ్ళనట్లు సీత నన్ను విడచి మరెవ్వరి సంబంధమును పొందదు. జనకుని పుత్రియైన

సీతతో సమానమైన పవిత్రురాలు ఈ మూడులోకములలో కూడా లేద"న్నాడు. (యుద్ధకాండము)

సుందరకాండము 19వ సర్గములో సీతను గూర్చి ఈ విధముగా చెప్పబడ్డది. ఇది ఆమె గొప్పతనానికి, పాతివ్రత్యానికి నిదర్శనము. "ఆమె రామధ్యానమను గొప్ప తపస్సు చేయుచుండెను. సీత దేవతా స్త్రీవలె ఉండెను. దుఃఖార్తురాలై అంజలి ఘటించి, రావణునికి రాముని చేతిలో పరాభవము కలుగవలెనని మనస్సులో కోరుకొనుచుండెను''.

అయోధ్యకాండములో జనకమహారాజు యజ్ఞము కోసము భూమిని దున్నుచుండగా ఆ నేలను బ్రద్దలు కొట్టుకొని పైకి వచ్చి జనకుని కుమార్తె అయినది. అప్పుడు ఆకాశవాణి జనకునితో ఈ విధముగా పలికినది. "ఓ రాజా! ఈమె మనుష్యజాతికి చెందినది కాదు. సాటిలేని దేవతా స్త్రీ. ధర్మము చేత ఈమె నీకు కూతురు అను విషయము సత్యమే!''

స్వయముగా ఆకాశవాణి ఆమె పుట్టుక సందర్భమున జనక మహారాజుతో సీత దేవతా స్త్రీ, మనుష్య జాతి స్త్రీ కాదని చెప్పటము సీత అవతారమూర్తి అనటానికి ప్రబల తార్కాణము. (అయోధ్యకాండము 118వ సర్గము)

## లోకంలో దుర్మార్గాన్ని అంతం చేయటానికి అవతరించిన అవతారమూర్తులు సీతారాములు :

ఈ వాక్యభాగాన్ని పరిశీలిద్దాము. రాముని కాలములో ఉన్న దుర్మార్గమేమి? అది ఎవరు చేశారు? దీనిని ఎవరు అంతమొందించారు? ఇత్యాది ప్రశ్నలకు సమాధానాలను పరిశీలిద్దాము.

రామునికాలంలో అయోధ్య నగరంలో దుర్మార్గులు ఉన్నట్లు రామాయణం ద్వారా తెలియుట లేదు. సముద్రము ఒడ్డునున్న లంకానగరములో లంకాధీశుడైన రావణుడు అత్యంత దుర్మార్గుడు, త్రిలోక కంటకుడు.

1) దశకంఠుడు (రావణుడు) దేవతలను, మునులను, ఋషులను, ఋత్విక్కులను, బ్రాహ్మణులను అవమానించి వేధించుచుండెను. అందుచే రాక్షసులు తన యజ్ఞానికి

భంగము కావించుచున్నారని వారిని చంపుటకు దశరథ మహారాజు దగ్గరకు వచ్చి రామలక్ష్మణులను కొనిపోయాడు విశ్వామిత్రుడు. "తాటక" అనే రాక్షసిని రాముడు తన బాణములచే చంపాడు.

**2)** రావణుడు వేయి సంవత్సరముల తపస్సు చేసి బ్రహ్మదేవుని నుండి వరాలు పొందాడు. మొదట తనకు మరణము లేకుండా వరమియ్యవలసినదిగా బ్రహ్మదేవుణ్ణి కోరగా అది కుదరదని బ్రహ్మ చెప్పాడు. ఒక్క మానవునినుండి తప్ప తనకు ఎవరి ద్వారా మరణము లేకుండ బ్రహ్మదేవుడినుండి వరములు పొంది చివరకు త్రిలోక కంటకుడయ్యాడు. అతని దుర్మార్గాలకు అంతము లేకుండా ఉన్నది.

**3)** రావణుడు ఎందరో అందమైన స్త్రీలను అపహరించి తన భార్యలుగా చేసికొని లంకానగరములో అతి విలాసవంతంగా జీవించుచున్నాడు. నీతి నియమాలు లేకుండా ప్రవర్తించుచున్నాడు. చివరకు తన మాయా స్వరూపమైన కపట సన్యాసి వేషములో వచ్చి అరణ్యావాసములో ఉన్న సీతను కూడా అపహరించి లంకా నగరానికి తీసుకెళ్ళి అశోకవనములో ఉంచి ఆడ రాక్షసులను కాపలాగా ఉంచాడు. సీతను తన భార్యగా ఉండమని అనేకసార్లు బ్రతిమాలి సీత విననందున చివరకు రెండు మాసముల గడువు విధించాడు.

**4)** బ్రహ్మ ఇచ్చిన వర గర్వముతో తనతో యుద్ధానికి రావలసినదిగా ముల్లోకములు తిరిగి ప్రసిద్ధులందరిని అడిగాడు. ఇంద్రుడు, కుబేరుడు, వరుణుడు, బలిచక్రవర్తి, కాలుడు, సూర్యుడు ఇలా ఎందరితోనో యుద్ధానికి కాలుదువ్వాడు. కుబేరుని చంపి జయింతుని అతని పుష్పకవిమానాన్ని అపహరించాడు. ఇంద్రుని భార్య శచీదేవిని ఇబ్బందిపెట్టాడు.

రాముడు సీతను అపహరించిన తరువాత రావణుని తమ్ముళ్లైన కుంభకర్ణుడు, విభీషణుడు ఇంకా అనేకమంది రావణ సన్నిహితులు సీతను రామునికి ఇచ్చివేయమని సలహా ఇచ్చినా వారి మాట వినలేదు. చివరకు తన భార్యగా ఉంటుందో లేదో సీతయే తేల్చుకోవాలని రెండు మాసముల గడువు విధించిన క్రూరుడు రావణుడు.

చివరకు హనుమంతుడు, సుగ్రీవుడు వానర సహాయము ద్వారా లంకానగరానికి రామలక్ష్మణులు బయలుదేరారు. హనుమంతుడు ముందుగా సముద్రాన్ని లంఘించి లంకా నగర ప్రవేశము చేసి కష్టించి సీత జాడను తెలుసుకొని వచ్చాడు. నీలుడు మొదలైన వానర వీరుల సహాయంతో సముద్రము మీద సేతువు నిర్మాణము గావించి రామలక్ష్మణులు వానర సైన్యంతో లంకా నగర ప్రవేశము చేసి రావణుని మీద యుద్ధము ప్రకటించినారు. రాముడు ఇంద్రుడు ఇచ్చిన రథమునెక్కి బ్రహ్మాస్త్రముతో రావణుని సంహారము చేశాడు.

ఇక్కడ చదువరులకు ఒక సందేహము రావచ్చు. సీతను అపహరించిన రావణుడు ఆమెను ఎందుకు బలాత్కారముగా అనుభవించలేదు. దీనికి కారణములున్నాయి.

అవి **1)** అప్సరస స్త్రీలందరిలో అందగత్తె రంభ. ఆమెను రావణుడు బలవంతంగా అనుభవించాడు. ఈ విషయము తెలిసిన "నలకూబరుడు" రావణుని శపించాడు. ఇకపై రావణుడు కామము లేని మరియొక ఏ స్త్రీని కూడా పొందజాలడన్నాడు. రావణుడు కామము లేని ఎవరినైన అవమానించినచో అప్పుడతని శిరస్సు ఏడుముక్కలుగా బ్రద్దలగునని శపించాడు. (ఉత్తరకాండము **26**వ సర్గము) సీత కామము లేని స్త్రీ గనుక రావణుడు ఆమెను అనుభవించలేదు.

**2)** రావణునికున్న మరియొక శాపాన్ని చూద్దాము. ఒక రోజున రాక్షస రాజైన రావణుడు మహాపార్శ్వునికి తన రహస్యమొకటి చెప్పాడు. పూర్వము చాలా కాలము క్రితము "పుంజక స్థల" అను అప్సర స్త్రీ తనను చూచి భయపడ్డదని, ఆమెను వివస్త్రను చేసి బలాత్కారముగా రావణుడు అనుభవించానన్నాడు. ఈ విషయము బ్రహ్మదేవునికి తెలిసింది. బ్రహ్మదేవుడు రావణుని శపించాడు. ఆ రోజు మొదలుగా రావణుడు పరస్త్రీని బలాత్కారముగా అనుభవించనట్లయితే అతని శిరస్సు నూరు ముక్కలుగా బ్రద్దలగుతుంది, సందేహము లేదన్నాడు. **(**యుద్ధకాండము **13**వ సర్గము**)**

# అధ్యాయము - 2

తండ్రి ఆజ్ఞను పాటించిన రాముని చరితాన్ని, గుణగణాలను, పరాక్రమాన్ని - అన్నదమ్ముల అనుబంధాన్ని తెలుసుకోవటానికి మనం రామాయణం చదవాలి.

రాముని చరితాన్ని, గుణగణాలను, పరాక్రమాన్ని తెలుసుకునే ముందు దశరథ పుత్రుల జననాన్ని గురించి తెలుసుకోవాలి.

**రామలక్ష్మణుల భరత శత్రుఘ్నుల జననము :**

అయోధ్య రాజ్యాన్ని పాలించుచున్న ఇక్ష్వాకు వంశపు రాజైన దశరథ మహారాజుకు చాలాకాలము వరకు సంతానము లేదు. సంతానము కొరకు అశ్వమేధయాగము చేయవలయుననే సంకల్పమును తన మంత్రులకు, పురోహితులకు తెలియజేశాడు. తమసా నదీ తీరాన ఏర్పాట్లుగావించి ఒక సంవత్సరము ముందుగా అశ్వాన్ని వదిలారు. ఆ యాగము మూడు దినములు జరిగినది. దశరథుడు యజ్ఞము చేయుచుండగా అగ్నికుండమునుండి సాటి లేని కాంతిగల ఒక మహాభూతము ఆవిర్భవించింది. ఆ భూతము రెండు చేతులతో ఒక మేలిమి బంగారు పాత్రను అత్యాదరముతో తెచ్చి దివ్యపాయసము నిండిన ఆ పాత్రను దశరథునకిచ్చింది. ఆ పాయసమును దశరథ మహారాజు తన భార్యలకు ఇచ్చాడు. ఆ తరువాత దశరథుని భార్యలు గర్భముదాల్చి కౌసల్య రామునికి, సుమిత్ర లక్ష్మణ - శత్రుఘ్నులకు, కైకేయి భరతునికి జన్మనిచ్చారు. ఇది దశరథ పుత్రుల జనన కథ.

**తండ్రి ఆజ్ఞను పాలించిన రాముని చరితము :**

దశరథ మహారాజు వయోభారము పెరుగుచున్న కొద్దీ రాజ్యాన్ని ఎవరు పాలించగలరు అనే ఆలోచన మొదలై తన జ్యేష్ఠపుత్రుడైన రాముడు అన్నివిధాల

రాజ్యపాలనకు తగినవాడని భావించి తన మంత్రులతోను, పురోహితులతోను మాట్లాడాడు. దశరథుడు ఈ విధముగా అన్నాడు, "లోకమునకు సంబంధించిన ఈ ధర్మము చాలా బరువైనది. శౌర్యధైర్యాది రూపమగు రాజప్రభావము చేతనే నిలుపుకొనదగినది. జితేంద్రియులు కానివారు దీనిని మోయజాలరు. అట్టి ధర్మమును మోసి మోసి అలసిపోయాను. విశ్రాంతి తీసుకోదలచుకొనుచున్నాను. నా జ్యేష్ఠ కుమారుడైన రాముడు పరాక్రమమునందు దేవేంద్రునితో సమానుడు. శత్రువులను జయించువాడు. అన్ని గుణముల చేతను, అతడు నన్ను పోలినవాడన్నాడు.

రామ పట్టాభిషేకానికి ఏర్పాట్లుగావించమని దశరథుడు తన మంత్రులతోను, పురోహితులతోను చెప్పాడు. ఈ వార్త అయోధ్య ప్రజలలో వ్యాప్తి చెందింది. ప్రజల మనోభావాలు కూడా రాముడు అయోధ్య రాజుగా అన్నివిధాల తగినవాడని అనుకొన్నారు. ప్రజలను పాలించుటలో మెలకువలు తెలిసిన రాముడొక్కడే తమను పాలింప సమర్ధుడని ప్రజలు భావించారు. రాముడు ప్రభువుకావాలని వారందరూ కోరుచున్నారు. రామ పట్టాభిషేక వార్త విని ప్రజల ఆనందోత్సాహాలకు అవధులు లేవు. అందరూ రామ పట్టాభిషేకానికి ఎదురు చూస్తున్నారు. వారు ఉత్సాహ సంతోషాలతో వీధులను, వారి ఇండ్లను అలంకరించుకొన్నారు.

ఆ సమయమున రామ పట్టాభిషేకవార్త దశరథ మహారాజు మూడవ భార్యయైన కైకేయి సేవకురాలు, మంథర చెవిన పడ్డది. ఆమె కైకేయిని పెడత్రోవ పట్టించటానికి నానా విధాలుగా ప్రయత్నించి కృతకృత్యురాలైంది. మొదట్లో కైకేయికి రాముని గురించి గొప్ప సదభిప్రాయమున్నది. అందువలన ఆమె రాముని గురించి ఈ విధముగా అన్నది. "నాకు భరతుడు ఎంత ప్రేమ పాత్రుడో రాముడు కూడా అంతయే. వాస్తవమున రాముడు అధిక ప్రేమపాత్రుడు. అతడు కౌసల్యకంటె ఎక్కువగా నన్ను సేవించుచుండును కదా? రామునికి రాజ్యమున్నచో అది భరతునికి కూడ ఉన్నట్లే. రామునకు తాను, తన సోదరులు అను భేదబుద్ధియే లేదు కదా?" అన్నది.

"తినగ తినగ వేము తియ్యగానుండు" అన్న వాక్యానుసారము మంథర పెడమాటలు, స్వార్ధపూరిత వచనాలు తలకెక్కిన కైకేయి దశరథ మహారాజు దగ్గరకు

వెళ్ళి పూర్వము దేవాసుర యుద్ధములో మహారాజుకు తాను చేసిన సహాయమునకు ఆయన తనకిచ్చిన రెండు వరాల సంగతేమని ప్రశ్నించినది. అవి 1) రాముని పదునాలుగు సంవత్సరాలు అరణ్యావాసానికి పంపుటయు, 2) భరతునికి అయోధ్య రాజ్య పట్టాభిషేకము చేయమని కోరింది. ఆడిన మాట తప్పకుండ ఉండటానికి, ధర్మాన్ని పాటించుటకు విధిలేని పరిస్థితిలో దశరథ మహారాజు కైకేయి కోరికలను ఒప్పుకొని రాముని అరణ్యావాసానికి వెళ్ళవలసినదిగా తెలియజేసి, భరతుని పట్టాభిషేకానికి ఏర్పాట్లు కావించాడు. ఇది పూర్తిగా తనకు ఇష్టం లేని, నచ్చని పని. ఈ ధర్మనిర్ణయము రాముని మీద ఆధారపడియున్నది. రాముడు తండ్రి ఆజ్ఞను పాటించకపోతే దశరథుడు చేయగలిగినది ఏమీ లేదు. అప్పటికీ లక్ష్మణుడు రామ నిర్ణయాన్ని వ్యతిరేకించి శౌర్యప్రతాపాలు చూపించి బలవంతంగా రాజ్యాధికారాన్ని చేపడదామని అన్నా అని అన్నగారైన రామునికి సలహా ఇచ్చినప్పటికీ రాముడు అందుకు అంగీకరించలేదు. తండ్రి ఆజ్ఞానుసారము నారచీరలు ధరించి సీతాలక్ష్మణ సమేతంగా రాముడు అరణ్యావాసానికి ప్రజల అశ్రునయనాల మధ్య వెళ్ళాడు. ఆ విధంగా రాముడు తండ్రి ఆజ్ఞను పాటించిన ధీరచరితగలవాడు. (అయోధ్యకాండము)

దశరథుని ఆజ్ఞప్రకారము అరణ్యావాసానికి వెళ్ళేముందు తల్లియైన కౌసల్య అంతఃపురమునకేగిన రాముడు తల్లితో తన తండ్రి ఆజ్ఞను పాటించి అరణ్యావాసానికేగుచున్నాని ఈ విధంగా చెప్పాడు. “తండ్రి ఆజ్ఞను అతిక్రమించు సామర్ధ్యము నాకు లేదు. శిరస్సువంచి నిన్ను వేడుకొనుచున్నాను. నేను అరణ్యమునకు వెళ్ళవలసియున్నది. ధర్మములు తెలిసినవాడూ, వ్రతములు ఆచరించువాడు, పండితుడు అయిన కండు మహర్షి తండ్రియాజ్ఞను పాటించుచు గోవును కూడా చంపినాడు. మనకులమందే పుట్టిన సగరకుమారులు పూర్వము తండ్రి ఆజ్ఞచే భూమిని త్రవ్వుచూ భయంకరమైన సంఘ మరణమును పొందిరి. జమదగ్ని కుమారుడైన పరశురాముడు తండ్రి ఆజ్ఞను అనుసరించి అరణ్యములో గండ్రగొడ్డలితో తల్లియైన రేణుకను స్వయముగా నరికినాడు. వీరును దేవతా సమానులగు ఎందరో ఇతరులును, తమ తండ్రి ఆజ్ఞను వ్యర్థము కాకుండునట్లు చేసిరి. నేను కూడా నా తండ్రికిష్టమైన కార్యమును చేసెదననెను”.

పై విషయాలు రాముని నిర్ణయాన్ని, తండ్రి ఆజ్ఞపట్ల తనకున్న భక్తి శ్రద్ధలను, గౌరవాన్ని తెలియజేస్తున్నాయి. (అయోధ్యకాండము)

**రాముని గుణగణములు :**

రాముని గుణగణాలు రామాయణం ఏడు కాండాలలోను వివరించబడ్డాయి. అవన్నీ వ్రాయాలంటే ఒక పెద్ద పుస్తకమవుతుంది. కనుక రాముని గుణగణాలను క్లుప్తంగా పరిశీలిద్దాము.

రాముడు దివ్యమైన గుణములచే దేవేంద్రునితో సమానుడు. సత్యమైన పరాక్రమము కలవాడు. ఇక్ష్వాకు వంశములో పుట్టిన రాజులందరిలో గొప్పవాడు. లోక ప్రసిద్ధుడైన సత్పురుషుడు. సత్యధర్మములందాసక్తి కలవాడు. ధనము, లక్ష్మియు ఎన్నడును ఎడబాయకుండునట్లు చేయగలవాడు. అన్ని ధర్మములు తెలిసినవాడు. సత్యసంధుడు. ఉత్తమశీలవంతుడు. అసూయ లేనివాడు. ఓర్పు గలవాడు. దుఃఖితులను ఓదార్చువాడు. మృదువైనవాడు. కృతజ్ఞుడు. ఇంద్రియములు అదుపులో ఉంచుకొనువాడు. సుకుమార స్వభావము కలవాడు. స్థిరమైన ఆలోచన కలవాడు. సర్వదా మంగళప్రదుడు. ప్రాణులకు ప్రియములైన మాటలు పలుకువాడు. సత్యమునే చెప్పువాడు.

దేవతలకును, అసురులకును, మానవులకు తెలిసిన అన్ని అస్త్రములందును ప్రావీణ్యము కలవాడు. యథావిధిగా సాంగోపాంగములైన వేదములను అధ్యయనము చేసినవాడు. సంగీత విద్యలో రాముని మించినవారీ లోకములో లేరు. సత్పురుషుడు. దైన్యమునెరుగనివాడు. గొప్ప బుద్ధి కలవాడు. శ్రేష్ఠమైన బ్రాహ్మణుల వద్ద అన్ని విషయములయందును శిక్షణను పొందినవాడు. ఎవ్వరికైనా ఆపద వచ్చినపుడు రాముడు చాలా దుఃఖించును. ఎవరికి అభివృద్ధి కలిగినను అది చూచి, పుత్రునకు కలిగిన అభివృద్ధిని చూచి తండ్రి సంతోషించినట్లు సంతోషించును. ఆశ్రితులకు మేలు చేయువాడు. శౌర్యవీర్య పరాక్రమముల చేత సాక్షాత్తూ విష్ణువే అన్నట్లున్నవాడు. ప్రజలను పాలించుటలోని మెలకువలు తెలిసినవాడు. (అయోధ్యకాండము)

## రాముని పరాక్రమము :

కిష్కింధకాండము 15వ సర్గములో రాముని పరాక్రమమును గురించి "వాలి" భార్యయైన "తార" ఈవిధముగా చెప్పినది. "రాముడు సాధు జనులకు నివాసవృక్షము వంటివాడు. ఆపదలలో ఉన్నవారికి ఉత్తమమైన గతి (రక్షకుడు). దుఃఖితులకు ఆశ్రయము కలవాడు. కీర్తికి ఒకే స్థానము. రాముడు లౌకిక జ్ఞానము, శాస్త్రజ్ఞానము కలవాడు. పితృాజ్ఞను పాలించువాడు. హిమవత్పర్వతము ధాతువులకు వలె సద్గుణములకు గొప్ప గనివంటివాడు. మహాత్ముడైన రాముడు యుద్ధములో జయింప శక్యము కాని బలపరాక్రమాదులు కలవాడు. అట్టి రామునితో నీకు విరోధము తగదని" వాలిని హెచ్చరించినది.

**సందర్భము :** వాలి తన తమ్ముడైన సుగ్రీవుని రాజ్యమునుండి వెడలగొట్టెను. సుగ్రీవుడు ఋష్యమూక పర్వతముపై తనతో స్నేహము పొందిన రామునితో కలిసి తన వృత్తాంతాన్ని విన్నవించి రాముని సహాయాన్ని కోరాడు. రాముడు వాలిని హతమార్చి సుగ్రీవునికి కిష్కింధ రాజ్యపట్టాభిషిక్తుని చేస్తానని మాట ఇచ్చాడు. రామునితో యుద్ధానికి తలపడవద్దని తార తన భర్తయైన వాలిని హెచ్చరించింది. రాముని పరాక్రమమును గురించి వాలికి వివరించినది.

**ఏ వ్యక్తి అయినా అధర్మపరుడైయుండి తనకంటె బలవంతునితో వైరము వలదని రామాయణం తేటతెల్లము చేస్తుంది.**

కిష్కింధకాండము 16వ సర్గములో రాముడు వాలిని హతమారుస్తాడు. ఈ సంఘటన రాముని పరాక్రమాన్ని తెలియజేసేదే.

వాలిని హతమార్చిన విధానాన్ని వర్ణిస్తూ రచయిత ఈ విధంగా వ్రాశారు. "వజ్రమువంటి ధ్వనిగలది, రామునిచే విడువబడినదై వాలి వక్షస్థలము మీద పడినది. వాలి ఆ బాణము చేత గొప్ప వేగముతో కొట్టబడినవాడై నేలమీద పడిపోయెను". ఇది రాముని పరాక్రమాన్ని తెలియజేసే అంశమే.

దేవేంద్రుని వంటి కాంతిగల వాలిని చంపగానే వానర సైన్యమంతా పారిపోయింది. ఇది కూడా రాముని పరాక్రమానికి నిదర్శనమే!

వాలి చనిపోయిన తరువాత అతని భార్య "తార'' విలపించుచు రాముని వద్దకు వెళ్ళి ఈ విధంగా అన్నది. "నీవు ఊహింపశక్యముగాని స్వరూపము గలవాడవు. ఎదిరింప శక్యముగానివాడవు. జితేంద్రియుడవు... నీవు గొప్ప సామర్ధ్యము కలవాడవు''. ఈ మాటలన్నీ రాముని పరాక్రమానికి చిహ్నాలే!

రాముడు ఊహింపశక్యముగాని గొప్ప పరాక్రమము కలవాడు. యుద్ధకాండము చదివితే మనకు రాముని పరాక్రమము స్పష్టంగా కనబడుతుంది.

రావణుడు కపట సన్యాసి రూపంలో సీత ఉన్న ఆశ్రమానికి వచ్చి ఆమెను బలవంతంగా లంకా నగరానికి ఎత్తుకెళ్ళాడు. ఇది రావణుడు చేసిన అపరాధము. శుకుణ్ణి సుగ్రీవుని వద్దకు దూతగా పంపిన సందర్భంలో సుగ్రీవుడు శుకునితో ఈ విధంగా చెప్పాడు. రావణుడు మూఢుడు. అంతర్ధానము పొందినా, సూర్యమండలములోనికిగాని, పాతాళమునకుగాని వెళ్ళినా, ఈశ్వరుని పాదములవద్దకు చేరినా రాముడు రావణుని విడచిపెట్టడని చెప్పమన్నాడు. రావణుని రక్షింపగలిగినవాడు ఈ మూడు లోకాల్లో తనకెవ్వరూ కనబడటం లేదన్నాడు. ఇది రాముని పరాక్రమానికి ఒక ఉదాహరణ.

మహా బలవంతుడైన రావణుని ఇంద్రుడిచ్చిన రథములో వెళ్ళి బ్రహ్మదేవుడిచ్చిన బ్రహ్మాస్త్రముతో రావణుని వక్షస్థలాన్ని చీల్చి చంపాడు రాముడు. భారీకాయం గల కుంభకర్ణుని చంపాడు రాముడు. రావణుని పుత్రులతో సహా అతని ముఖ్య అనుచరగణాన్నంతా యుద్ధంలో మట్టుపెట్టాడు రాముడు.రావణుడికి అత్యంత ముఖ్యుడైన మఖరాక్షుణ్ణి చంపాడు రాముడు. రావణుని తమ్ముడైన విభీషణుడు రాముని పక్షాన చేరాడు. అతను తప్ప రావణుని సోదరులను, కుమారులను అందరినీ చంపాడు రాముడు. ఇది అనితరసాధ్యమైన రాముని పరాక్రమము.

విశ్వామిత్రుని యజ్ఞానికి అవరోధం కలిగిస్తున్న "తాటక'' అనే రాక్షసిని హతమార్చి, సుబాహువు, మారీచుడు అను రాక్షసులని వారి పరివారముతో సహా సుదూర తీరాలకు తరిమివేశాడు రాముడు. రాముడు విష్ణువని తన తపోబలముచే

గ్రహించిన విశ్వామిత్రుడు దశరథ మహారాజు ఇంటికి వచ్చి రాముని తన యాగరక్షణకు పంపవలసిందిగా అభ్యర్థించాడు. ఇది రాముని పరాక్రమానికి ఒక ఉదాహరణ.

ఈ విధంగా రాముని పరాక్రమము అసమానమైనది. అతడు పరాక్రమ సంపన్నుడు.

రాముడు తన పరాక్రమముచే తానే ఆశ్రిత జన బాంధవుడయ్యాడు. వాలిని హతమార్చి సుగ్రీవునికి కిష్కింధకు పట్టాభిషిక్తుని చేశాడు. రావణుని హతమార్చి విభీషణుని లంకానగరానికి పట్టాభిషిక్తుని గావించాడు. ఈ చర్యలన్నీ రాముని పరాక్రమాన్ని విశదపరచేవే!

## అన్నదమ్ముల అనుబంధం (రామ-లక్ష్మణ-భరత-శత్రుఘ్నుల అనుబంధం)

భారతీయ విలువలన్నీ రామాయణంలో నిక్షిప్తమై ఉన్నాయి. అందుకనే కొన్ని వేల సంవత్సరాలనుండి ప్రపంచ దేశాల్లో భారతదేశానికి ఒక ప్రత్యేకత ఉన్నది. భారతదేశ ప్రత్యేకతంతా భారతీయ విలువల్లోనే ఉన్నది. వాటిలో అన్నదమ్ముల అనుబంధం ఒకటి.

ఇది చాలా విస్తృతమైన అంశము. సౌలభ్యము కోసం ఈ అంశాన్ని రెండు భాగాలుగా విభజించాలి.

మొదటిది రామ-లక్ష్మణ-భరత-శతృఘ్నుల గుణగణాలు. రెండవది రామలక్ష్మణుల స్నేహము, రామ భరతుల అనుబంధము, రామ శతృఘ్నుల స్నేహము. ఈ రెండు అంశాలు రామాయణంలో ఏ ఒక్క కాండములోను లేవు. అన్ని కాండాలలో నిక్షిప్తమై ఉన్నాయి.

**1. రాముని గుణగణములు :** ఈ అంశాన్ని రాముడు సాక్షాత్తూ విష్ణుమూర్తి అనే శీర్షికన చూశాము. రాముని మిగతా గుణగణాలను పరిశీలిద్దాము.

**బాలకాండము :**

రాముని ఆకారము : రాముని శరీరము హెచ్చుతగ్గులు లేక (బాహ్యరూపము)

సమముగా విభజింపబడిన అవయవములతో శోభిల్లుచుండును. అతని శరీరము మరీ పొట్టిగాగాని, పొడవుగాగాని కాకుండా సమముగా ఉండెను. అతడి శరీరపు ఛాయ చాలా చక్కనిది. తేజస్సు ప్రశంసనీయమైనది. వక్షస్థలము కండలతేరి ఉంటుంది. నేత్రములు విశాలమైనవి. అవయవాల శోభ ప్రశస్తమైనది. సాముద్రిక శాస్త్రములో చెప్పిన శుభ లక్షణములన్నీ అతని శరీరములో కనబడును.

**రాముని గుణగణములు :** రాముడు లోక ధర్మములు తెలిసినవాడు. ఆడినమాట తప్పనివాడు. ఎల్లప్పుడూ ప్రజాహితమునే కోరుచుండువాడు. యశస్సు కలవాడు. అన్ని విషయములు తెలిసినవాడు. పరిశుద్ధమైనవాడు. శ్రీమంతుడైన ఆ రాముడు బ్రహ్మదేవునితో సమానుడు. అందరినీ పోషించువాడు. శత్రువినాశకుడు. సమస్త ప్రాణి సముదాయమును రక్షించువాడు. ధర్మ సంరక్షకుడు. వేదవేదాంగముల రహస్యములన్నీ తెలిసినావాడు. ధనుర్వేదములో అతని ప్రావీణ్యము సాటిలేనిది. సకల శాస్త్రముల సారము తెలిసిన ఆ రాముని జ్ఞాపకశక్తి, ప్రతిభ పాటవాలు చాలా ప్రశంసనీయమైనవి. అతడు సకల ప్రజలకు ఇష్టుడు. సాధు స్వభావం కలవాడు. మనస్సులో ఎప్పుడూ దైన్యమెరుగనివాడు.

రాముడు పరాక్రమములో విష్ణువు వంటివాడు. క్రోధము వచ్చినచో ప్రళయ కాలాగ్నితో సమానుడు. ఓర్పులో భూమితో సమానుడు. దానం చేయుటలో కుబేరుని వంటివాడు. సత్యము విషయములో సాక్షాత్తు రెండవ ధర్మదేవతయే.

## 2. అయోధ్యకాండలో చెప్పబడిన రాముని గుణగణములు :

రాముడు దయాళువు. కోపమును జయించినవాడు. బ్రాహ్మణులకు ఎదురేగి సన్మానించువాడు. ఎల్లప్పుడును తనను తన అదుపులో ఉంచుకొనువాడు. ధర్మములన్నియు తెలిసినవాడు. మంచి వాక్చాతుర్యము కలవాడు. లోకంలో జన్మించిన ఏకైక సత్పురుషుడు. అణకువ కలవాడు. ఋజువర్తనము కలవాడు. సమయస్ఫూర్తి కలవాడు. పెద్దల విషయమున ధర్మమైన భక్తి కలవాడు. మొండిపట్టు లేనివాడు. కాలమునుబట్టి పోవుచుండువాడు. రాజ్యపాలనకు అన్నివిధముల తగినవాడు. తల్లిదండ్రులయందు భక్తి కలవాడు. అన్నదమ్ముల పట్ల ప్రేమ ఆదరము

కలవాడు. అందుకనే కైకేయి నాకు భరతుడు ఎంతో రాముడు కూడా అంతే అన్నది.

అనేకమంది దుర్మార్గులైన రాక్షసులను చంపిన పరాక్రమశాలి. శివధనుస్సుని విరచి తండ్రి అనుమతితో సీతను చేపట్టినవాడు. తండ్రి ఆజ్ఞ పాటించి వనవాసానికి వెళ్ళి తండ్రి మాటను, సత్యధర్మాలను కాపాడిన గొప్ప బుద్ధికలవాడు. దుర్వాసుని విషయమున నియమము పాటించలేదని ప్రియ సోదరుడైన లక్ష్మణుని కూడా వదలివేసిన సత్య తత్పరుడు.

యుద్ధకాండములో రాముని పరాక్రమము చూడగలము. అనేకమంది దుర్మార్గులైన రావణ సన్నిహితులను, రావణ పుత్రులను, సోదరుడు కుంభకర్ణుని, చివరకు రావణుని సైతం బ్రహ్మ ఇచ్చిన బ్రహ్మాస్త్రముతో చంపాడు.

కిష్కింధకాండములో వాలిని హతమార్చి సుగ్రీవునికి కిష్కింధ రాజ్య పట్టాభిషేకము గావించాడు.

సుందరకాండములో సీత వృత్తాంతాన్ని తెలుసుకొని హనుమంతుడిచ్చిన చూడామణిని చూచి సంతోషపడ్డాడు.

ఉత్తరకాండములో సీతను అగ్నిప్రవేశము చేయించి లోకోపవాదమును పోగొట్టుకొని అయోధ్య రాజ్యానికి పట్టాభిషిక్తుడయ్యాడు.

## 2) లక్ష్మణుని గుణగణాలు :

రామాయణంలో లక్ష్మణుని పాత్ర చాలా కీలకమైంది. అద్భుతమైంది. లక్ష్మణుడు లేకుండా రాముడు విజయము సాధించలేదు. రాముని విజయము వెనుక లక్ష్మణుని పాత్ర కీలకమైంది. లక్ష్మణుడు రామునికి సోదరుడే కాదు, మిత్రుడు కూడా. కష్టాలలో రాముని వెంట ఉన్న ఆపద్బాంధవుడు. అనేక సందర్భాలలో రాముడు దుఃఖించినపుడు అతనిని ఓదార్చాడు, ధైర్యము చెప్పాడు. వెన్నుదన్నుగా అతని వెంట నిలిచాడు. అట్టి లక్ష్మణుని గుణగణాలను పరిశీలిద్దాము.

నిషాదరాజైన గుహుడు లక్ష్మణుని ఉత్తమ గుణాలను ఈ విధముగా వర్ణించాడు. లక్ష్మణుడు సద్గుణవంతుడు. రామునితో అరణ్యవాసానికి వెళ్ళి గంగా

నదిని దాటు సందర్భమున ఆ రాత్రి నిషాదరాజైన గుహుని ఆతిథ్యాన్ని స్వీకరించి రామునికి కాపలాదారుడిగా గుహునితోపాటు ఆ రాత్రి శరచాప ఖడ్గమును ధరించి సోదరుని రక్షణకై పూర్తిగా మేల్కొని ఉన్నాడు. గుహుడు సుఖకరమైన శయ్యను లక్ష్మణుని కొరకు ఏర్పాటు చేశానని తాను రామునికి కాపలాగా ఉంటాననీ, లక్ష్మణుని శయ్యపై నిద్రించవలసిందిగా కోరగా అందుకు నిరాకరించి గుహునితోపాటు రాముని రక్షణ నిమిత్తమై రాత్రంతా మేల్కొని ఉన్నాడు. రామునిపై లక్ష్మణునికున్న భక్తి తత్పరత, భాతృ ప్రేమ ఎనలేనివి. భూలోకంలో తనకంటె ప్రియుడు రామునికెవ్వరూ లేరని లక్ష్మణుడు తెలిపాడు. రాముని దయ, అనుగ్రహము వలన గొప్ప కీర్తిని, అధికమైన ధర్మమును పొందవలెనని కోరుచున్నట్లు గుహునితో చెప్పాడు. చతురంగ సైన్యమును కూడా యుద్ధంలో ఎదిరింపగల సమర్థుడు లక్ష్మణుడు.

లక్ష్మణుడు మంచి ధైర్యము గలవాడు - కనుకనే శూర్పణఖ ముక్కుచెవులు రాముని ఆజ్ఞ మీద కోశాడు. ఇతడు రామునికి చాలా ఇష్టమైన తమ్ముడు. రాముని యందు సహజమైన ప్రేమ గలవాడు.

లక్ష్మణుడు ధైర్యశాలి కనుకనే విశ్వామిత్రుడు యజ్ఞరక్షణకు రామలక్ష్మణులను ఇద్దరిని తీసుకెళ్ళాడు. జనక మహారాజు యొక్క అయోనిజ పుత్రిక సీత. అసలు పుత్రిక ఊర్మిళ. సీత రాముని వివాహమాడగా, లక్ష్మణుడు ఊర్మిళను వివాహమాడాడు.

సోదరునిపై ప్రేమతో అరణ్యవాసానికి సీతా రాములను వెంబడించి వారికి పర్ణశాలను నిర్మించి కాపలాదారుడిగా ఉన్నాడు. సీత మాటను విధిలేని పరిస్థితిలో శిరసావహించి మాయ లేడిని వెంబడించి వెళ్ళాడు.

రావణ తనయుడు ఇంద్రజిత్తు (మేఘనాధుడు)తో యుద్ధము చేసే విషయములో అన్నగారైన రామునితో చర్చించాడు. ఇంద్రజిత్తుతో ఘోరమైన యుద్ధము చేసి హతమార్చాడు. అరణ్యవాసానికి దండకారణ్యానికి వెళ్ళిన రాముడు సుఖమైన ప్రదేశాన్ని చూడమని చెప్పగా వెంటనే పర్ణశాలను నిర్మించాడు. లక్ష్మణునికి మంచి పరిశీలనా శక్తి ఉన్నది. మాయలేడి రూపమున వచ్చినవానిని మారీచునిగా

అనుమానించాడు. అతని అనుమానం నిజమైంది. వనవాస సమయములో సీతారాములకు తగిన ఆహారాన్ని సమకూర్చాడు. సీతను కపట వేషములో రావణుడు అపహరించినపుడు రాముడు దండించగా మిన్నకున్నాడు. "అయోముఖి" అను రాక్షసి ముక్కుచెవులు, స్తనములను లక్ష్మణుడు ఖండించాడు. కబంధుడు రామలక్ష్మణులను పట్టుకున్నపుడు రాముడు వ్యధ చెందలేదు. లక్ష్మణుడు వ్యధ చెందాడు. ఋష్యమూక పర్వతము మీద ఉన్న రామలక్ష్మణులను సుగ్రీవుడు కలవటానికి వచ్చినపుడు లక్ష్మణుడు అతనిని అనుమానించి భయపెట్టాడు. ఇది లక్ష్మణుని నిశిత పరిశీలనా శక్తి.

ఇంద్రజిత్తు మాయా సీతను సృష్టించి వధించినపుడు సీత చనిపోయిందని రాముడు దుఃఖించుచుండగా లక్ష్మణుడు అతనిని ఓదార్చాడు.

లక్ష్మణుడు ఉత్తరకాండములో సీతను అరణ్యములో వదలిపెట్టుటకు వెళ్ళినపుడు ఆమెకు ఆమె పరిత్యాగాన్ని గురించి వివరించి దుఃఖించాడు.

దుర్వాసుడు శపించుననే భయముచేత రామునికి అతని రాకను గూర్చి చెప్పాడు. ముందుగా అనుమతి లేకుండ దుర్వాసుని అనుమతించినందుకు రాముడు లక్ష్మణుని విడచాడు. దానితో లక్ష్మణుడు శరీరముతో స్వర్గానికి వెళ్ళాడు.

క్లుప్తంగా చెప్పాలంటే లక్ష్మణుడు ఒక అత్యుత్తమమైన, రాముని తరువాత రామాయణంలో ప్రముఖమైన పాత్ర. భ్రాతృ ప్రేమ అధికముగా గలవాడు. తల్లియైన సుమిత్ర, తండ్రియైన దశరథ మహారాజుకంటె అన్నగారైన రాముని మీద అధికమైన గౌరవము, ప్రేమ కలవాడు. ధైర్యశాలి. శౌర్యవీర్యవంతుడు. వివాహమైన కొద్దికాలానికే సంసార జీవితాన్ని వదిలి అన్నగారిని అరణ్యవాసానికి వెంబడించిన త్యాగశీలి.

రాముడు ఒక సందర్భంలో లక్ష్మణుని గూర్చి ఈ విధంగా చెప్పాడు. "నీవు మంచి స్నేహశీలము కలవాడవు. ధర్మనిరతుడైన వీరుడవు. ఎల్లపుడును సన్మార్గమునందే సంచరించుచున్నావు. నాకు ప్రాణమువంటివాడవు. సర్వదా నా ఆజ్ఞలను అనుసరించు సోదరుడివే కాదు, మిత్రుడవు కూడా". రాముని మాటలను బట్టి లక్ష్మణుని గుణగణములను చదువరులు గ్రహించగలరు.

## 3) భరతుడు :

దశరథుని మూడవ భార్య కైకేయి. కైకేయి పుత్రుడు భరతుడు. భరతునికి అయోధ్య రాజ్య పట్టాభిషేకము కైకేయి దశరథునినుండి పొందిన వరము అయినప్పటికీ, తనకు రాజ్యకాంక్ష లేదు. పట్టాభిషిక్తుడగుటకు ఇష్టపడనివాడు. కన్నతల్లి స్వార్థాన్ని ఖండించి, నానావిధములుగా తల్లిని నిందించిన ధర్మనిరతుడు. రామాయణం చదివినవారెవరైనా భరతునికి రాజ్యకాంక్ష ఉన్నదనే విషయాన్ని అంగీకరించరు. అంతటి మహోన్నతమైన వ్యక్తిత్వము కలవాడు. రాముడే అయోధ్య రాజు కావాలని మనసావాచా అభిలషించిన గొప్ప నిస్వార్థ బుద్ధికలవాడు. కైకేయి భరతునికి పట్టాభిషేక వరము పొందినపుడు భరత, శతృఘ్నులు అయోధ్య నగరములో లేరు. భరతుని మేనమామను దర్శించుటకు వెళ్ళినారు. రామ పట్టాభిషేకము కబురు అంది బయలుదేరి అయోధ్య నగరానికి వచ్చారు. అయోధ్య నగరము కళావిహీనంగా ఉండటము చూసి హతాశులయ్యారు. ఆవేదన చెందారు. రాముడు దండకారణ్యములో ఉన్నాడని తెలుసుకొని తన సైన్యముతో దండకారణ్యానికి బయలుదేరాడు భరతుడు. రాముని అయోధ్య నగర రాజు చేయవలయునని భరతుని సంకల్పము. అందుకు రాముని ఒప్పించి తీసుకురావలయుననునది భరతుని నిశ్చయము. దండకారణ్యము వెళ్ళి రాముని దర్శించి తనకు రాజ్యపాలన వద్దని, తానుకూడా రామునితోపాటే అరణ్యావాసము చేస్తానన్నాడు. రాముని అయోధ్య నగర పాలన చేయుమని, తాను అరణ్యావాసము చేస్తానని రామునితో చెప్పాడు. రాముడు లేని అయోధ్యను తాను చూడలేనన్నాడు. అన్నగారైన రాముని అయోధ్యకు వచ్చి రాజ్యాన్ని స్వీకరించవలసిందిగా నానావిధాలుగా ప్రాధేయపడ్డాడు. అందుకు రాముడు అంగీకరించలేదు. భరతునికి నచ్చచెప్పి సకల ధర్మాలను కాపాడవలసిన బాధ్యత తన మీద ఉన్నదని అయోధ్య ప్రజల కుశలమడిగాడు. దశరథుని మరణవార్తను భరతుడు రామునికి చెప్పగా విని బహుగా దుఃఖించి పిండ ప్రదానము చేశాడు.

అయోధ్యకాండలో రాజ్య విషయమున రామభరతుల మధ్య రసవత్తరమైన సంభాషణ జరిగింది. చివరకు భరతుడు అన్నగారైన రాముని మాటను మన్నించి రాముని పాదుకలను అయోధ్య నగరానికి తెచ్చి సింహాసనము మీదనుంచి

నందిగ్రామము నుండి అయోధ్య పాలన చేశాడు.

రావణ సంహారము తరువాత సీతారాములు, దేవతలు, సుగ్రీవ, విభీషణులు అయోధ్యకు రాగా వారిని సాదరంగా ఆహ్వానించి భరతుడు అయోధ్య రాజ్యపాలనను రామునికి అప్పగించిన మహామనీషి భరతుడు.

రామునికి అన్ని విధాల తగిన తమ్ముడు భరతుడు. భరతుని ప్రవర్తనలోకాని, గుణగణాలలోగాని ఏవిధమైన లోపము లేదు. తల్లి స్వార్థాన్ని నిస్వార్థంగా ఖండించిన వ్యక్తి.

భరతుని గుణగణాలను క్లుప్తంగా చెప్పాలంటె "ధర్మాత్ముడు, సత్యమునే పలుకువాడు. వక్రత్వము లేనివాడు. ధర్మ-అర్థ-కామముల, తత్త్వము తెలిసినవాడు. దుష్టులను శిక్షించుటయందు శ్రద్ధకలవాడు. భరతునియందు నీతి, వినయము, సత్యము స్థిరముగా ఉన్నవి. అతడు తగిన పరాక్రమము కలవాడు. దేశకాలములు తెలిసిన రాజు. (కిష్కింధకాండము, 18వ సర్గము)

**4) శత్రుఘ్నుడు :**

ఇతడు సుమిత్ర పుత్రుడు. లక్ష్మణునికి సోదరుడు. లక్ష్మణుడు రామునితో ఎక్కువ స్నేహముగా ఉన్నట్లే శత్రుఘ్నుడు భరతునితో ఎక్కువ స్నేహముగా ఉంటాడు. ఇతనిని గురించి రామాయణంలో ఎక్కువగా వ్రాయలేదు. పరిమితమైన పాత్రనే చెప్పాలి. అన్నదమ్ముల పట్ల ప్రేమ కలవాడు.

రాముని మాట జవదాటనివాడు. రాముని పట్ల వినయవిధేయతలు, శ్రద్ధ, భక్తి, ప్రేమ ఉన్నవాడు. రాముడు శత్రుఘ్నునికి "లవణాసురుని" చంపే బాధ్యతను అప్పగించాడు. శత్రుఘ్నుడు ఈ బాధ్యతను ప్రేమతో అంగీకరించాడు. లవణాసురుడు వరములు పొందినవాడు. శూలాన్ని వరముగా పొందాడు. అతనిని చంపటం అంత తేలికైన పని కాదు. రాముడు శత్రుఘ్నుని లవణాసురుని శూలముకున్న శక్తిని వివరించాడు. ఏ సమయమున అతనిని చంపవలెనో మెలకువలు చెప్పాడు. యుద్ధంలో శత్రుఘ్నుడు లవణాసురుడిని చంపాడు.

ఆ తరువాత రాముని ఆజ్ఞ ప్రకారము తన ఇరువురు కుమారులైన 1)

సుబాహువు 2) శత్రఘాతికి మధుర, వైదిశ నగరాలను నిర్మించి ఇచ్చి అయోధ్య నగరానికి వెళ్ళాడు.

**రామ-లక్ష్మణుల, భరత-శత్రుఘ్నుల అనుబంధము** (అన్నదమ్ముల అనుబంధం)

భారతీయ సంస్కారము, సాంప్రదాయాలు, విలువలు కుటుంబ వ్యవస్థ నుండి సామాజిక జీవనానికి వ్యాప్తి చెందాయి. భారతీయ కుటుంబ వ్యవస్థ అతి ప్రాచీనమైంది, విలువల పోషణకు నిలయమైంది. రామాయణం ముఖ్యంగా విలువల స్థాపనకు పెద్దపీట వేసింది. తల్లిదండ్రుల పట్ల భక్తిశ్రద్ధలు, గౌరవము, అన్నదమ్ముల మధ్య ప్రేమానురాగాలు, వాత్సల్యపూరిత వాతావరణము - ఇవన్నీ దశరథుని ఇంట పుష్కలంగా ఉన్నాయి. ముందుగా రామలక్ష్మణుల అనుబంధాన్ని పరిశీలిద్దాము.

**రామలక్ష్మణుల అనుబంధం**

లోగడ రామలక్ష్మణుల గుణగణాల ప్రస్తావన చేశాను. రామలక్ష్మణుల అనుబంధం లాంటి భ్రాతృ ప్రేమ ఏ ఇతర కావ్యాలలోను మనకు కనిపించదు. అంతటి అపూర్వ సహోదరులు వారు. ఒకరిని ఎడబాసి మరొకరు మనుగడ సాగించలేరు. లక్ష్మణుడు రామునికి చాలా ఇష్టమైన తమ్ముడు. రాముడు అరణ్యవాసానికి వెళ్ళే ముందు అతడు వారించినను అన్నవెంట నారచీరలు ధరించి బయలుదేరాడు. రాముని రక్షకునిగా పని చేశాడు. రాముని ఆజ్ఞ ప్రకారము దండకారణ్యములో తగిన ప్రదేశములో పర్ణశాలను ఏర్పాటు చేసి దాని కాపలాదారుడిగా ఉన్నాడు లక్ష్మణుడు. సంపదలను వృద్ధి పొందించు లక్ష్మణుడు రామునికి సకల ప్రియములను చేకూర్చుటకు శరీరమును కూడా అర్పించుటకై వెనుకాడలేదు. లక్ష్మణుడు రాముని బహిః ప్రాణము. అపార స్నేహితుడు. లక్ష్మణుడు ప్రక్కన లేకున్నచో రాముడు నిద్రపోయెడివాడు కాదు.

జనక మహారాజు కన్న కూతురు ఊర్మిళను వివాహమాడిన కొద్దికాలమునకే సంసార సుఖాలను పరిత్యజించి అన్నగారిని వెంబడించి అరణ్యవాసానికి వెళ్ళాడు. సీతాపహరణము తరువాత రాముడు దుఃఖితుడు కాగా లక్ష్మణుడు ఓదార్చాడు. ధైర్యము చెప్పాడు. రావణుడు సీతతో కలసి దితి గర్భములో ప్రవేశించి దాగినా

కూడా అతనిని చంపుతాతనన్నాడు లక్ష్మణుడు. రాముని ఉత్సాహంగా ఉండమన్నాడు. ఉత్సాహవంతునకు లోకంలో లభించనిదేది లేదన్నాడు. అందువలననేకాబోలు రాముడు లక్ష్మణుడు నా ప్రాణము. అతడు లేకుండా నేను బ్రతకలేనన్నాడు.

అరణ్యావాస సమయమున సీతాపహరణము తరువాత "ప్రసవణ గిరి" మీద నివసించుచున్న రాముడు సీతను తలచుకొని బహుగా దుఃఖించుచున్న సమయమున లక్ష్మణుడు రాముని ఓదార్చి కర్తవ్య బోధ చేశాడు. దుఃఖమును వీడుమని, యుద్ధ సన్నద్ధుడు కమ్మని రామునికి కర్తవ్య బోధ చేశాడు.

శూర్పణఖ తనను వివాహం చేసుకోమని రాముని కోరగా అందుకు నిరాకరించిన రాముడు ఎగతాళిగా లక్ష్మణుడు చేసుకుంటాడన్నాడు. లక్ష్మణునికి శూర్పణఖ ముక్కుచెవులు కోయుమని చెప్పాడు. అదే విధంగా లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు చెవులు కోశాడు. ఇది అన్నదమ్ముల అనుబంధం.

రామ పట్టాభిషేకానికి అయోధ్య నగరములో అన్ని ఏర్పాట్లు పూర్తయిన పిమ్మట కైకేయి కోరిక వలన రామ పట్టాభిషేకము రద్దయిన సందర్భమున లక్ష్మణుడు బలాత్కారముగా రాజ్యము చేజిక్కించుకొమ్మని రాముని ప్రేరేపించాడు. రామా! ఈ విషయము ఇతరులకెవ్వరికి తెలియక మునుపే తన సహాయముతో రాజ్యాధికారమును చేజిక్కించుకొనుమన్నాడు. ఈ అయోధ్య నగరము నీకు ఎదురు తిరిగినచో దీనిని తీవ్రమైన బాణములతో మనుష్య శూన్యముగా చేసెదనన్నాడు. భరతుని పక్షమున చెందినవారిని, అతని హితము కోరువారిని, అందరిని వధించెదనన్నాడు. లోకంలో మెత్తనివానిని జనులు తిరస్కరిస్తారన్నాడు. అందుకు రాముడు అంగీకరించలేదు. ఇది అన్నదమ్ముల అనుబంధం.

రామలక్ష్మణభరతులు ఒకరు లేకుండా ఒకరు జీవించలేరనే విషయాన్ని సుందరకాండములో హనుమంతుడు వ్యక్తం చేస్తాడు. హనుమంతుడు లంకా నగరమును సీత కోసమై వెతకగా మొదట ఆమె హనుమంతునికి కనిపించలేదు. ఈ విషయాన్ని రామునికి చెబితే తట్టుకోలేక మరణిస్తాడని, ఆ వార్త విని లక్ష్మణుడు మరణిస్తాడని, ఆ ఇద్దరి మరణవార్త విని భరతుడు మరణిస్తాడని హనుమంతుడు

ఆలోచిస్తాడు. సీత కనబడలేదు అనే వార్త రామునికి చెప్పకుండ లంకానగరాన్ని మరొకసారి వెతకడానికి నిశ్చయించుకుంటాడు హనుమంతుడు. ఈ సంఘటన అన్నదమ్ముల అనుబంధానికి మచ్చుతునక. అన్నదమ్ములలో ఒకరు మరణిస్తే మరొకరు బ్రతకలేని పరిస్థితి. ఇంతకంటె అన్నదమ్ముల అనుబంధం ఏ ఇతర కావ్యములలోను మనకు కనిపించదు. (సుందరకాండము 13వ సర్గము)

లక్ష్మణుడు రూపము చేత, అనురాగము చేత, గుణముల చేత కూడా రాముని వంటివాడే. లక్ష్మణుడు సింహమువంటి మూపు, పెద్ద బాహువులు కలవాడు. రాముని తండ్రివలె చూచుకొనుచున్నాడు.

లంకా నగరానికి వెళ్ళటానికి సముద్రము మీద సేతువు నిర్మించకపోతే లంకలో ప్రవేశించుట హనుమంతునికి తప్ప మిగతా వానరులకు, రామలక్ష్మణులకు అసంభవము. సేతువుని నిర్మించిన పిమ్మట రాముడు లోక వినాశ సూచకములైన శకునములను లక్ష్మణునకు చూపి లంకపై దండయాత్ర చేశారు. రామలక్ష్మణులు అంతకు ముందే సువేల పర్వతము నుండి లంకా నగరాన్ని చూశారు.

రామలక్ష్మణులు రావణ పుత్రుడైన ఇంద్రజిత్తుతో యుద్ధము చేయగా వారిని ఇంద్రజిత్తు నాగపాశముతో బంధించాడు. ఇంద్రజిత్తు ప్రయోగించిన బాణముచే వారు సంజ్ఞను కోల్పోవగా వానరులు శోకించారు. గరుత్మంతుడు వారిని నాగపాశమునుండి విడిపించాడు. రాముడు ముందుగా సంజ్ఞను పొంది లక్ష్మణుని కోసము విలపించాడు. ఇది అన్నదమ్ముల అనుబంధం. ఆ తరువాత లక్ష్మణుడు సంజ్ఞను పొంది ఇంద్రజిత్తుతో ఘోరయుద్ధం చేశాడు. ఇంద్రజిత్తుని వధించాడు. లక్ష్మణుడు ఈ కష్టాలన్నీ రాముని కోసమే అనుభవించాడు. రాముడు వేరు తాను వేరు అనుకొనలేదు. ఇది రామలక్ష్మణుల అనుబంధం.

ఆ తరువాత రావణునితో యుద్ధం జరిగినపుడు లక్ష్మణుడు మూర్ఛపోయాడు. లక్ష్మణుడు మూర్ఛపోయినపుడు రాముడు విలపించాడు. ఆ తరువాత హనుమంతుడు హిమాలయ పర్వతాలకు వెళ్ళి "సంజీవని" అనే దివ్యౌషధాన్ని తెచ్చాడు. ఆ ఓషధుల వాసన పీల్చి లక్ష్మణుడు మూర్ఛనుండి

తేరుకున్నాడు. ఇంకా అనేకమంది వానరులు కూడా తేరుకున్నారు. రాముడు సంతోషించాడు. ఇది అన్నదమ్ముల అనుబంధం.

రామ పట్టాభిషేక వార్త విని రాముడు తల్లిని దర్శించాడు. ఆమె ఆశీర్వచనము పొంది చిఱునవ్వుతో లక్ష్మణునితో ఈ విధంగా అన్నాడు. "లక్ష్మణా! నాతో నీవు ఈ భూమిని పాలింపుము. నీవు నా రెండవ ప్రాణము. అట్లె నిన్ను కూడ ఈ రాజ్యలక్ష్మి వరించింది. నీకిష్టమైన భోగములను, ఇతర రాజ్య ఫలములను గూడ అనుభవింపుము. నేనీ జీవితమునుగాని, రాజ్యమునుగాని కోరుకొనుట నీ కొరకు మాత్రమే". ఈ వాక్యాలు రాముని అంతరంగము, లక్ష్మణునిపై ఉన్న ఆదరము, వాత్సల్యము అనుబంధాన్ని విశదపరుస్తున్నాయి. ఇది రామలక్ష్మణుల అనుబంధము.

రాముడు వనవాసమునకు బయలుదేరు సందర్భమున లక్ష్మణుడు కూడా బయలుదేరాడు. అప్పుడు రాముడు లక్ష్మణునితో నీవు ఇంటిదగ్గర ఉండి తల్లులకు సేవ చేయుమన్నాడు. అందుకు లక్ష్మణుడు రామునికి భయపడి భరతుడు వినయవంతుడై కౌసల్యను, సుమిత్రను ఆదరించగలడన్నాడు. ఈ సంఘటననుబట్టి లక్ష్మణునికి తల్లుల సేవకంటె అన్నగారి సేవే ముఖ్యమని తలచాడు. అంతేగాకుండ రామునికి నిత్యము అరణ్యములో లభించే దుంపలు, ఫలములు, మునులకు మంచి ఆహారముగా ఉపయోగించు వనములో లభించు ఇతర వస్తువులను తెచ్చి యిస్తానని రామునితో అన్నాడు. ఇది అన్నదమ్ముల అనుబంధం.

భరతుడు తన మేనమామ ఇంటనుండగా కబురు రాగా అయోధ్యనగరానికి వచ్చి రాముని అరణ్యావాస వార్తను, తండ్రి మరణవార్తను విని దుఃఖితుడై రాముడున్న అరణ్యానికి బయలుదేరి మార్గమధ్యమున గుహుని చెంత ఆ రాత్రి విశ్రాంతి తీసుకొని గుహుని ద్వారా రాముడు చిత్రకూట పర్వతము మీద ఉన్నాడని తెలుసుకొని తన రథముతో, సైన్యముతో అచటకు బయలుదేరాడు. ఆ సైన్యాన్ని, రథాన్ని చూసిన లక్ష్మణుడు భరతుడు వారిని చంపటానికి వచ్చుచున్నాడని అపార్థము చేసుకొని ఒక వృక్షాన్నెక్కి భరతుని చంపుదామని, భరతుడు రామునికి అపకారము చేశాడని అపకారము చేసినవానిని చంపుట అధర్మము కాదని రామునితో అనగా, అందుకు రాముడు లక్ష్మణుని వారించాడు. రాముని కోసము భరతుని కూడా చంపుటకు

సిద్ధపడిన లక్ష్మణుని ప్రభుభక్తి, అన్నగారి పట్ల ఉన్న ప్రేమ ఎనలేనిదని ఈ సంఘటన వారి అనుబంధాన్ని తెలియజేస్తుంది.

**రామ భరతుల అనుబంధం :**

భరతుడు దశరథ మహారాజు మూడవభార్యయైన కైకేయి కుమారుడు. ధర్మము తెలిసినవాడు. రాముడైన అన్నగారి పట్ల భక్తిశ్రద్ధలు, వాత్సల్యము కలవాడు. పూర్వము దేవాసుర యుద్ధమునందు దశరథ మహారాజుకి శుశ్రూష చేసినందుకు దశరథుడు ఆమెకు రెండు వరాలిచ్చాడు. 1) భరతుని అయోధ్య నగరానికి రాజుగా పట్టాభిషిక్తుని చేయుట 2) రాముని పదునాల్గు సంవత్సరాలు అరణ్యావాసానికి పంపుట. నిజానికి రామపట్టాభిషేకానికి అయోధ్య నగరంలో అన్ని ఏర్పాట్లు జరిగాయి. తెల్లవారితే రామ పట్టాభిషేకము జరుగవలసియున్నది. మంథర కైకేయి సేవకురాలు. మొదట నాకు రాముడైనా, భరతుడైనా ఒక్కటే అన్న కైకేయి మంథర మాటలు విని దశరథ మహారాజుని రామ పట్టాభిషేకము ఆపి అరణ్యావాసానికి పంపి, తన కుమారుడైన భరతునికి పట్టాభిషేకము చేయవలసిందిగా ఒత్తిడి తెచ్చి, రాజు అసత్య మాడకూడదని, ధర్మము తప్పకూడదని దశరథుని అడకత్తెరలో పెట్టింది. వాస్తవానికి దశరథ మహారాజుకి భరతుని పట్టాభిషేకము చేయటము ఇష్టము లేకపోయినప్పటికి ఒప్పుకోక తప్పలేదు. అనేక విధాలుగా దశరథుడు కైకేయికి నచ్చచెప్పటానికి ప్రయత్నించినా కైకేయి తన మొండిపట్టును వీడలేదు. భరతశతృఘ్నులిద్దరు భరతుని మేనమామ ఇంటనున్నారు. కబురుపెట్టగా అయోధ్యనగరానికి వచ్చారు. వాస్తవానికి భరతునికి రాజ్యకాంక్ష ఏ కోశాన లేదు. తల్లి చేసిన పనికి ఆమెను చీదరించుకొని నానా మాటలు అని నిందించాడు. ఆమె మీద కోపపడ్డాడు. ఇది భరతుని స్థితి.

రాముడు అరణ్యావాసానికి వెళ్ళేముందు తన తండ్రితో రాజ్యమును భరతునికిమ్ము. నాకు రాజ్యము కాని, సుఖము కాని పొందవలెనన్న కోరిక లేదు. భరతుడు తనకు రాజ్యము అవసరము లేదని అరణ్యములో ఉన్న రాముని వద్దకు తన రథము, సైన్యముతో బయలుదేరి మార్గమధ్యములో గంగానది ఒడ్డున ఆగి గుహుని కలసి ఆ రాత్రి అతని ఆతిథ్యమును స్వీకరించాడు. రాముడు చిత్రకూట పర్వతము మీద ఉన్నాడని గుహుని ద్వారా తెలుసుకొని మరునాడు ఉదయము

రాముని కలుసుకొనుటకు బయలుదేరాడు.

భరతుడు అయోధ్యకు వచ్చిన వెంటనే తన తల్లిని కలిసి తండ్రి, రామలక్ష్మణుల కుశలమడిగాడు. రాముడన్న భరతునికి అధికమైన ప్రేమ. భరతుని మాటల్లో చెప్పాలంటే రాముడు తనకు తండ్రి, సోదరుడు, బంధువు. ధర్మము తెలిసిన పూజ్యులందరికి అన్నగారు తండ్రి కదా? అన్నగారి పాదములు పట్టుకొనెదను. ఇప్పుడతడే గతి అన్నాడు. ఇది రామునిపై భరతునికున్న అభిప్రాయము, అనురాగము.

రాముని అరణ్యవాసానికి పంపించినందుకు భరతుడు తన తల్లియైన కైకేయిని ఈ విధంగా నిందించాడు.

1. "పాపాత్మురాలా! బుద్ధిశాలియైన కౌసల్య కుమారుని నారచీరలు కట్టింపజేసి, వనవాసమునకు పంపిన తరువాత కూడా నీకు విచారము కలుగుటలేదా!"

2. "నీవు లుబ్ధురాలువు. రాముని పట్ల నాకున్న భక్తిని గూర్చి నీకు తెలియదు".

3. "నేను ఇప్పుడు నీకు అప్రియము చేయ నిశ్చయించినాను. స్వజనులకు ఇష్టుడూ, దోషరహితుడు అయిన సోదరుని వనము నుండి వెనుకకు తీసుకొని వచ్చెదను".

4. "క్రూరులారా! కౌసల్య కుమారుడైన రాముడు ఆత్మనిగ్రహము కలవాడనీ, బంధువులకు ఆశ్రయమైన వాడనీ, జ్యేష్ఠుడగుటచే మాకు తండ్రివంటి వాడని నీకు తెలియదా?"

భరతుడు కైకేయిని నిందించిన తీరు పరిశీలించిన రామ భరతుల అనుబంధము, బంధము అర్థము కాగలదు.

రాముని అరణ్యవాసమునుండి అయోధ్యకు రప్పించి తాను అరణ్యవాసము చేయవలయునన్నదే, భరతుని నిర్ణయము. ఇది అన్నదమ్ముల అనుబంధం.

అరణ్యవాసములో చిత్రకూట పర్వతముపై ఉన్న రాముని కలిసి భరతుడు అన్నగారికి ప్రణమిల్లగా రాముడు తండ్రిగారి, తల్లుల యోగక్షేమములు అడిగాడు. భరతుడు తండ్రి మరణించాడని చెప్పగా రాముడు దుఃఖించాడు. భరతుడు రాజ్యము నాకు వద్దు, అది చేయుటకు నీవే అర్హుడవు అని రామునితో అనగా అందుకు

రాముడు భరతునికి నచ్చచెప్పి తండ్రి ఆజ్ఞను గౌరవించాలని, సత్యధర్మాలను పాటించాలని, వంశప్రతిష్ఠ నిలబెట్టాలని భరతునితో పలికి భరతుని కోరిక మేరకు తన పాదుకలను భరతునికిచ్చి అయోధ్య నగరానికి పంపాడు. ఇది రాముని పట్ల భరతునికున్న గౌరవము. రామ పాదుకలను సింహాసనము మీదనుంచి నందిగ్రామం నుండి భరతుడు అయోధ్యను పాలించాడు.

## రామ శత్రుఘ్నుల అనుబంధం :

శత్రుఘ్నుడు సుమిత్ర కుమారుడు. లక్ష్మణుని సొంత సోదరుడు. రామునియందు అనురాగము, భక్తి, స్నేహము కలవాడు. మంథర మాటలు విని కైకేయి దశరథ మహారాజుని రెండు వరాలు కోరింది. మొదటిది రాముని పదునాలుగు సంవత్సరములు అరణ్యవాసానికి పంపుట. రెండవది భరతునికి పట్టాభిషేకము చేయటము. భరతునికి పట్టాభిషేకము చేయవలసిన సమయములో భరత, శతృఘ్నులు అయోధ్యలో లేరు. వారు రామ పట్టాభిషేక వార్త విని అయోధ్యకు బయలుదేరి వచ్చారు. అయోధ్యను చేరి వాస్తవ విషయాలను గ్రహించి తల్లియైన కైకేయిని భరతుడు తీవ్రంగా నిందించాడు. కైకేయి అంతఃపురములో శత్రుఘ్నుడు ఆ సమయంలో మంథరను చూచాడు. కళ్ళు ఎఱ్ఱ చేసి మంథరవైపు చూచి ఆమెపై కోపించి కొట్టినంత పని చేశాడు. అనేకమైన ఆభరణములు ధరించిన మంథర ఆ సమయమున త్రాళ్ళతో కట్టిన ఆడ కోతివలె ఉన్నది. మిక్కిలి పాపము చేసిన ఆమెను పట్టుకొని భృత్యులు శత్రుఘ్నుని వద్ద నిలిపారు. అప్పుడు శత్రుఘ్నుడు "మా అన్నదమ్ములకు నా తండ్రికీ తీవ్రమైన దుఃఖమును కలిగించిన ఈమె చేసిన క్రూర కర్మకు ఫలము అనుభవించుగాక" అన్నాడు. ఆ మంథరను బలాత్కారముగా పట్టుకొనగా అక్కడ ఉన్నవారందరూ నలుదిక్కుల పారిపోయారు. ఆ సమయమున తీవ్ర కోపముచే శత్రుఘ్నుని కళ్ళు ఎఱ్ఱబడ్డాయి. అతడు కైకేయిని భయపెట్టుచు పరుషమైన వాక్యాలు పలికాడు. అప్పుడు కైకేయి భరతుని శరణు వేడింది. భరతుడు స్త్రీలను చంపకూడదని ఆమెను క్షమింపమన్నాడు. రాముడు ధర్మాత్ముడు గనుక స్త్రీని చంపకూడదని కైకేయిని వదలివేసినట్లు శత్రుఘ్నుడు చెప్పాడు. ఈ సంఘటనలన్నీ శత్రుఘ్నునికి రాముని మీద ఉన్న వాత్సల్యము, శ్రద్ధ, ప్రభుభక్తిని

తెలియజేస్తున్నాయి. మరొక విషయము - అయోధ్య రాజ్య పట్టాభిషేకము భరతునికే కాదు, శత్రుఘ్నునికి కూడా ఇష్టము లేదనే విషయము స్పష్టమవుతుంది.

లవణాసురుణ్ణి రాముని ఆజ్ఞ ద్వారా శత్రుఘ్నుడు యుద్ధంలో చంపాడు. లవణాసురుడు అధిక బలవంతుడు. వరములు పొందినవాడు. అతడు తన శూలముతో యుద్ధము చేయుచున్నపుడు ఆ శూలాన్ని ఎవరూ ఎదుర్కొనలేరు. లవణాసురుని శూలాన్ని గూర్చి, అతనిని చంపుటలో మెలకువలను గూర్చి రాముడు క్షుణ్ణంగా శత్రుఘ్నునికి తెలిపాడు. కనుకనే లవణాసురుడు శత్రుఘ్ని చేతిలో యుద్ధములో మరణించాడు.

రాముని ఆజ్ఞ ప్రకారము శత్రుఘ్నుడు తన కుమారులకు రెండు నగరాలను నిర్మించి ఇచ్చి అయోధ్యకు వచ్చాడు. ఈ సంఘటనలన్నీ రామశత్రుఘ్నుల అనుబంధాన్ని తెలియజేసేవే!

# అధ్యాయము - 3

సీతారాములు మానవులుగా అవతరించి అనేక కష్టాలు అనుభవించారు. వారు అనుభవించిన కష్టాలను తెలుసుకొని జీవితంలో మనం కూడా కష్టాలు వచ్చినపుడు వాటిని ఎదుర్కోవటానికి సిద్ధంగా ఉండాలి. పిరికితనంతో ఆత్మహత్యలు చేసుకోకూడదు. అందుకు రామాయణం చదవాలి.

రామాయణంలోని ముఖ్యపాత్రలు సీతారాములు. సీత సాక్షాత్తూ లక్ష్మీదేవి అని, రాముడు శ్రీ మహావిష్ణువని మొదటి అధ్యాయములో ప్రస్తావించాను. వారు దేవతా అవతారాలైనప్పటికి భూమిమీద అవతరించినందువల్ల భూలోకంలో కష్టాలు అనుభవించక తప్పలేదు. వారు కష్టాలు అనుభవించిన తీరుతెన్నులను, వారి ధైర్యసాహసాలను, సత్యధర్మాలను అనుసరించిన తీరును, వారి లక్ష్య సిద్ధి తీరును పరిశీలిద్దాము.

**రాముడు అనుభవించిన కష్టాలు :**

ఈయన అయోధ్యను పాలించుచున్న దశరథ మహారాజు జ్యేష్ఠపుత్రుడు. రాముని గుణగణాలు, పరాక్రమము గురించి రెండవ అధ్యాయములో ప్రస్తావన చేశాను. రామునికి వచ్చిన కష్టాలు ఏమిటి? వాటిని ఎలా ఎదుర్కొన్నాడు? జీవితంలో రాముని లక్ష్యం ఏమిటి? రాముని కుటుంబ పరిస్థితులేమిటి? కుటుంబపరంగా, రాజ్యపరంగా రాముడు ఎదుర్కొన్న సమస్యలేమిటి? కుటుంబ గౌరవాన్ని ఏవిధంగా కాపాడాడు? అన్నదమ్ములలో ఏవిధంగా మెలిగాడు? ఇత్యాది ప్రశ్నలకు సమాధానాలను పరిశీలిద్దాము.

రాముడు శ్రీమంతుని గర్భాన జన్మించాడు. తండ్రి అయోధ్య మహారాజు. సాధారణంగా లోకంలో శ్రీమంతులకు కష్టాలు ఉండవని అంటారు. కానీ రాముడు అనుభవించిన, ఎదుర్కొన్న కష్టాలు అన్నీ ఇన్నీ కావు. అయోధ్య రాజ్య పట్టాభిషేకం

ప్రకటించిన తరువాత అయోధ్య రాజుగా పట్టాభిషిక్తుడై రాజ్యాన్ని పాలించవలసిన సమయములో, రాముని పాలనకై అయోధ్య ప్రజలు ఎదురు చూస్తున్న తరుణములో, రాజుగా వెలుగొందవలసిన వ్యక్తి అరణ్యాల బాట పట్టవలసివచ్చింది. పదునాలుగు సంవత్సరములు అరణ్యావాసము చేయవలసి వచ్చింది. ఇది రామునికొచ్చిన ప్రథమ కష్టము. దశరథుని మూడవ భార్యయైన కైకేయి అరణ్యావాసానికి కారకురాలై లోకనింద మోసింది. తండ్రి ఆజ్ఞను, సత్యధర్మాలను, వంశ గౌరవ ప్రతిష్ఠలను గౌరవించి సంతోషంగా నారచీరలు ధరించి సీతాలక్ష్మణ సమేతంగా తల్లిదండ్రులకు, బంధుమిత్రులకు దూరమై అరణ్యావాసానికేగాడు రాముడు.

అరణ్యావాసానికి బయలుదేరేముందు తన తల్లిని కలసి సనాతన ధర్మాన్ని బోధించాడు. తల్లిని విచారించవద్దన్నాడు. దుఃఖమును ఆమె హృదయమునందే అణచివేసుకోమన్నాడు. తండ్రి ఆజ్ఞను నిర్వర్తించి వనవాసమునుండి తిరిగి అక్కడికి రాగలనన్నాడు. తాను, సీత, తన తల్లి, సుమిత్ర, లక్ష్మణుడు అందరూ తండ్రిగారి మాటలను అనుసరించి ఉండవలెనన్నాడు. తాను అడవికి వెళ్ళుటకు అనుమతి ఇవ్వమన్నాడు. కేవలము రాజ్యము కొరకై గొప్ప సత్యములనిచ్చు యశస్సును తాను విడువజాలనన్నాడు. ఈ జీవితము, చాలా స్వల్పకాలికమైనదన్నాడు. దీనికై తుచ్ఛమైన రాజ్యమును, ధర్మవిరుద్ధముగా సంపాదించుట అభిలషించనన్నాడు.

అరణ్యావాసానికి వెళ్ళేముందు పినతల్లియైన కైకేయితో ఈవిధంగా అన్నాడు. "దేవీ! నేను ధన ప్రధానుడను కాను. లోకమర్యాదను అనుసరించవలెనని మాత్రమే కోరుచున్నాను. కేవలము ధర్మమును అవలంబించిన నేను ఋషితుల్యుడనని తెలుసుకొనమన్నాడు''.

రాముడు సత్యధర్మాలను అనుసరించకుండ లక్ష్మణుని మాట విని ఉంటే బలప్రయోగముతో అయోధ్యకు రాజై ఉండేవాడు. అందుకు రాముడు అంగీకరించ లేదు. పరమధర్మపరుడని రాముడు ఋజువు చేసుకున్నాడు.

మొదట గంగానదిని దాటి దండకారణ్యములో ప్రవేశించి అచట పర్ణశాల నిర్మించుకొన్నారు. దండకారణ్యములో సంచరించుచున్న రావణుని సోదరి శూర్పణఖ రాముని చూచి తనను వివాహమాడవలసిందిగా కోరింది. రాముడు అందుకు

నిరాకరించి లక్ష్మణునితో శూర్పణఖ ముక్కు చెవులు కోయించాడు. ఆమె అన్నగారైన రావణుని దగ్గరకు వెళ్ళి రామలక్ష్మణుల మీద పగతీర్చుకోవలసిందిగా ప్రోత్సహించింది. అప్పుడు రావణుడు మారీచుని సహాయము కోరగా మారీచుడు మాయలేడి (బంగారు జింక) రూపమును ధరించి సీతారాములున్న పర్ణశాల ప్రదేశమున ప్రవేశించి సీత కంటపడ్డది. ఆ బంగారు మాయలేడిని చూచిన సీత ఆ లేడి తనకు కావాలని రాముడిని కోరింది. రాముడు ఆ మాయలేడిననుసరించి వెళ్ళాడు. రాముని రాక ఆలస్యమైనందున లక్ష్మణుడు కూడా వెళ్ళాడు. అప్పుడు రావణుడు కపట సన్యాసి రూపమున సీత ఉన్న ఆశ్రమానికి వచ్చి ఆమెను బలవంతంగా గ్రద్ద కోడిపిల్లను ఎత్తుకెళ్ళినట్టు ఎత్తుకెళ్ళాడు. సీత గిలగిల తన్నుకున్నా నానా గోల చేసినా, అరచినా రావణుడు లెక్క చేయలేదు. రాముడు అరణ్యవాసములో ఉండగా తన ఇష్టసఖిని పోగొట్టుకున్నాడు. ఇది రామునికి వచ్చిన అతి పెద్ద కష్టము, ఆపద. సీత అపహరింపబడి రాముడు విచారములో ఉన్న సమయమున అరణ్యములో రాముని ఆదరించేవారుగాని, పలకరించేవారు కాని, ఓదార్చేవారుకాని ఎవరూ లేరు. లక్ష్మణుడొక్కడే రాముని తోడుగా ఉన్నాడు.

చిత్రకూట పర్వతానికి చేరారు రామలక్ష్మణులు. కిష్కింధ రాజ్యమును వాలి అనే వానరరాజు పాలించుచున్నాడు. వాలి, సుగ్రీవులు అన్నదమ్ములు. వాలి తన సోదరుడైన సుగ్రీవుణ్ణి రాజ్య బహిష్కరణ చేశాడు. అతడు చిత్రకూట పర్వతానికి చేరి అచటనున్న రాముని గూర్చి విని రాముని దగ్గరికి వచ్చి తన వృత్తాంతాన్ని విన్నవించి రామ సహాయాన్ని అర్థించాడు. అందుకు రాముడు అంగీకరించాడు. ఆ తరువాత రాముడు వాలి-సుగ్రీవుల యుద్ధము జరిగింది. ఆ యుద్ధములో రాముడు వాలిని హతమార్చాడు. పిమ్మట సుగ్రీవుణ్ణి కిష్కింధకు పట్టాభిషిక్తుని గావించాడు. వాలిని హతమార్చటము అంత తేలికైన పని కాదు. అతడు బలవంతుడు. రాముడు గనుకనే వాలిని చంపగలిగాడు. ఇది రాముని పరాక్రమానికి, శరణువేడినవారిని రక్షించాడనటానికి (శరణాగతిని) చక్కటి ఉదాహరణ. ఇది కూడా రాముడు అనుభవించిన కష్టాలలో ఒకటి. లోకంలో తెలివిగలవాడు, సత్యధర్మాలను పాటించేవాడు ఒక కష్టం నుండి ఒక సుఖాన్ని, సహాయాన్ని పొందుతాడు. వాలిని

హతమార్చటం ద్వారా రామునికి వానరులతో మైత్రి ఏర్పడ్డది. సుగ్రీవుడు, హనుమంతుడు, అంగదుడు, నీలుడు ఇంకా అనేకమంది వానరులు, వానర సైన్యము సీతను వెదకడానికి కృత నిశ్చయులైనారు. హనుమంతుడు తన శరీరాన్ని (దేహాన్ని) పెంచి ఆకాశమార్గాన సముద్రాన్ని దాటి లంకలో ప్రవేశించి తన దేహాన్ని చిన్నదిగా మార్చుకొన్నాడు. లంకా నగర వీధులు, గృహములు, రావణుని గృహముతో సహా అన్నీ తిరిగి సీత కోసమై వెదికాడు. సీత జాడ కనిపించలేదు. ఈ విషయాన్ని రామునికి తెలియజేస్తే రాముడు మరణిస్తాడని, ఆ వార్త విని లక్ష్మణుడు మరణిస్తాడని, అది విని భరతుడు కూడా మరణిస్తాడని ఊహించాడు. అందువల్ల లంకా నగరాన్ని మరొకసారి వెదకాలని నిశ్చయించుకున్నాడు. హనుమంతుడు ఇక్కడ తన తెలివితేటలు ఉపయోగించాడు. రామునితో సీత కనిపించలేదని చెప్పి ఉంటే రామాయణ కథ ఇంకో మలుపు తిరిగి ఉండేదని నా అభిప్రాయము.

ఒక కార్యాన్ని సాధించడానికి ఒక వ్యక్తి ఎంతటి బలవంతుడైనా, శక్తిశాలి అయినా సాధ్యపడకపోవచ్చును. కొందరి సహాయ సహకారాలు తప్పక కావాలి. లంకా నగరానికి వెళ్ళటానికి సముద్రము మీద సేతువు కట్టాలి. సేతువు నిర్మాణము చేయకుండ రామలక్ష్మణులు కానీ, వానర సైన్యము కాని వెళ్ళటము అసంభవము. నీలుడు మిగతా వానరసైన్యంతో సేతువును నిర్మించాడు. వానర సైన్యము సముద్రము మీద సేతువును నిర్మించటానికి, రావణ సైన్యముతో యుద్ధము చేయటానికి ఉపయోగపడ్డది. సేతువు నిర్మాణము జరిగిన తరువాత రామలక్ష్మణులు వానర సైన్యంతో లంకా నగర ప్రవేశము చేశారు.

రావణుని లంకానగరము బహు సుందరమైనది. ఉద్యానవనములతో విలసిల్లేది. రక్షణపరంగా చాలా పటిష్టమైనది. అక్కడకు వెళ్ళగలగటము ఒక ఎత్తు. రాక్షసులతో యుద్ధము చేసి వారిని ఓడించి సీతను లంకనుండి తీసుకురావటము మరొక ఎత్తు. ఇది అంత తేలికైన పని కాదు. రావణుడు తన తపోబలముచే బ్రహ్మవరము పొందినవాడు, త్రిలోక కంటకుడు. లంకలో ఉన్న రాక్షసులు కూడా చాలా పరాక్రమవంతులు, మాయలెరిగినవారు, కామరూపులు.

రావణ తనయుడు మేఘనాథుడు (ఇంద్రజిత్తు) మాయా రామలక్ష్మణులను

సృష్టించి వారి శిరస్సులను ఖండించి రామలక్ష్మణులు యుద్ధములో చనిపోయారని ప్రచారము చేశాడు. అది విని సీత రామలక్ష్మణులు నిజంగా చనిపోయారని దుఃఖించింది. త్రిజట రామలక్ష్మణులు చనిపోలేదని, ఇదంతా ఇంద్రజిత్తు మాయ అని సీతకు తెలిపింది. ఆ తరువాత ఇంద్రజిత్తు రామలక్ష్మణులతో చేసిన యుద్ధములో వారిని నాగపాశముతో బంధించాడు. వారు సంజ్ఞను కోల్పోయారు. గరుత్మంతుడు వారిని నాగపాశ బంధ విముక్తులను గావించాడు. ఇది గూడ రామలక్ష్మణులు అనుభవించిన కష్టాలలో ఒకటి. లక్ష్మణేంద్రజిత్తుల యుద్ధములో లక్ష్మణుడు ఇంద్రజిత్తుని వధించాడు.

ఇంద్రజిత్తు మరణవార్త విన్న రావణుడు దుఃఖించి వజ్రదంతుణ్ణి, మఖ రాక్షసుణ్ణి, ప్రహస్తుని, కుంభకర్ణుని, అతికాయుణ్ణి, ఇంకా యోధులైన అనేకమందిని ఒకరి తరువాత ఒకరిని రామలక్ష్మణులతో యుద్ధానికి పంపాడు. వీరందరిని చంపారు రామలక్ష్మణులు. సీత బ్రతికి ఉండగనే ఇంద్రజిత్తు మాయ సీతను సృష్టించి ఆమె జుట్టు పట్టుకొని ఆమె శిరస్సుని ఖండించి సీత మరణించిందనే వార్తను వ్యాప్తి చేశాడు. అది విని రాముడు విలపించాడు. ఇది కూడా రాముడు అనుభవించిన కష్టాలలో ఒకటి!

రావణ సైన్యములో ఉన్న తన పుత్రులు, సోదర పుత్రులు, సోదరులతో సహా (విభీషణుడు తప్ప) అందరూ మరణించగా చివరకు రావణుడు రామునితో యుద్ధానికి తలపడ్డాడు. రామరావణ యుద్ధము ఏడు దినములు జరిగినది. రాముడు ఇంద్రుడిచ్చిన రథముతో బ్రహ్మ ఇచ్చిన బ్రహ్మాస్త్రముతో రావణుని వక్షస్థలాన్ని చీల్చాడు. ఆ తరువాత రావణుడు మరణించాడు. దేవతలు, మునులు, ఋషులు ఆ యుద్ధాన్ని చూచి రావణుడు మరణించినందుకు వారి హర్షాన్ని తెలియజేసారు. విభీషణుని లంకా రాజ్యానికి పట్టాభిషిక్తుని చేసి రాముడు తన మాట నిలబెట్టుకొని విభీషణుడు తెచ్చిన పుష్పకవిమానంలో దేవతలు, సుగ్రీవాది వానరులు, విభీషణునితో సహా అయోధ్య నగరానికి చేరి పట్టాభిషిక్తుడయ్యాడు.

ఇంకా రాముని కష్టాలు చెప్పాలంటే యుద్ధకాండలో పుష్కలంగా ఉన్నాయి. లక్ష్మణ రావణ యుద్ధంలో రావణుని శక్త్యాయుధములచే లక్ష్మణుడు మూర్ఛపోయాడు.

రావణుడు యుద్ధమునుండి పారిపోయాడు. ఆ సందర్భమున రాముడు లక్ష్మణుని కోసం విలపించాడు. ఆ తరువాత హనుమంతుడు తెచ్చిన ఓషధులచే లక్ష్మణుడు మూర్ఛనుండి అనేకమంది వానరులతోపాటు తేరుకున్నాడు.

మొదటి అధ్యాయంలో రావణ సంహారము కొరకై అవతరించిన అవతారమూర్తి అయిన విష్ణువు రాముడని తెలుసుకున్నాము. రావణ సంహారానికి రాముడు అనుభవించిన కష్టాలు వర్ణనాతీతము. ఈ కష్టాలన్నీ రాముడు ఎందుకు భరించాడనే ప్రశ్నకు సమాధానం రావణ సంహారము కొరకే (అనేది సమాధానం)!

## సీత అనుభవించిన కష్టాలు :

సీత ధర్మము చేత జనక మహారాజు పుత్రిక అయినప్పటికి వాస్తవానికి ఆమె దేవతా స్త్రీ. అయోనిజ. జనక మహారాజు యజ్ఞము చేయటానికి భూమిని దున్నుచుండగా నాగటిచాలు బ్రద్దలు కొట్టుకొని పైకి వచ్చిన వ్యక్తి. జనక మహారాజు ఆమెను నాగటిచాలు నుండి లేవనెత్తి ఒడిలో కూర్చుండబెట్టుకొని "ఈమె నా పుత్రిక" అని పలుకగా ఆకాశవాణి ఈ విధంగా పలికింది. "ఓ రాజా! ఈమె మనుష్యజాతికి చెందినది కాదు. సాటిలేని దేవతా స్త్రీ. ధర్మము చేత నీకు కూతురు అను విషయము సత్యమే!". (అయోధ్యకాండము 118వ సర్గము)

మొదటి అధ్యాయము "వేదవతి" జననములో వేదవతి మరు జన్మలో జనకుని ఇంట నాగటిచాలులో సీతగా జన్మిస్తానన్నదనే ప్రస్తావన చేశాను. ఈమె రావణ సంహారానికై జన్మించిన అయోనిజ. సీత తన జీవితములో ఏ స్త్రీ అనుభవించని కష్టాలు అనుభవించింది.

## సీత అనుభవించిన కష్టాలను పరిశీలిద్దాము :

సీతకు 12 సంవత్సరాల వయస్సులో ఇక్ష్వాకు వంశపురాజైన దశరథుని జ్యేష్ఠకుమారుడు రామునితో శివధనుర్భంగం సందర్భంగ వివాహమైంది. రాముడు శివధనుర్భంగం కావించినప్పటికీ దశరథ మహారాజు అంగీకారము తెలిపేవరకు వివాహము కాలేదు. తండ్రి అనుమతి తరువాతే రాముని వివాహం జరిగింది. అప్పుడు రాముని వయసు 15 సంవత్సరాలు. వివాహానంతరము ఆ దంపతులు సంసార

సుఖమెరుగరు. రామ పట్టాభిషేకానికి దశరథ మహారాజు అయోధ్యలో ఏర్పాట్లుగావించుచుండగా ఆ పట్టాభిషేకము కారణాంతరాల వల్ల భరతునికి చేయవలసివచ్చింది. రాముడు పదునాల్గు సంవత్సరాలు అరణ్యావాసానికి వెళ్ళవలసి వచ్చింది. అందుకు కారణము దశరథుని మూడవ భార్యయైన కైకేయి. రాముడు వద్దన్నా వినకుండా సీత గూడ నారచీరలు ధరించి రాముని వెంట అరణ్యావాసానికి వెళ్ళింది. యౌవన దశలో ఉన్న సీత అరణ్యావాసము చేయుటమంటె సంసార సుఖానికి దూరంగ ఉండటమే! ఇక్కడ సీత భారతీయ స్త్రీ ధర్మాన్ని పాటించింది. భారతీయ స్త్రీ భర్త ఎక్కడ ఉంటే భార్య అక్కడే ఉండాలి. ఇదే భారతీయ స్త్రీ ధర్మము. భర్త ఎటువంటివాడైనా భర్తను మించిన దైవం లేదనేది భారతీయ ధర్మము.

సీతారామలక్ష్మణులు అరణ్యావాసములో మొదట దండకారణ్యములో ప్రవేశించి పర్ణశాలను నిర్మించుకొని అక్కడే నివసించారు. ఒకనాడు మారీచుడనే రాక్షసుడు రావణుని ప్రోద్బలముతో మాయలేడి రూపము ధరించి సీత ఉన్న పర్ణశాల పరిసర ప్రాంతాల్లో తిరుగుచుండగా సీత ఆ బంగారు లేడిని చూచి తనకు ఆ బంగారు జింక కావలెనని కోరి రాముని పంపి ఆయన రాక ఆలస్యమైనందున లక్ష్మణుని పంపింది. రావణుడు కపట సన్యాసి రూపములో సీత దగ్గరకు వచ్చి బలవంతంగా ఆమెను గ్రద్ద కోడిపిల్లను తన్నుకు పోయినట్లు ఎత్తుకెళ్ళాడు. సీత గిల గిల తన్నుకొని గోల చేసినప్పటికీ రావణుడు పట్టించుకోలేదు. ఈ దృశ్యాన్ని చూచిన జటాయువు రావణుని వెంబడించగా రావణుడు ఆ గ్రద్ద రెక్కలు తెగనరకగా ఆ గ్రద్ద మరణించింది. జటాయువు అన్న "సంపాతి" సీత జాడను హనుమంత సుగ్రీవాదులకు సముద్రము మీదుగా రావణుడు సీతను ఎత్తుకెళ్ళాడని చెప్పింది.

రామలక్ష్మణులు దండకారణ్యము నుండి చిత్రకూట పర్వతాన్ని చేరారు. సీతకు వచ్చిన పెద్ద ఆపద, కష్టము భర్తనుండి విడిపోవుట. రామలక్ష్మణుల మీద ఉన్న గురుతరమైన బాధ్యత సీత జాడను తెలుసుకొనుట. వాయుపుత్రుడైన హనుమంతుడు, వానర రాజైన సుగ్రీవుని ద్వారా సీత జాడను తెలిసికోవటానికి రామలక్ష్మణులు ప్రయత్నించారు. హనుమంతుడు సీత జాడను కనుగొనటంలో ప్రముఖ పాత్ర వహించాడు. సుగ్రీవాదులకు (వానరులకు) కొన్ని ఆనవాళ్ళు

లభించాయి. సీతను రావణుడు ఎత్తుకెళ్ళే సమయములో సీత తన ఆభరణాలను ఆ పర్వత గుహల దగ్గర జారవిడచింది. అవి సుగ్రీవాదులకు లభించాయి. వాటిని సుగ్రీవుడు రామునికి చూపారు. రాముడు అవి సీతవే అని నిర్ధారించాడు. సీత గొలుసు, ఉంగరము ఆ ఆభరణాల్లో ఉన్నాయి. రావణుడున్న లంకా నగరానికి వెళ్ళటము అతి క్లిష్టమైన సమస్య. ముందుగా హనుమంతుడు తన దేహాన్ని పెంచి ఆకాశమార్గాన లంకా నగరానికి చేరి లంకా నగరము చేరగానే తన దేహాన్ని చిన్నదిగా తగ్గించాడు. సీత కోసం లంకా నగరమంతా ఇల్లిల్లు వెతికాడు. కానీ సీత జాడ కనిపించలేదు. హనుమంతుడికిక్కడ ఒక క్లిష్ట పరిస్థితి ఎదురైంది. లంకనుండి వెళ్ళి సీత జాడ కనిపించలేదని రామునితో చెబితే రాముడు మరణిస్తాడని, ఆ వార్త విని లక్ష్మణుడు మరణిస్తాడని, భరతుడు మరణిస్తాడని భావించి తిరిగి చిత్రకూట పర్వతానికి వెళ్ళకుండా లంకను మరొకసారి వెదకడానికి నిశ్చయించుకున్నాడు. (సుందర కాండము)

హనుమంతుడు లంకా నగరములో ఉన్న వనములన్నిటినీ, ఉద్యాన వనములన్నీ వెతికాడు. అశోకవనములో ఉన్న ఒక అశోక వృక్షము క్రింద దీనంగా మాసిన శరీరము, మాసిన బట్టలతో కూర్చొని ఉన్న సీతను హనుమంతుడు చూశాడు. ఆమెతో తాను హనుమంతుడను, రామబంటునని చెబితే సీత నమ్మదేమోనని సందేహించి అశోకవృక్షము ఆకుల సముదాయములో కూర్చుని సీతకు కనబడకుండ రాముని గూర్చి చెప్పటము మొదలుపెట్టగా ఆ విషయాలను సీత శ్రద్ధగా ఆలకించింది. సీతకు తనమీద నమ్మకము కుదిరిందని హనుమంతుడు నమ్మిన తరువాత చెట్టుపై నుండి క్రిందకు దిగి సీతతో తాను రాముని దూతనని సీత జాడ తెలుసుకోవటానికి లంకానగరానికి వచ్చితినని తెలిపాడు. సీతకు నమ్మకాన్ని కలిగించటానికి రాముడిచ్చిన ఉంగరాన్ని సీతకు ఇచ్చాడు. సీత చాలా కష్టాల్లో, దుఃఖములో ఉన్నదని గమనించి హనుమంతుడు ఆమెను తన వీపు మీద ఎక్కించుకొని రాముని దగ్గరకు తీసుకెళతానని ఆమెను రమ్మన్నాడు. అందుకు సీత ఒప్పుకొనలేదు. రాముడు వచ్చి లంకనుండి తనను తీసుకెళితేనే రామునికి గౌరవము, ప్రతిష్ట ఉంటుందని ఆలోచించినందువల్లనే కష్టాలలో మునిగి ఉండి కూడా హనుమంతునితో వెళ్ళలేదు.

కళావిహీనంగా, విచారంగా ఉన్న సీతను చూచి హనుమంతుడు చాలా విచారము చెందినాడు. అయోధ్య నగరములో మహారాణిగా, పట్టమహిషిగా ఉండవలసిన సీతకు ఎంతటి దుస్థితి! ఎంతటి దుర్గతి!

రావణుడు సీతను తనను భర్తగా అంగీకరించమని అనేకసార్లు బ్రతిమాలాడు, బెదరించాడు. సీతతో ఇంకా ఈ విధంగా అన్నాడు. రాముడు ఎట్టి పరిస్థితుల్లోను లంకా నగరానికి రాలేడు. సీతను లంకనుండి తీసుకెళ్ళటము జరగని పని, అసంభవము అన్నాడు. రాముని మరచిపొమ్మన్నాడు. కానీ సీత మాత్రము రామునినే మనసా వాచా తలచుచున్నది. రాముడు ఎప్పటికైనా వచ్చి తనను లంకనుండి తీసుకుపోతాడనే నమ్మకంతో ఉన్నది. చివరగా రావణుడు రెండు మాసములు గడువు ఇచ్చి సీతను తన భార్యగా ఉండుటకు అంగీకారము తెలుపవలసిందిగా కోరాడు. లేనిచో ఆమెను చంపివేస్తానని హెచ్చరించాడు. కనుక ప్రస్తుతము సీతకున్న అతి క్లిష్టమైన సమస్య రావణుని భార్యగా ఉండుటకు అంగీకరించటమా లేక ప్రాణాల మీద ఆశలు వదలుకోవటమా! సీత నిర్ణయం ప్రకారము తాను చావటానికైనా సిద్ధమే కాని రావణుని భార్యగా మాత్రము ఉండుటకు ఎట్టి పరిస్థితుల్లోను అంగీకరించదు. అశోకవనములో ఆడ రాక్షసులను సీతకు కాపలాగా ఉంచాడు రావణుడు. వారందరు రావణుని నిర్ణయానికి మద్దత్తునిచ్చి సీతను బలవంతంగా బెదరించి ఒప్పించటానికి ప్రయత్నించారు. సీతను ఉన్నపరంగా తినేస్తామన్నారు. కాని సీత ఆ ఆడరాక్షసుల అల్లరికి లొంగలేదు. రెండు మాసముల గడువు రావణుడు విధించగా సీత చాలా చిక్కుల్లో పడ్డది. ఒకదశలో ఏ దారీ కానరాక, ఏ ఆశ లేక ఆత్మహత్య చేసుకొందామని అనుకొన్నది. ఆ ఆలోచన విరమించింది. ఇది సీత మానసిక ఆందోళన, పరిస్థితి.

సీత జాడ తెలుసుకొన్న తరువాత కూడా సీతకు కష్టాలు తప్పలేదు. సీత జాడ తెలుసుకున్న తరువాత ఆ విషయాన్ని రామునికి తెలియజేయడానికి హనుమంతుడు లంకనుండి బయలుదేరిన సమయాన హనుమంతునితో సీత ఈ విధముగా అన్నది. "పరాక్రమవంతుడైన నీవు తిరిగి వచ్చుటకై వెళ్ళిపోయిన పిమ్మట నేను జీవించి ఉండుట అనేది కూడా సందేహాస్పదమే. ఇందులో సందేహము లేదు.

ఒక దుఃఖము తరువాత మరొక దుఃఖమును అనుభవించుచు దీనురాలనై, దుఃఖములను అనుభవించుటకే పుట్టిన నాకు నీవు కనబడకపోవుటచే దుఃఖము ఇంకా అధికమగును''.

సీత హనుమంతునితో పలికిన పై మాటలను పరిశీలించినచో ఆమె ఎంత దుఃఖములో, ఎంత మానసిక ఆందోళనతో ఉన్నదో, ఎన్ని కష్టాలను అనుభవిస్తున్నదో మనకు అర్థమవుతుంది. (సుందరకాండము 68వ సర్గము)

రావణ సంహారము తరువాత సంతోషంగా ఉండవలసిన సీతకు కష్టాలు తప్పలేదు. అసలైన కష్టాలు సీతకు ప్రారంభమయ్యాయి. రాముని ఆజ్ఞ చేత విభీషణుడు రాముని వద్దకు సీతను రప్పించాడు. సీత రాముణ్ణి చూసింది. సీత కష్టాలు పోయాయని అక్కడ ఉన్న వారంతా భావించారు. (సుగ్రీవుడు, విభీషణుడు, హనుమంతుడు, మిగిలిన వానరులందరూ) కానీ ఆమె కష్టాలను భగవంతుడు ఇంకా అంతము చేయలేదు, ఆరంభించినట్లయ్యింది. రాక్షసుని ఇంట చాలా కాలము నివశించిన ఆ సీత వచ్చినదని వినగానే రామునకు సంతోషము, దైన్యము, కోపము ఈ మూడు కలిగాయి. పిమ్మట రాముడు సంతోషము లేనివాడై, విమర్శ పూర్వకంగా ఆలోచించాడు. విభీషణుడు సీత వచ్చుచున్న సమయమున జనులను దూరము చేయగా రాముడు కోపించి చూపులతో కాల్చివేయుచున్నాడా అనునట్లున్నాడు. ఈ ప్రజలను బాధపెట్టవద్దని విభీషణునితో అన్నాడు. వాళ్లందరూ నావాళ్ళు. స్త్రీకి ఇల్లుగాని, వస్త్రములుగాని, ప్రాకారములుగాని, తెరలుగాని, ఈ విధమైన రాజసత్కారములుగాని ఆవరణముగాదు. మంచి నడవడికయే ఆవరణమన్నాడు. ఇష్ట జనవియోగము మొదలైన వ్యసనములందుగాని, రాజ్య క్షోభాదులందుగాని, యుద్ధములందుగాని, స్వయంవరములందుగాని, యజ్ఞమునందుగాని, వివాహమునందుగాని స్త్రీలు ఇతరుల కంటబడుటలో దోషము లేదన్నాడు (రాముడు). ఆ సీత ఆపదలలో ఉన్నది, గొప్ప కష్టపరిస్థితులలో ఉన్నది. అందుచేత ఆమెను అందరూ చూచినా దోషము లేదన్నాడు. ఇది సీతపట్ల రాముని వైఖరి.

సీత చరిత్రను శంకించిన రాముడు సీతతో "నీవు ఎక్కడికి వెళ్ళినా వెళ్ళవచ్చునన్నాడు''. శత్రువుని వధించి నిన్ను జయించుకొన్నానన్నాడు. ఇంకా ఈ

విధంగా అన్నాడు. "నేను నీ దగ్గర లేని సమయమున చపలచిత్తుడైన రాక్షసుడు నిన్ను అపహరించాడు. దైవకృతమైన ఈ దోషమును, మానవుడైన నేను మానవ యత్నముచే సరిచేశానన్నాడు."

రాముడు సీతతో ఇంకా ఈ విధంగా అన్నాడు. "రాక్షసునితో యుద్ధ పరిశ్రమను తాను సీత కొరకై చేయలేదను విషయమును గ్రహింపుమన్నాడు. నా ఎదుట కన్నీరు కార్చినను నేను భరించనన్నాడు". ఇంకా ఈ విధంగా కఠినంగా అన్నాడు. "ఓ సీతా! నేను అనుజ్ఞ ఇచ్చుచున్నాను. ఈ పది దిక్కులలో నీ ఇష్టమొచ్చిన దిక్కునకు వెళ్ళమన్నాడు. నాకు నీతో పని లేదు. పరగృహములో ఉన్న స్త్రీని నేను ఆశతో తీసుకోనన్నాడు".

రాముడు తన కుల గౌరవమును కాపాడుటకే సీతను మరలా సంపాదించానన్నాడు. సీతయందు తనకు ఆసక్తి లేదన్నాడు. అందుచేత అక్కడినుండి తన ఇష్టమొచ్చినచోటికి వెళ్ళవచ్చున్నాడు.

రావణ సంహారము జరిగింది. సీతారాములు సంతోషంగా ఒకటి కానున్నారని అందరూ ఆశించే సమయంలో రాముని కఠిన వైఖరి పరిశీలించిన ఎవరికైనా సీత మీద జాలి, దయ కలుగక మానదు.

రాముని కఠోర వాక్కులు విన్న సీత బిగ్గరగా ఏడ్చి అగ్నిప్రవేశము చేయుటకు నిశ్చయించుకొన్నది. ఆమె అగ్నిప్రవేశము చేస్తుండగా అచటనున్నవారంతా బిగ్గరగా హాహాకారాలు చేశారు. లోకపావనియైన తనను అగ్ని రక్షించుగాక అన్నది సీత. రాముడు కన్నీళ్ళతో నిండిన నేత్రములతో ఆలోచించుచు అచటనే నిలుచుండిపోయాడు. అపుడు దేవతలందరూ వచ్చి రామునితో సీత లోకపావని, ఆమె ఏ తప్పు చేయలేదని చెప్పారు. సీత పవిత్రురాలని అగ్నిదేవుడు చెప్పగా రాముడు సీతను స్వీకరించాడు. ఆ తరువాత రాముడు సీత పవిత్రురాలని తనకు తెలుసునని మూడు లోకములకు నమ్మకము కలుగుటకై సీత అగ్నిలో ప్రవేశించుచుండగా ఉపేక్షించానన్నాడు. ఇవి సీత అనుభవించిన కష్టాలు. (యుద్ధకాండము **114,115,116** సర్గాలు)

సీతారాములు అనుభవించిన కష్టాలను చూశాము. వాటితో పోలిస్తే మానవులైన మనము అనుభవించే కష్టాలు బహు స్వల్పము. జీవితములో కేవలము సుఖాల కోసమే ప్రాకులాడటము అవివేకము. కష్టసుఖాలు జీవిత భాగస్వాములు. మన విద్యార్థులు వారి చదువులో చిన్న చిన్న కష్టాలకు ఓర్చుకోలేక కొందరు ఆత్మహత్యలకు పాల్పడుచున్నారు. కొందరు తల్లిదండ్రులు కూడా సంసార కష్టాలను ఎదుర్కొనలేక ఆత్మహత్యలకుపక్రమిస్తుంటారు. కనుకనే విద్యార్థుల దగ్గరనుండి తల్లిదండ్రుల వరకు సీతారాముల కష్టాలను చదివితే, తెలుసుకుంటే ఆత్మహత్యలు తగ్గుతాయేమో! అందుకు రామాయణాన్ని చదవాలి.

# అధ్యాయము - 4

## రామాయణం - జీవిత విలువలు

భారతీయ జీవన విధానానికి నాంది, సత్యధర్మాలకి మూలము భారతీయ సంస్కారానికి ఊపిరి, భారతీయ విలువలు పునాది భారత ఇతిహాసాలైన భారత, రామాయణ గ్రంథాలు. భారతదేశమున్నంత కాలము ఆ మహోత్కృష్ట గ్రంథాలకు మరణం లేదు. భారతీయులు అక్షరాస్యులైనా, నిరక్షరాస్యులైనా భారత, రామాయణాలు తెలియనివారు లేరంటే ఆశ్చర్యం లేదు. అందు నిక్షిప్తమైన విలువలు భారతీయ జీవన విధానానికి మూలము. అవి చదివినవారు, విన్నవారు అసత్యాలాడలేరు, ధర్మబద్ధంగా జీవించగలుగుతారు. మరొక రకంగా చెప్పాలంటే భారతీయుల జీవితములో ఆ విలువలు ఒక భాగము.

విలువలను ఏ వ్యక్తి అయినా ముందు కుటుంబం నుంచే నేర్చుకోవాలి. కుటుంబం విలువలకు ప్రథమ పాఠశాల. తరువాత సమాజమునుండి నేర్చుకోవాలి. తల్లిదండ్రులను, పెద్దలను, ఉపాధ్యాయులను, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళను, ఇతరులను గౌరవించటము, వారితో మర్యాదగా ప్రవర్తించటము ప్రేమగా వ్యవహరించటము వీటన్నిటికి బీజము కుటుంబ వ్యవస్థే. ఇతరులకు ఉపకారము చేయటము, అపకారము చేయకుండటము, జీవన విధానములో సత్యధర్మాలు పాటించటము, స్త్రీలను గౌరవించటము, వారిని వేధించకుండ ఉండటము, జితేంద్రియత్వము కలిగి ఉండటము, కుటుంబ వ్యవస్థ పటిష్ఠతకు కృషి చేయటము, భార్యాభర్తల బంధము, స్నేహము దాని ప్రాముఖ్యత, జీవితములో నమ్మదగిన వ్యక్తిగా ఉండటము, నమ్మకమైన వ్యక్తిగా ఉండటము, కృతజ్ఞతను కలిగి ఉండటము, కృతఘ్నత, కోపము - దుష్పరిణామాలు, అపహరించటము వలన అనర్థాలు, సహనము యొక్క గొప్పతనము, వివాహ వ్యవస్థ ప్రాశస్త్యము మొదలగు ఎన్నో విలువలు రామాయణ గ్రంథంలో నిక్షిప్తమై ఉన్నాయి. ఆ విలువల ప్రాముఖ్యతను గుర్తించటానికి రామాయణాన్ని చదవాలి.

## 1) కుటుంబ వ్యవస్థ :

భారతీయ జీవన విధానానికి మూలము కుటుంబ వ్యవస్థ. కుటుంబ వ్యవస్థనుండి వచ్చిందే సామాజిక వ్యవస్థ. కుటుంబ వ్యవస్థ అనగానేమి? కుటుంబ వ్యవస్థలో వ్యక్తి / వ్యక్తులు నేర్చుకోవలసింది, నేర్చుకునేది ఏమిటి? - ఈ ప్రశ్నలకు సమాధానాలను చూద్దాము. తాతయ్య, నాయనమ్మ, తల్లిదండ్రులు, సోదరీ సోదరులు - వీరందరూ కుటుంబ సభ్యులే, కుటుంబ వ్యవస్థలో భాగస్వాములే. తాతయ్య - నాయనమ్మ, తల్లిదండ్రులను గౌరవించటము, ప్రేమించటము, వారి మాటను జవదాటకుండ ఉండటము, అక్కచెల్లెళ్ళతో ఆప్యాయత, అనురాగంగా ఉండటము, మంచి, మర్యాద, ఇతరులను, పెద్దవారిని గౌరవించటము, వారితో మర్యాదగా ప్రవర్తించటము, గురువులను గౌరవించటము, వారితో మర్యాదగా ప్రవర్తించటము, సంఘ జీవనాన్ని గౌరవించటము, సంఘములో ప్రతి వ్యక్తితో మర్యాదగా మెలగటము, అన్యాయాలు, అక్రమాలు చేయకుండటము - ఇత్యాది గుణాలన్నీ కుటుంబ పెంపకమునుండే రావాలి, అబ్బాలి, తల్లిదండ్రులు పిల్లలకు నేర్పాలి.

దశరథుని కుటుంబము చాలా పెద్దది. ముగ్గురు భార్యలు, నలుగురు కుమారులు. వీరుగాక దశరథుడు అయోధ్య రాజుగనుక భృత్యులు, మంత్రులు, వచ్చిపోయే ప్రజలు అనేకమందితో ఆ దశరథుని ఇల్లు నిత్యము రద్దీగా ఉంటుంది. దశరథుని భార్యలుగానీ, కుమారులుగానీ - అందరూ మంచి నడవడిక, మర్యాద, మన్నన పాటించే వ్యక్తులేగాదు, కుటుంబ వ్యవస్థను, సత్యధర్మాలను కాపాడేవారే. రాముడు తండ్రిపట్ల అత్యంత గౌరవము, ఆదరణ, భక్తి ఉన్నవాడు. తండ్రి ఆజ్ఞను శిరసావహించేవాడు. అతడు తల్లులను, సోదరులను హృదయపూర్వకంగా ప్రేమించేవాడు. సేవకుల దగ్గరనుండి ప్రజలవరకు అందరినీ ప్రేమాభిమానాలతో చూచెడివాడు. తండ్రి ఆజ్ఞను పాటించి అరణ్యవాసానికి వెళ్ళాడు. భార్య, సోదరుడు లక్ష్మణుడు వెంబడించగా వద్దన్నాడు. కాని వారు రాముని అరణ్యవాసానికి వెంబడించి వెళ్ళారు.

నిస్వార్థపరుడు, నిష్పక్షపాతి, నిరంతరము ఇతరుల క్షేమముకై పాటుపడేవాడు. రాముని అరణ్యవాసానికి కారణమైన సొంత తల్లియైన కైకేయినే నిందించిన గొప్ప

మహానుభావుడు భరతుడు. తన తల్లిని నిందిస్తున్న భరతుని వారించిన మహావ్యక్తి రాముడు. ఇవన్నీ రాముని గొప్ప గుణములు. వంశ గౌరవమును కాపాడటము, తండ్రి ఆజ్ఞను పాటించటము, సత్యధర్మాలను పాటించటము మొదలైన రాముని ఉత్తమోత్తమ గుణాలను రామాయణం నుండి రామునిద్వారా మనం నేర్చుకోవాలి.

దశరథుని కుటుంబంలో జన్మించిన అన్నదమ్ములందరూ మంచి గుణగణాలు కలవారు. సత్యధర్మాలను పాటించేవారే, నిస్వార్థపరులే!

## 2. సత్యధర్మాలు :

సత్యధర్మాల ప్రస్తావన రామాయణంలో దాదాపు అన్ని కాండాలలో ఉన్నది. సత్యధర్మాలను ఒక అధ్యాయంగా ఈ పుస్తకములో వ్రాయదలచాను. ఈ అంశమును క్లుప్తంగా పరిశీలిద్దాము. సత్యధర్మాలను వేరు చేసి చూడలేము. సత్యము లేకుండా ధర్మము లేదు. అందుకనే అయోధ్య కాండము 109వ సర్గములో సత్యాన్ని గురించి ఈ విధంగా చెప్పబడ్డది. "ఈ లోకంలో సత్యమే ఈశ్వరుడు. లక్ష్మి ఎల్లప్పుడూ సత్యమునే ఆశ్రయించి ఉండును. అన్నిటికీ సత్యమే మూలము. సత్యమును మించిన ఉత్తమ ధర్మమేదియును లేదు. రాముడు కాని రాముని సోదరులు కానీ సత్యాన్నే పలికారు''.

కైకేయి భరతునికి పట్టాభిషేకము చేయుమని దశరథుడు తనకు ఇచ్చిన వరములను గుర్తు చేయు సందర్భమున సత్యాన్ని గూర్చి ఈ విధంగా పలికింది. "సత్యవాక్యమే మానవులకు పరలోకవాసమునందు సౌఖ్యము కలిగించునది అని తపోధనులు చెప్పెదరు కదా''. (అయోధ్య కాండము 11వ సర్గము)

సత్యము యొక్క ప్రాముఖ్యాన్ని గురించి అయోధ్య కాండము 14వ సర్గములో ఈ విధముగా చెప్పబడ్డది.

"సత్యము అనే ఒక పదము బ్రహ్మరూపము, ధర్మము సత్యము మీదనే ఆధారపడి యున్నది. సత్యమే అక్షయ వేదాలు. సత్యము ద్వారానే పరమపదమును చేరగలుగుతారు''

పై అంశాలన్నీ సత్యము యొక్క ప్రాశస్త్యాన్ని వెల్లడించేవే.

## 3) అసత్యము :

రామాయణ కావ్యము అయోధ్య కాండములో దశరథుని మూడవ భార్యయైన కైకేయి అసత్యమాడిన సందర్భాన్ని పరిశీలిద్దాము.

రామపట్టాభిషేకానికి ఏర్పాట్లు జరిగాయి. తెల్లవారితే రామ పట్టాభిషేకము. కైకేయి ఒత్తిడికి లొంగి రామపట్టాభిషేకము జరగటము లేదు. భరతుని పట్టాభిషిక్తుని గావించటానికి దశరథుడు కైకేయికిచ్చిన వరము ద్వారా నిర్ణయమయింది. దశరథుడు కైకేయిని ఒప్పించి రామునికే పట్టాభిషేకము చేయటానికి ప్రయత్నించాడు. దశరథ మహారాజు కైకేయి మధ్య ఆ రాత్రి పొద్దుపోయేవరకు సంవాదము జరిగింది. కైకేయి వినలేదు. దశరథుడు మనోవ్యథ చెంది సరిగా నిద్రపోలేదు. తెల్లవారగానే సుమంతుడు ఏర్పాట్లు గూర్చి దశరథునితో చర్చించటానికి వచ్చాడు. రాజుగారు నిద్ర లేవలేదని, రాత్రంతా పట్టాభిషేక విషయమై ఆలోచించి అలసిపోయాడని కైకేయి సుమంతునితో అసత్యము చెప్పింది. కైకేయి చెప్పింది పూర్తిగా అసత్యము. (అయోధ్య కాండము 14వ సర్గము)

అసత్యాలు చెప్పిన వ్యక్తి (కైకేయి) స్వార్థపూరితమైన వ్యక్తి గనుకనే కుమారుడైన భరతుడు ఆమె నిర్ణయాన్ని వ్యతిరేకించి, ఆమెను నిందించాడు, ఖండించాడు. ఇది అసత్య ఫలితముగా భావించవచ్చును.

## 4) ధర్మము :

ధర్మాన్ని గూర్చి రామాయణంలో అనేక చోట్ల, అనేక కాండములలో ప్రస్తావించాడు వాల్మీకి. ఈ అంశాన్ని ఈ పుస్తకంలో ఒక అధ్యాయంగా వ్రాయదలచుకొన్నాను గనుక ఇక్కడ అతి క్లుప్తంగా ప్రస్తావన చేస్తాను.

అరణ్యకాండము 9వ సర్గములో ధర్మాన్ని గూర్చి ఈ విధంగా వ్రాయబడ్డది. "ధర్మము అర్థమునకు కారణము. ధర్మము సుఖమునిచ్చును. ధర్మముచే మానవుడు సర్వమును పొందగలడు''.

రాముడు రామాయణంలో ధర్మాన్ని పాటించాడు గనుకనే మరలా అయోధ్య రాజ్య పట్టాభిషిక్తుడయ్యాడు. రావణ సంహారము చేశాడు. కిష్కింధ రాజ్యాన్ని

సుగ్రీవునికి, లంకా నగరాన్ని విభీషణునికి ఇప్పించగలిగాడు.

**5) క్షమాగుణం :**

మానవ గుణములలో క్షమాగుణము చాలా గొప్ప గుణము. మానవులలో కొద్దిమంది మాత్రమే ఈ గొప్పగుణాన్ని కలిగి ఉంటారు. ఏసుక్రీస్తు కూడా తనను చంపేవారిని (శిలువ వేసేవారిని) గురించి దేవుని ప్రార్థించాడు. "తండ్రీ! వీరేమి చేయుచున్నారో వీరికి తెలియదు. కనుక వీరిని క్షమించమ''న్నాడు. ఆధునిక యుగములో మహాత్మాగాంధిని గొప్పవానిగా చేసిన గుణములలో క్షమాగుణమొకటి.

రామాయణంలో యుద్ధకాండము 113వ సర్గములో వాల్మీకి క్షమాగుణ ప్రస్తావన చేశాడు. హనుమంతుడు సీతను మొదటిసారి చూచినపుడు ఆమె మాసిన శరీరము, మాసిన వస్త్రములతో, విచార వదనముతో దీనంగా అశోకవృక్షము క్రింద కూర్చొని ఉన్నది. రావణుడు ఆమెకు రెండు మాసములు గడువు విధించి తన భార్యగా ఉంటుందో, లేదో నిర్ణయించుకోమన్నాడు. ఆ తరువాత ఆమెను చంపివేస్తానన్నాడు. ఆడ రాక్షసులను ఆమెకు కాపలాగ ఉంచాడు. వారందరూ సీతను చుట్టుముట్టి రావణుని కోరికను మన్నించకపోతే చంపివేస్తామన్నారు. ఉన్నపరంగా తినివేస్తామని బెదిరించి భయపెట్టారు. దైవవశాత్తు ఆ తరువాత రావణ సంహారము జరిగింది. ఆ విషయాన్ని తెలియజేయడానికి హనుమంతుడు అశోకవనములో ఉన్న సీతను దర్శించాడు. ఆమెతో రావణ సంహార విషయము చెప్పి, ఆ ఆడరాక్షసులను చంపుటకు సీత అంగీకారాన్ని అడిగాడు. ఆ సందర్భంలో సీత ఆ ఆడరాక్షసులందరూ రావణుని ఆజ్ఞను పాటించి తనను భయపెట్టి వేధించారని వారందరిని క్షమిస్తున్నానన్నది. ఇది సీత గొప్పతనం. వాల్మీకి సీత నోట క్షమాగుణాన్ని పలికించాడు. ఇది మానవోత్తము గుణము.

**6) ఉపకార, అపకార గుణాలు :**

వీటి ప్రస్తావన యుద్ధకాండము 113వ సర్గములో వాల్మీకి చేశాడు. హనుమంతుడు మొదట అశోకవనములో సీతను చూచాడు. ఆమె చుట్టూ కాపలాగా అనేకమంది ఆడ రాక్షసులున్నారు. రావణుడు చివరిసారిగా, అతని భార్యగా

ఉండటమో లేదో తేల్చుకోవటానికి సీతకు రెండు మాసములు గడువు ఇచ్చాడు. అప్పుడు ఆ ఆడరాక్షసులందరూ ఆమెను భయపెట్టారు, చంపుతామన్నారు, ఉన్నపళంగా తింటామన్నారు. సీత పరిస్థితి దిక్కు తోచని స్థితి. ఆ తరువాత దైవవశాత్తూ రావణ సంహారము జరిగింది. ఆ విషయాన్ని సీతకు తెలియజేయడానికి హనుమంతుడు మరలా సీతను దర్శించి తెలియజేసి ఇంతకుముందు ఆమెను **(సీతను)** వేధించిన ఆడ రాక్షసులను చంపటానికి సీత అంగీకారాన్ని కోరాడు. ఆ సందర్భములో సీత ఉపకార-అపకార ప్రస్తావన చేసింది. అపకారము చేసినవారికి కూడా ప్రత్యపకారము చేయగూడదని చెప్పింది. కలియుగంలో సుమతీ శతక కవి బద్దెన కూడా **16**వ పద్యంలో "నపకారికి నుపకారము నెపమెన్నక సేయువాడె నేర్పరి సుమతీ!'' అన్నాడు.  బద్దెన కవి రామాయణం చదివాడో లేదో మనకు తెలియదు. కాని, "అపకార-ఉపకార'' విషయములో బద్దెన కవి అభిప్రాయము సీత అభిప్రాయము ఒకే విధంగా ఉన్నాయి. అపకారము చేసినవారికి కూడా ప్రత్యపకారము చేయవద్దన్నాడు. ఉపకారమే చేయమన్నాడు.

**7) స్త్రీ వధ :**

స్త్రీలను చంపుట పాపమని హనుమంతుడు ఇంద్రజిత్తుతో యుద్ధకాండములో చెప్పాడు.

కానీ ప్రస్తుతము మనమున్న కలియుగములో ప్రతి రోజు ఎవరో ఒకరు స్త్రీలను చంపే వార్తలను మనం టెలివిజన్‌లో, వార్తాపత్రికల్లో చూస్తున్నాము. రామాయణం చదివితే ఆ చదివినవారు **స్త్రీలను చంపలేరేమో!**

**8) స్త్రీకి పతియే గతి (రక్షకుడు) :**

అయోధ్యకాండము **61**వ సర్గములో స్త్రీని గురించి ఈ విధంగా చెప్పబడినది. "స్త్రీకి మొదటి గతి **(**రక్షకుడు**)** భర్త, రెండవ గతి కుమారుడు, మూడవగతి జ్ఞాతులు, తదుపరి నాల్గవ గతి లేదు''.

భార్యాభర్తల బంధాన్ని బలోపేతము చేసే పలుకులివి. ప్రతి స్త్రీ రామాయణం చదివినా, విన్నా **విడాకుల సమస్యలు రాకపోవచ్చునేమో!**

## 9) భార్యాభర్తల బంధం :

ఉత్తరకాండము **48**వ సర్గములో సీతను లక్ష్మణుడు అరణ్యములో వదలిపెట్టి ఆమె పరిత్యాగాన్ని గురించి ఆమెకు తెలిపి దుఃఖించి వెనుదిరుగుతాడు. ఆ సందర్భములో సీత దుఃఖావిష్టురాలై రామునకు లక్ష్మణుని ద్వారా తన సందేశాన్ని పంపి లక్ష్మణుడు తనను విడచి వెడలిన తరువాత విలపించింది. ఆ సందర్భాన భార్యాభర్తల బంధాన్ని గురించి ఈ విధంగా అన్నది. "స్త్రీకి భర్తయే దేవత, భర్తయే బంధువు, భర్తయే గురువు''.

సీత నిజమైన భారత స్త్రీ. భారత స్త్రీకి నిలువెత్తు నిదర్శనము. భారతీయ సంస్కృతికి మూలము సీతారాముల ఆదర్శ జీవితము. అందువల్లనే భారతదేశాన్ని ప్రపంచ దేశాలతో పోల్చి చూచినప్పుడు భార్యాభర్తల బంధం బలంగా ఉన్నది. ఇది భారతీయ సంస్కృతి. భారతీయ సంస్కృతిలో ఒకసారి వివాహమైన స్త్రీ జీవితాంతము ఒకే భర్తతో కాపురము చేస్తుంది. ఆధునిక భారతీయ సంస్కృతిలో ఇదికొంత సడలింది. ఇప్పుడిప్పుడే విడాకుల సంస్కృతి భారతదేశములో పెరుగుతుంది. ప్రతి స్త్రీ అక్షరరాశియైనా, నిరక్షరరాశియైనా రామాయణాన్ని విన్నా, చదివినా భారతీయ విలువల వంటబడతాయి.

## 10) ధైర్యగుణం :

ఇది ఉత్తమ గుణాలలో ఒకటి. జీవితాన్ని జీవించటానికి ప్రతి వ్యక్తికి కావలసింది ధైర్యగుణం. రామాయణం చదివితే ఈ ధైర్యగుణం అధికంగా ఉన్నవారు రామలక్ష్మణులు, హనుమంతుడు, రావణుడు, ఇంద్రజిత్తు, కుంభకర్ణుడు, వాలిసుగ్రీవులు, విభీషణుడు మొదలగువారు. రామలక్ష్మణులు ధైర్యగుణమున్నవారు గనుకనే రావణ సంహారము చేయగలిగారు. విజయాన్ని సొంతం చేసుకొని సీతతో కలిసి అయోధ్య నగరానికి తిరిగివచ్చారు. రామలక్ష్మణులు ధైర్యగుణమున్నవారు గనుకనే అనేకమంది రాక్షసులను చంపగలిగారు.

## 11) సనాతన ధర్మము :

రాముడు వనవాసానికి వెళ్ళు సందర్భాన తన తల్లి అనుమతికై ఆమె

అంతఃపురానికి వెళ్ళాడు. ఆ సందర్భములో తల్లితో తనకై చింతించవలదని తాను (రాముడు) తండ్రి మాటను ఆచరించవలెనని, అతడే అందరికిని రాజు, పోషకుడు, పూజ్యుడు, శ్రేష్ఠుడు, అధిపతి, ఆజ్ఞాపించు అధికారము గలవాడన్నాడు. పదునాలుగు సంవత్సరములు మహారణ్యంలో విహరించి వచ్చి ఆనంద పూర్వకంగా తల్లి ఆజ్ఞను అనుసరిస్తానన్నాడు. భర్త జీవించి ఉన్నంతకాలము అతనికి సేవ చేయటమే భార్య సనాతన ధర్మమన్నాడు. (అయోధ్యకాండము 24వ సర్గము)

**12) కామము :**

సాధారణార్థములో కామమనగా "కోరిక" అని అర్థము. విశేషార్థములో స్త్రీలయందు కామవాంఛ ఉండటము అని అర్థము. రావణుడు కామాతురుడు, కామ మోహితుడు, ఎల్లప్పుడూ పర స్త్రీలయందు కామవాంఛ కలవాడు. కామవాంఛతో ప్రవర్తించువాడు. కనుకనే ఎందరో పరస్త్రీలను అపహరణ చేసి తన భార్యలుగా చేసుకొని లంకా నగరములో కాపురమున్నాడు. చివరకు రాముని భార్యయైన సీతను గూడా అపహరించి లంకా నగరానికి తెచ్చాడు. సీత రావణునితో కామవాంఛ లేని స్త్రీ గనుక రావణుని బెదిరింపులకు లొంగలేదు. చివరకు రాముని చేతిలో రావణుడు మరణించాడు. పరస్త్రీ వాంఛా ఫలితము రావణునికి మరణము.

ఇదే విషయాన్ని భారతము కూడా స్పష్టం చేసింది. కీచకవధ ఘట్టంలో విరాటరాజు ఇంట వంటమనిషిగా చేరిన ద్రౌపదిమీద కన్నువేసి కీచకుడు, రాజుగారి బావమరిది ఆమె సంగమాన్ని అభిలషించి, భంగపడి చివరకు భీముని చేతిలో మరణము పొందాడు. కీచకుని మరణానికి కారణము పరస్త్రీ వాంఛ (ద్రౌపది మీద కోరిక). ఈవిధముగా ప్రపంచ సాహిత్యములో ఇవే సంఘటనలు పునరావృత మయ్యాయి. గ్రీసు దేశంలో ట్రోజన్‌వార్ (యుద్ధము) హెలెన్ ఆఫ్ ట్రాయ్ కోసమే జరిగాయి.

భారతీయ ఇతిహాసాలైన రామాయణ, మహాభారతములు కొన్ని వేల సంవత్సరాల క్రితమే పరస్త్రీ జోలికి వెళ్ళవద్దనే హెచ్చరికలు భారతజాతికి చేశాయి. అందుకు భారతీయులమైన మనందరము రామాయణం చదవాలి.

# అధ్యాయము - 5

# రామాయణ కాలంనాటి గూఢచారి వ్యవస్థ - నేర పరిశోధన

ప్రతి రాజ్యములోను గూఢచార వ్యవస్థ ఉంటుంది. పూర్వము రాజుల కాలం నుండి నేటి ప్రజాస్వామ్య యుగము వరకు ఈ గూఢచార వ్యవస్థ రాజ్య, దేశ రక్షణ విషయములో సమాచారము సేకరించి, పొరుగు దేశాల వలనగాని, శత్రువుల వలన గాని, దేశములో ఉన్న ప్రభుత్వ శత్రువుల వల్లగాని, ప్రభుత్వాలకు గాని, ప్రభుత్వములో ఉన్న వ్యక్తులకు గాని ఏమైనా ముప్పు ఉన్నదా? ఇతర పార్టీల నాయకుల వల్ల ప్రభుత్వాలకు గాని, వ్యక్తులకు గాని ఏదైనా ప్రమాదమున్నదా? ఎవరైనా తెలియకుండా, రహస్యంగా నేరాలకు పాల్పడుతున్నారా? ప్రభుత్వాలకు, ప్రభుత్వ పెద్దలకు ఎవరు శత్రువులున్నారు? - ఇత్యాది విషయాలు పూర్వమున్న రాజ్యాలలోగాని, ప్రస్తుతమున్న ప్రజా ప్రభుత్వాలలోగాని తెలుసుకోవటానికి, గూఢచారి వ్యవస్థలు, నిఘా వ్యవస్థలు, నేర పరిశోధక సంస్థలు అత్యంత అవసరము. రామాయణ, మహాభారత కాలములో గూడా గూఢచార వ్యవస్థలున్నాయి.

రామాయణాన్ని పరిశీలించినపుడు రామాయణంలో మూడు కాండాలలో మాత్రమే మనకు ఈ గూఢచార వ్యవస్థ కనబడుతుంది. 1. కిష్కింధ కాండము, 2. సుందరకాండము, 3. యుద్ధకాండము.

**ముందుగా కిష్కింధకాండాన్ని పరిశీలిద్దాము :**

కిష్కింధ రాజ్యాన్ని "వాలి" అనే వానరరాజు పరిపాలిస్తున్నాడు. పరాక్రమశాలి. వాలి, సుగ్రీవులు అన్నదమ్ములు. వారిరువురూ బలవంతులే. వాలి పెద్దవాడు, సుగ్రీవుడు చిన్నవాడు. స్వల్ప విషయానికి సుగ్రీవుని రాజ్యమునుండి బహిష్కరించాడు వాలి. తాను కిష్కింధరాజ్యములో నివసిస్తే ప్రాణ భయమున్నదని అనుమానించిన సుగ్రీవుడు కొంతమంది సైన్యాన్ని తీసుకొని హనుమంతునితో సహా ఋష్యమూక పర్వతానికి చేరాడు. సీతారాములు అరణ్యవాసము చేయుచుండగా దండకారణ్యంలో

సీత అపహరణకు గురైంది. సీతను వెదకుచు రామలక్ష్మణులు ధనుర్ధరులై ఋష్యమూక పర్వతానికి చేరి అక్కడ నివసిస్తున్నారు. రామలక్ష్మణులు ఋష్యమూక పర్వతము మీద ఉన్నారని తెలుసుకున్న సుగ్రీవుడు వారిని గురించి విని వారి వివరాలు తెలుసుకొనే భాగంలో హనుమంతుని వారి వద్దకు పంపి హనుమంతునితో ఈ విధంగా చెప్పాడు. "హనుమంతా! నీవు సామాన్యుడి వలె వెళ్ళి వారి ముఖ వర్ణము, చేష్టలు, మొదలైన వాటి పద్ధతులను రాబట్టి మాటలను బట్టి వారెవరో తెలిసికొనుము. వీరి భావమేమియో గుర్తించుము. వీరి మనస్సులు ప్రసన్నముగానే ఉన్నచో, పొగడ్తల చేతను, అనుకూల చేష్టల చేతను వారి మనస్సులో అధికముగా విశ్వాసమును పుట్టించుము. నీవు నా వైపే తిరిగి నిలబడి, "మీరు ఈ వనములో ఎందుకు ప్రవేశించినారు?" అని ధనుర్ధరులైన వీరులను ప్రశ్నింపుము. వీరి మనస్సు మన విషయములో పరిశుద్ధముగానే ఉన్నదా అను విషయము తెలిసికొనుము. వీళ్ళు మంచివాళ్ళా, చెడ్డవాళ్ళా అను విషయమును మాటలను పట్టి కూడా తెలిసికొనుము".

సుగ్రీవుని మాటలను మన్నించి హనుమంతుడు రామలక్ష్మణులున్న ప్రదేశమునకు వెళ్ళి వారిని ప్రశ్నించారు. తనను గూర్చి, సుగ్రీవుని గూర్చి వారికి చెప్పాడు. ఆ తరువాత హనుమంతుని వాక్చాతుర్యాన్ని గూర్చి రాముడు లక్ష్మణునికి చెప్పాడు. సీతను అన్వేషించుటలో సుగ్రీవుని సహాయము కావలెనని లక్ష్మణుడు కోరగా వారిద్దరకు నమ్మిక కలుగజేసి వారిని తనతో సుగ్రీవుని వద్దకు కొనిపోయాడు. ఆ తరువాత సుగ్రీవునితో రామలక్ష్మణులకు మైత్రీ బంధము ఏర్పడ్డది. **(కిష్కింధకాండము - 2వ సర్గము)**

**2.** రామలక్ష్మణుల స్నేహము సుగ్రీవాదులతో బలపడిన తరువాత వారు సీతాన్వేషణ విషయములో సుగ్రీవుని సహాయము కోరగా సుగ్రీవుడందుకు అంగీకరించాడు. రాముని దుఃఖము అచిరకాలములోనే పోవునన్నాడు. నష్టమైన వేదమునువలె సీతను తెస్తానన్నాడు. సీత పాతాళములో ఉన్నా, ఆకాశమునందున్నా ఆమెను తెచ్చి రామునికి ఇస్తామన్నాడు. ఆ మాటలు విన్న రామునికి ధైర్యము వచ్చింది.

ఒక వ్యక్తి ఇంట్లో 20 సవర్ల బంగారము పోతే పోలీసులనాశ్రయిస్తారు. త్వరలో దొంగలను పట్టుకొని ఆ బంగారాన్ని రికవరీ చేసి ఇస్తామని ఆ పోలీసులు అంటే ఆ

యజమాని ఆనందానికి అవధులు ఉండవు. తాత్కాలిక దిగులును మరచిపోతాడు. ధైర్యంగా ఉంటాడు. రాముని పరిస్థితి కూడ ప్రస్తుతము సుగ్రీవుని మాటలు విన్న తరువాత అంతే ఉన్నది.

సీతను ఆ రాక్షసుడు అపహరించుకొని పోవుచుండగా ఆ రావణుని ఒడిలో ఆడసర్పము వలె దొర్లుచూ రామా, రామా! అని, లక్ష్మణా! అని వికృతస్వరముతో ఏడ్చుచూ ఆనాడు తన కంటబడిన స్త్రీ సీతయే, సందేహము లేదని ఊహచే తెలుసుకొన్నానని సుగ్రీవుడు రామునితో చెప్పాడు. ఆ తరువాత సుగ్రీవుడు సీత ఉత్తరీయమును, శ్రేష్టమైన అలంకారములను పచ్చికబయళ్ళనుండి తీసి గుహలో దాచి ఉంచానన్నాడు. వాటిని తెచ్చి రామునికి చూపాడు. రామలక్ష్మణులు వాటిని గుర్తించామన్నారు. వారు అవి సీతవే అని నిర్ధారించారు. రావణుడు ఏవైపు వెళ్ళాడని రాముడు అడుగగా దక్షిణ దిక్కు వెళ్ళినట్టు సంపాతి చెప్పినట్లుగా చెప్పారు.

ఇక్కడ జరిగిన నేరము - సీతాపహరణము. ఆధారాలు చూపించటం అవి సీతవే అని నిర్ధారణ జరిగింది. వారు వెళ్ళిన దిక్కు దక్షిణం వైపు అని గూడా నిర్ధారణ జరిగింది. ఈ నేరానికి ఆధారాలు సీత ఉత్తరీయము, ఆభరణాలు. (కిష్కింధకాండము 6వ సర్గము)

**2. సుందరకాండము :**

హనుమంతుడు సీత జాడకై దక్షిణదిక్కున ఉన్న సముద్రాన్ని దాటి లంకా నగరములో ప్రవేశించుటకు ఆకాశమార్గాన తన దేహాన్ని పెంచి సముద్రము మీదుగా లంకానగరము చేరి లంకలో ప్రవేశించి తన దేహాన్ని చిన్నదిగా చేసి లంకా నగరాన్ని రావణ గృహాన్ని చూచాడు. హనుమంతుడు రహస్యంగా లంకలో చూచిన దృశ్యాలను పరిశీలిద్దాము.

వివిధ రకాల రాక్షసులను హనుమంతుడు చూశాడు. హనుమంతుడు చూసిన రాక్షసుల వివరాలు ఇవి.

1. యజ్ఞాది దీక్ష వహించిన కొందరు జటలు ధరించారు.

2. కొందరు ముండనము చేయించుకొని ఉన్నారు.

**3.** కొందరు ఎద్దు చర్మాలను, మరి కొందరు ఇతర వస్త్రములను ధరించి ఉన్నారు.

**4.** కొందరు పిడికెడు దర్భలు అభిమంత్రించి శత్రు వినాశాదులకు ఉపయోగించుటచే అవియే వారికి ఆయుధములుగా ఉపయోగపడుచుండెను.

**5.** కొందరు కూటములు, ముద్గరములు, దండములు అను ఆయుధములను ధరించి ఉన్నారు.

**6.** ఒంటి కంటి వాళ్ళు, ఒంటి చెవిటివాళ్ళు, వ్రేలాడుతున్న పొట్ట, చన్నులూ కలవాళ్ళూ, భయంకరమైన ఆకారము కలవాళ్ళు, వంకర మూతుల వాళ్ళు, వికృత రూపము కలవాళ్ళు, పొట్టివాళ్ళు - ఈ విధముగా అక్కడ అనేక విధముల రాక్షసులుండిరి.

**7.** కొందరు విచిత్రములైన కవచములతో ప్రకాశించుచు ధనుస్సులు, ఖడ్గములు, శతఘ్నులు, పరిఘులు మొదలైన ఆయుధములు ధరించి ఉండిరి.

**8.** కొందరు అంత పొడవు కాని, సన్నముకాని కాక చామనఛాయలో ఉండిరి.

**9.** కొందరికి కొంచెము గూని ఉండెను, కొందరు పొట్టిగా ఉండిరి కాని అంతగా పొట్టిగా లేరు.

**10.** కొందరు వికృత రూపములతోను, కొందరు అనేక విధములైన రూపములతోను ఉండిరి.

**11.** కొందరు అందమైన ఆకారములతో, తేజస్సుతో ప్రకాశించుచుండిరి.

**12.** కొందరు ధ్వజములు, కొందరు పతకాలు, కొందరు ఇంకా అనేక విధములైన ఆయుధములు ధరించి ఉన్నారు.

**13.** నూరువేలమంది (లక్ష) సైనికులున్న ఒక సేనానివేశము పుర మధ్యమునందు సర్వసన్నద్ధముగా, సావధానముగా ఉండెను.

**14.** ఆ సేనానివేశము రావణుని ఆజ్ఞ ప్రకారము, అతని అంతఃపురం ఎదుట నిలబడి ఉండెను. హనుమంతుడు దానిని కూడా చూశాడు.

**15.** రావణుని గృహము స్వర్గము వలె ప్రకాశించుచుండెను. ఉత్తమమైన అశ్వములు, రథములు, తెల్లని మేఘముల సముదాయము వంటి నాలుగేసి దంతములుగల

మహా గజములు ఆ గృహమునకు అలంకారముగా ఉన్నాయి. అట్టి రావణుని గృహాన్ని హనుమంతుడు రహస్యముగా చూశాడు. (సుందరకాండము 4వ సర్గము)

హనుమంతుడు తన దేహాన్ని చిన్నదిగా చేసి వానరరూపములో ఉండి లంకా నగర రహస్యాలను తెలుసుకొన్నాడు గనుక అతనిని అనుమానించే అవకాశము లేదు. పట్టుకునే అవకాశము లేదు.

**4.** సుందరకాండము **21**వ సర్గములో సీతను భయపెట్టుటకు చేసిన ప్రయత్నము తరువాత సీత రామునితో పోల్చుకొనుటకు రావణుడు తగడని తుచ్ఛుడని నిందించుచు రావణునికి బోధ చేసిన సందర్భంలో ఈ విధముగా అన్నది.

"పెద్ద పులుల గంధమును వాసన చూచిన కుక్క వాటి ఎదుట ఎట్లు నిలువజాలదో, అట్లే రామలక్ష్మణుల గంధము వాసన చూచిన పిమ్మట రావణుడు వారి ఎదుట నిలువజాలడన్నది!"

సీత మాటలలో గూఢచారమేమున్నదని సామాన్య పాఠకులనుకొనవచ్చు. నరేంద్రమోడి ప్రభుత్వములో (2017లో అనుకుంటాను) పాకిస్థాన్ మీద భారత ప్రభుత్వము సర్జికల్ దాడి (స్టింగ్ ఆపరేషన్) చేసింది. పాకిస్థాన్ సైనికులు నివశించే టెంటుల మీద రాత్రి వేళయందు దాడి చేసి వారిని హతమార్చింది. వారి డేరాల ముందు కుక్కలను కాపలాగా ఉంచారు. భారత సైనికులు పులుల మలమూత్రాలను సైనికుల టెంట్ల ముందు స్ప్రే చేశారు. ఆ వాసన పీల్చిన కుక్కలు మొరగవు. మొరగ లేవు. భయపడతాయి. అందువల్ల భారత సర్జికల్ దాడి విజయవంతమైంది. సునాయాసంగా భారత సైనికులు పాకిస్థాన్ సైనికులను చంపగలిగారు. పాకిస్థాన్ సైనికులపై దాడికి పులుల మలమూత్రాలు ఉపయోగపడ్డాయి.

ఈ సర్జికల్ ఆపరేషన్‌ను గురించి కొన్ని వేల సంవత్సరాలకి పూర్వమే రామాయణం చెప్పింది. అది నేటికి నిజమని ఋజువయింది.

ఇక్కడ సీత రామలక్ష్మణులను పులులతోను, రావణుని కుక్కతోను పోల్చుటము గమనార్హం. పులులు ఎక్కువ శక్తి కలవి. బలము కలవి. వాటితో పోల్చినపుడు కుక్క బలము అతి స్వల్పము. కుక్క పులుల ముందు నిలువజాలదు.

సీత మాటలు రావణుని ఓటమిని, మరణాన్ని సూచిస్తున్నాయి.

**5. సుందరకాండములోని చివరి గూఢచారము ఇది.**

హనుమంతుడు లంకలో ప్రవేశించి అక్కడ ఉన్న ఉద్యానవనములను నాశనము చేయుచుండగా అక్కడ ఉన్న రాక్షసులు ఆ దృశ్యాన్ని చూచి హనుమంతునితో యుద్ధము చేసి అతనిని బంధించి రావణుని ఎదుటికి తెచ్చారు. రావణుడు గొప్ప తేజస్సుకల హనుమంతుని చూచి అతనిని అనుమానించాడు. పూర్వము తాను కైలాస పర్వతమును కదల్చినపుడు తనను శపించిన నందియే ఈ రూపములో వచ్చెనని తలచాడు. ఇతడు వానర రూపమున వచ్చిన మహాబలుడైన బాణుడా! అని ఆలోచించాడు.

హనుమంతుని తన మంత్రి శ్రేష్ఠుడైన ప్రహస్తునికి అప్పగించి ఇతడెవరో తెలుసుకోమన్నాడు. పిమ్మట ప్రహస్తుడు హనుమంతునితో నీవెవరు? ఎందుకు వచ్చినావు? నీకు ఇక్కడ పని ఏమి? అని ప్రశ్నించాడు. ప్రహస్తుడు హనుమంతుని అనుమానించి ఇంకా ఈ విధంగా ప్రశ్నించాడు - "గూఢచారి రూపములో మా నగరములోనికి ప్రవేశించినావు. నిన్ను కుబేరుడు పంపినాడా? యముడు పంపినాడా? ఎవరు పంపినారు? వరుణుడు పంపినాడా? లేక విజయము కోరుచు విష్ణువు నిన్ను దూతగా పంపినాడా? అని ప్రశ్నించాడు.

నీవు సత్యము చెప్పినచో నిన్ను వదలివేస్తామని లేనిచో నీ ప్రాణము తీస్తానని ప్రహస్తుడు హనుమంతునితో అన్నాడు.

అందుకు హనుమంతుడు ఈ నగరానికి రావలెననియే వచ్చానన్నాడు. రావణునితో మీ దర్శనము అంత తేలికగా లభించదు కదా! అందుచేత నీ దర్శనము కొరకై ప్రసిద్ధమైన ఉద్యానవనమును నశింపచేశానన్నాడు. దేవతలు, అసురులు కూడా తనను అస్త్ర పాశములతో బంధింపజాలరన్నాడు. తనకు కూడా ఆ వరము బ్రహ్మ దేవునినుండే లభించినది అన్నాడు. రాక్షసులు నన్ను బంధించగానే అస్త్రములు తనను విడిచివేసినదని అన్నాడు. ఒకానొక రాజకార్యము చేత రావణుని వద్దకు వచ్చానన్నాడు. తాను అపరిమితమైన తేజస్సు గల రాముని దూతనని చెప్పాడు.

రావణుని స్వయముగా కలిసి రాముని పరాక్రమాన్ని గురించి తెలిపి రావణునికి నీతి బోధ చేయుటము హనుమంతుని నిశ్చయము. అక్రమంగా లంకలోకి ప్రవేశించి ఉద్యానవనములు నాశనము చేసినందుకు హనుమంతునికి విధింపబడిన శిక్ష అతని తోకకు నిప్పు పెట్టి వీధుల వెంట తిప్పటం. ఆ తరువాత హనుమంతుడు ఆ కాలిన తోకతో లంకాదహనము చేశాడు.

**6.** విభీషణుడు రావణునికి స్వయాన తమ్ముడు. రావణుని రాక్షస చర్యలను ఖండించిన వ్యక్తి. సీతను అన్యాయంగా తెచ్చాడని, ఆమెను రామునికి అప్పగించమని అన్నకు నీతి బోధ చేసిన వ్యక్తి. రావణుని రాక్షస చర్యలు నచ్చక అతనిని వదలి రాముని దగ్గరకు వీరులైన నలుగురు రాక్షసులతో బయలుదేరి సముద్రపు ఒడ్డున ఆకాశమునందు నిల్చొని ఉండి సుగ్రీవునితో, "నేను విభీషణుడిని, రావణుని తమ్ముడిని, రాముని ఆశ్రయించి వచ్చినాను" అని చెప్పగా సుగ్రీవుడు ఈ విషయాన్ని రామునికి విన్నవించాడు. రాముడు సుగ్రీవుని మంత్రుల అభిప్రాయాన్ని తెలియజేయమన్నాడు. వారందరూ విభీషణుడిని అనుమానించి విభీషణుడిని రాముని స్నేహితునిగా అంగీకరించాలా లేదా అనే విషయము మీద పెద్ద చర్చ జరిగింది. ఆ చర్చ ద్వారా మంత్రులు వారి వారి అభిప్రాయాలను వ్యక్తం చేశారు. ఆ అభిప్రాయాలను పరిశీలిద్దాము.

**1. అంగదుడు :** అంగదుడు తన అభిప్రాయాన్ని ఈ విధంగా వ్యక్తం చేశాడు. విభీషణుడు శత్రువు దగ్గరనుండి వచ్చినాడు. అన్నివిధాలా సందేహింపదగినవాడే అన్నాడు. అందుచేత తొందరపడి అతనిని విశ్వాసపాత్రునిగా చేయకూడదన్నాడు.

**2. శరభుడు :** విభీషణుని పరీక్షించుటకై వెంటనే గూఢచారిని పంపి సూక్ష్మబుద్ధిగల ఆ గూఢచారిచేత బాగా పరీక్షించి అటు పిమ్మట న్యాయానుసారము అతనిని స్వీకరించవచ్చు లేదా విడువవచ్చునన్నాడు.

**3. జాంబవంతుడు :** శాస్త్రీయ పద్ధతిలో పరిశీలించాలన్నాడు. ఇతడు రామునితో వైరముగట్టిన రావణుని సోదరుడు. దేశము కాని దేశమునకు, కాలము కాని కాలమునందు వచ్చాడు. ఇతనిని గూర్చి అన్ని విధాల శంకించవలసి ఉన్నదన్నాడు.

**4. మైందుడు :** ఇతడు రావణుని తమ్ముడు కదా! ఇతడిని మధురమైన మాటలతో మెల్లగా ప్రశ్నించుట మంచిదన్నాడు. ఇతని అభిప్రాయమేమో యదార్థము తెలిసికొని ఇతడు దుష్టుడా, కాదా అను విషయమును గ్రహించి పిమ్మట తగు నిర్ణయము చేయవచ్చునన్నాడు.

**5. హనుమంతుడు :** ఒక్కొక్క పురుషుని చేరి గుణము దోషముగాను, దోషము గుణముగాను అవుతుందన్నాడు. రావణుని దుష్టత్వమును, రాముని పరాక్రమమును చూచి ఈ కాలమునందు ఈ దేశమునందు విభీషణుడు వచ్చుట యుక్తమేనన్నాడు. అప్రయత్నముగా లభించిన మిత్రుణ్ణి వంచనపూర్వకముగా ప్రశ్నించినచో ఆ మిత్రుడు విముఖుడైపోవునన్నాడు. విభీషణుడు మాటలాడుచున్నపుడు దుష్టమైన భావమేదీ ఉన్నట్లు ఒక్క మాట కూడా కనపడలేదన్నాడు. అతని ముఖము కూడా ప్రసన్నముగా ఉన్నదన్నాడు. అందుచేత అతని విషయమున సంశయము లేదన్నాడు.

వాలిని హతమార్చి సుగ్రీవుణ్ణి కిష్కింధ రాజుగా చేసిన విషయము విభీషణునికి తెలిసియే ఉంటుందన్నాడు. అందుకే అతడు రాముని స్నేహాన్ని అభిలషిస్తున్నాడన్నాడు.

పై అభిప్రాయములన్నీ పరిశీలించిన రాముడు విభీషణునితో స్నేహము అంగీకరించుటే యుక్తమని నిర్ణయించాడు. అంతేకాదు రాముడు యుద్ధకాండములో **ఒక ఉద్యమ నేతగా అవతరించాడనేది నా అభిప్రాయము.** ఉద్యమనేతలెవ్వరూ మనుషులను అంత తేలికగా వదలుకోరు. (యుద్ధకాండము 17వ సర్గము)

**7.** సముద్రము మీద మునుపెన్నడూ ఎవ్వరూ నిర్మించని సేతువుని వానరులు నిర్మించి రామలక్ష్మణ సుగ్రీవాదులు వానరసైన్యంతో లంకానగరము ప్రవేశించిన వేళ రావణుడు "శుకసారణు"లను గూఢచారులను వానరసేనలోకి పంపాడు. వీరిద్దరూ ఎవరికీ తెలియకుండా వానర సైన్యములోనికి ప్రవేశించి ఆ సైన్యము ఎంత ఉన్నదో, దాని బలము ఎట్టిదో, దానిలో ముఖ్యమైన నాయకులెవరో, సముద్రము మీద ఆ సేతువును ఎట్లు నిర్మించినారో, ఆ వానరులు ఎట్లు నిలిచినారో, రామ సుగ్రీవులతో కలిసి పనిచేయుచున్న మంత్రులు ఎవరో, శూరులైన ఏ వానరులు

సైన్యానికి ముందున్నారో, రామలక్ష్మణుల ఉద్యమము ఎట్లున్నదో యదార్థము తెలిసికొని రమ్మని చెప్పి పంపాడు.

రావణుని ఆజ్ఞానుసారము వీరులైన "శుకసారణులు" వానర సైన్యములో వానర రూపంలో ప్రవేశించారు, కానీ వారు వానర సైన్యాన్ని లెక్కించలేకపోయారు. విభీషణుడు వారిని గుర్తించి వారిద్దరూ రావణుని మంత్రులైన గూఢచారులని రామునికి చెప్పి వారిని చూపాడు. ఆ రాక్షసులిద్దరూ రాముణ్ణి చూచి భయపడ్డారు. రాముడు వారినుద్దేశించి ఈ విధంగా అన్నాడు. "మీరు సైన్యమునంతా చూచారా? మమ్ములను కూడా బాగాగా చూచినారా? మీ ప్రభువు ఆదేశించినట్లు పని పూర్తి చేసుకున్నారా? మీ పనులు పూర్తయితే స్వేచ్ఛగా తిరిగి వెళ్ళవచ్చునన్నాడు"

రాముడు రావణునికి వారి ద్వారా తన సందేశాన్ని పంపాడు. రేపు సాయంకాలములోపు లంకానగరాన్ని బాణములతో సంధిస్తానని తెలియజేయమన్నాడు. వారు సంతోషంగా వెళ్ళి రావణుని కలిసి రాముని పరాక్రమాన్ని, ఔదార్యాన్ని గూర్చి చెప్పి రామునితో సంధికావించుకొని సీతను రామునికి ఇచ్చివేయుమన్నారు.

సాధారణంగా గూఢచారులు పట్టుబడ్డప్పుడు వారిని నానావిధాలుగా ప్రశ్నించి ఇబ్బందులు పెట్టి శిక్ష విధిస్తారు. ఇది లోక రీతి. కాని రాముని ఔదార్యము వలన రావణుని గూఢచారులు శత్రువులకు పట్టుపడ్డప్పటికీ వారిని క్షేమంగా వెళ్ళమన్నాడు. ఇది రాముని ఔదార్యము, గొప్పతనము.

ప్రస్తుతము మన ప్రజాస్వామ్య దేశాలలో ఒక దేశ గూఢచారులు మరొక దేశములో పట్టుబడితే వారిని శిక్షించకుండా వదిలిపెట్టరు.

ఈ సందర్భంగా ఇటీవల అనగా ది. **14-2-2019** భారతదేశం కాశ్మీర్ రాష్ట్రములో జరిగిన ఒక ఉగ్ర దాడి నాకు గుర్తుకువస్తున్నది. ఆ ఉగ్రదాడిలో **40**మంది భారత జవాన్లు చనిపోయారు. తరువాత భారతదేశము పాకిస్థాన్‌పై చేసిన సైనిక దాడిలో **"అభినందన్ వర్ధమాన్"** అనే ఆర్మీ ఆఫీసర్ పాకిస్థాన్ సైన్యానికి పట్టుపడ్డాడు. వారు హనుమంతుని ప్రహస్తుడు ప్రశ్నించినట్లుగా నానా ప్రశ్నలు అభినందన్‌కు

సంధించి అతని నుండి భారత సైనిక రహస్యలు రాబట్టడానికి ప్రయత్నించినా అభినందన్ వారికేమీ చెప్పలేదు. అభినందన్ వర్ధమాన్ నిజాయితీకి దేశం అతనిని నానా విధాలుగా కీర్తించి ఎనలేని గౌరవాన్నిచ్చింది. పాకిస్థాన్ సైన్యం కారణమేదైనా అభినందన్ వర్ధమాన్‌ను తెచ్చి భారత ప్రభుత్వానికప్పగించింది.

**8.** రాముడు సముద్ర మార్గాన లంకా నగరము చేరిన తరువాత క్షోభింపశక్యముగాని సైన్యముతో ఉన్నాడు. లంకలో "సువేల పర్వతము" మీద నిలచి ఉన్నట్లు రావణుని గూఢచారులు అతనికి తెలిపారు. దీనిని బట్టి లంకా నగరములో గూఢచారి వ్యవస్థ పటిష్టంగానే ఉన్నదని స్పష్టమవుతుంది. సూర్యాస్తమయమునందు రాముడు తన గొప్ప సైన్యముతో సముద్ర తీరమును విడచి అర్ధరాత్రియందు అలసి ఉన్న సైన్యాన్ని ముందుగా తన గూఢచారులు బాగుగా పరీక్షించి ప్రహస్తునిచే పంపబడిన గొప్ప సైన్యము రాముని సైన్యాన్ని, రాముని చంపివేసిందని రావణుడు సీతకు తెలిపి ఆమెను తన భార్యగా ఉండుటకు అంగీకరించమన్నాడు.

మాయ రాముని శిరస్సును మాత్రమే రావణుడు ఖండించి సీతకు అబద్ధాలు చెప్పాడు. (యుద్ధకాండము 31వ సర్గము)

**9.** రాముడు యుద్ధములో మరణించలేదని ఇదంతా రావణుని మాయ అని "సరమ" సీతకు తెల్పగా సీత సరమను దుర్మార్గుడైన ఆ రావణుడు ఇంకా ఏమి చేయుచున్నాడు. అతని నిశ్చయమేమిటో స్వయముగా తెలిసికొని రమ్మని కోరినది. సీత కోరికను మన్నించి సరమ గూఢచారిగా వ్యవహరించింది. సరమ రాక్షసుడైన రావణుని సమీపమునకు వెళ్ళి మంత్రులతో కూడిన రావణుని సంభాషణమును విన్నది. పరమ దుర్మార్గుడైన రావణుని నిశ్చయమును గూర్చి విని, శీఘ్రముగా అశోకవనమునకు తిరిగివచ్చి సరమ కోసము నిరీక్షించుచున్న సీతను కలిసి రావణుని తల్లియైన "కైకసి" రావణునితో సీతను రామునికి ఇచ్చి వేయమని చెప్పిందని తెలియజేసింది. కానీ క్రూరుడు వినలేదు. మరణించేవరకు సీతను విడువనన్నాడని చెప్పింది. ఇది రావణుని స్థిర నిర్ణయము. (యుద్ధకాండము 34వ సర్గము)

**10.** రాముడు లంకానగరాన్ని ఆక్రమించటానికి ముందు రావణుడు లంకా నగర

రక్షణ ఏర్పాటు ఏవిధంగా చేశాడో రహస్యంగా తెలుసుకోవటానికి విభీషణుడు తన మంత్రులైన "అతనుడు", "పనసుడు", "సంపాతి", "ప్రమతు" అనువారితో పక్షి రూపము ధరించి లంకానగరమునకు వెళ్ళి యేయే దిక్కులలో ఎవరెవరు కాపలా ఉన్నారో తెలుసుకొని రామునికి విన్నవించాడు.

1. తూర్పు ద్వారము వద్ద గొప్ప పరాక్రమముగల ప్రహస్తుడు.

2. దక్షిణద్వారము వద్ద మహాపార్శ్వమహోదరులు.

3. పశ్చిమ ద్వారము వద్ద రావణు కుమారుడైన ఇంద్రజిత్తు అనేక ఆయుధములు ధరించి ఉన్నాడు.

4. ఉత్తర ద్వారము వద్ద రావణుడు ఆయుధములు ధరించి వేలకొలది సైన్యముతో ఉన్నారని తెలిపాడు.

శత్రు స్థావరాలు, కాపలాదారులను రహస్యముగా తెలిసికొని తగు జాగ్రత్తలతో వారిని ఎదుర్కొనుటయు గూఢచర్యములో భాగమే. (యుద్ధకాండము, 37వ సర్గము)

రామాయణకాలంనాటి గూఢచార వ్యవస్థతో పోలిస్తే ప్రస్తుత భారత గూఢచార వ్యవస్థ బలహీనంగా ఉన్నదనే విషయము దేశములో జరిగిన కొన్ని సంఘటనలు ఋజువు చేస్తున్నాయి.

1. భారత పార్లమెంటుపై కొన్ని సంవత్సరాల క్రితము ఉగ్రవాదులు దాడి చేశారు. వారిని కాపలాదారులు మట్టుబెట్టినప్పటికీ ముందస్తు గూఢచార సమాచారము లేదు.

2. గతంలో హైదరాబాద్ గోకుల్‌చాట్ మొదలగు ప్రాంతాల్లో టెర్రరిస్టుల దాడి జరిగి కొంతమంది మరణించినప్పటికి నిఘా వర్గాల ముందస్తు హెచ్చరికలు లేవు. ప్రభుత్వము అప్రమత్తము కాలేదు.

3. రాజీవ్‌గాంధి హత్య, చంద్రబాబునాయుడుపై నక్సలైట్ల దాడి తదితర విషయాల్లో నిఘావర్గాల ముందస్తు హెచ్చరికలుకాని, గూఢచార సమాచారము కాని లేదు.

4. కొన్ని సంవత్సరాల క్రితం టెర్రరిస్టులు ముంబై తాజ్‌హోటల్‌పై దాడి చేసినపుడు

కొంత ప్రాణనష్టం జరిగింది. ఒకరిద్దరిని పట్టుకున్నప్పటికీ నిఘావర్గాల ముందస్తు హెచ్చరికలు కాని, గూఢచార సమాచారము కాని లేదు.

**5.** ది. **14-2-2019**న కాశ్మీర్ రాష్ట్రములో పుల్వామాలో టెర్రరిస్టుల దాడి జరిగి **40** మంది భారత జవాన్లు మరణించిన పెద్ద సంఘటన. అక్కడ కూడా గూఢచార ముందస్తు సమాచారము కాని, నిఘావర్గాల హెచ్చరికలుగాని లేవు, ఉంటే ఆ దాడి జరిగేది కాదేమో!

గమనిక : నిఘావర్గాలు ముందస్తు హెచ్చరికలు చేసినా ప్రభుత్వము ఏవిధమైన చర్యలు తీసుకోలేదని మరికొందరి వాదనగా ఉన్నది.

పై సంఘటనలన్నీ భారత ప్రభుత్వ గూఢచార వైఫల్యాలుగా పరిగణించాల్సి ఉంటుంది.

# అధ్యాయము - 6

సీత గొప్ప గుణాలను తెలుసుకోవటానికి, లోకంలో పాతివ్రత్య మహిమను చాటడానికి రామాయణం చదవాలి. పాతివ్రత్య మహిమ కష్టాలలో ఉన్న స్త్రీని కాపాడుతుందనే విషయము మీద ఆంగ్ల మహాకవి జాన్ మిల్టన్ "కోమస్" అనే పదకొండు వందల పంక్తుల పద్యాన్ని వ్రాశాడు.

జనక మహారాజు అయోనిజ పుత్రికయైన సీత రామాయణంలో ఒక ప్రముఖ పాత్ర. సీత పాత్ర సృష్టి జరగకపోతే రామాయణం అసంపూర్ణముగా ఉండి, కథ ముందుకు నడిచేది కాదు, రక్తి కట్టేది కాదు. రామాయణ కథ రక్తికి, భక్తి భావానికి, ముక్తికి, పాతివ్రత్యానికి ఆధారభూతమైన పాత్ర సీత పాత్ర. సీత పాత్ర సృష్టి జరగకపోతే రావణ సంహారానికి అవకాశమే లేదు. రాముని పరాక్రమ ప్రదర్శనకు, ధర్మపరిరక్షణకు ఏ మాత్రము అవకాశము లేదనుటలో సంశయము లేదు. కనుకనే సుందరకాండలో హనుమంతుడు సీత పాత్రను శ్లాఘిస్తాడు.

**సీత జననము :**

ఈమె పూర్వజన్మలో వేదవతిగ, రావణ సంహారము కొరకై భూమి మీద జనక మహారాజు ఇంట నాగటిచాలులో జన్మించి దశరథ మహారాజు జ్యేష్ఠ పుత్రుడైన రాముని వివాహమాడి రావణ సంహారము చేస్తానన్నదని "ఉత్తరకాండము" 17వ సర్గములో ఉన్నది.

ఆవిధంగానే గతజన్మలో వేదవతిగా జన్మించిన ఈమె తరువాత జన్మలో జనక మహారాజు ఇంట సీతగా జన్మించింది. జనక మహారాజు యజ్ఞము చేయుటకు భూమిని దున్నుచుండగా భూమి బ్రద్దలు కొట్టుకొని నాగటిచాలునుండి బయటకు రాగా జనకుడు సంతోషించి ఆమెను ఎత్తుకొని ఈమె నా బిడ్డ అన్నాడు. జనకుని ఇంట పెరిగి పెద్దదై శివధనుర్భంగం కావించిన రాముణ్ణి దశరథ మహారాజు

అంగీకారముతో వివాహమాడింది.

అరణ్యకాండము 34వ సర్గములో సీతను తన భార్యగా చేసుకోమని రావణుని సోదరియైన శూర్పణఖ రావణుని ప్రోత్సహించి సీత బాహ్య సౌందర్యాన్ని ఈ విధంగా వర్ణించింది. "రాముని భార్య విశాలమైన నేత్రములు, పూర్ణచంద్రుని వంటి ముఖబింబముగలది. అందమైన జుట్టు, ముక్కు, తొడలు గల సౌందర్యవతి, కీర్తిమంతురాలు, లక్ష్మీదేవివలె ప్రకాశించుచున్నది. ఆమె శరీరకాంతి పరిశుద్ధమైన బంగారము వంటిది. ఆమె గోళ్ళు ఎఱ్ఱగాను, ఎత్తుగాను ఉండును. నడుము సన్నగా ఉండును. ఇట్టి సౌందర్యముగల దేవతా స్త్రీనిగాని, గంధర్వ స్త్రీనిగాని, యక్ష స్త్రీనిగాని, కిన్నర స్త్రీనిగాని, భూలోకంలో ఉండే స్త్రీని గాని తానెన్నడూ చూడలేదన్నది".

ఆమె కళ్ళు లేడికళ్ళువలె, జుట్టు తుమ్మెదల రెక్కలవలె నల్లగా ఉంటుందని రామాయణం వేరే కాండంలో వర్ణించబడ్డాయి.

పైన వర్ణించిన బాహ్యసౌందర్యాన్ని బట్టి సీత ఎంత అందమైనదో చదువరులు గ్రహించగలరు. సీత గుణగణాలు రామాయణం అన్ని కాండాలలో (ఏడు కాండాలలో) వర్ణించబడ్డాయి.

వాల్మీకి సీత అవయవ వర్ణన "సుందరకాండము" 15వ సర్గములో చేశాడు. నల్లని కేశములు, దొండపండువంటి పెదవులు, అందమైన నడుము, పద్మముల వంటి నేత్రములు గల సీత మన్మథుని భార్యయైన "రతీదేవి"వలె ఉన్నదన్నాడు. ఆమె పాతివ్రత్యమునందు స్థిరముగా నిలబడి ఉన్నదన్నాడు.

సీతకు 12 సంవత్సరాల వయస్సులో వివాహమైనది. రాముని వివాహమాడి దశరథ మహారాజు పెద్ద కోడలయింది. సీత కష్టాలు అనుభవించటానికే భూమి మీద పుట్టిన వ్యక్తిగా రామాయణంలో మనకు కనబడుతుంది. వివాహమైన కొద్దికాలానికే భర్తననుసరించి అరణ్యవాసానికి వెళ్ళింది. రాజమందిరములో ఉండవలసిన ఆమె చిన్న వయస్సులో సంసార సుఖానికి, బంధుజనానికి దూరమై నారచీరలు, జటలు ధరించి మునులు, ఋషులు తపస్సు చేసుకునే అరణ్యములో గడుపవలసి వచ్చింది. అంతేకాదు అరణ్యవాసములో ఉండగా రావణుడు అనే

రాక్షసరాజు అపహరణకు గురై లంకానగరములో భయంకరమైన, దుర్భరమైన జీవితాన్ని అనుభవించింది. రావణ సంహారము తరువాత కూడా సీతకు కష్టాలు తప్పకపోగా కొత్తకష్టాలు ప్రారంభమయ్యాయి. మరలా అరణ్యావాసము, అగ్నిప్రవేశము చేయవలసి వచ్చింది. ఇన్ని కష్టాలు అనుభవించిన వ్యక్తి ఈ భూమి మీద ఆనాటినుండి నేటి వరకు బహుశ ఎవ్వరూ లేరేమో!

ఒక కావ్యములో ఒక పాత్ర చిత్రణను పరిశీలించేటపుడు రెండు విషయాలను గమనంలో పెట్టుకోవాలి. ఆ పాత్ర బాహ్య రూపము, అంతర్గత సౌందర్యము ఆ కావ్యములో ఆ పాత్ర పోషించినతీరు. సీత బాహ్యారూపము చూశాము. ఆమె అంతర్గత సౌందర్యాన్ని పరిశీలిద్దాము. ఒక పాత్ర యొక్క గుణగణాల ద్వారా ఆ పాత్ర యొక్క అంతర్గత సౌందర్యాన్ని పరిశీలన చేయాలి. సీత బాహ్య సౌందర్యవతియే కాదు అంతర్గత సౌందర్యవతి కూడా. ఆమె గుణగణాలను పరిశీలించేటప్పుడు వివిధ కాండాలలో ఆమె అంతర్గత సౌందర్యము వ్యక్తమవుతుంది. "సుందరకాండము"లోని కొన్ని సంఘటనలను పరిశీలిస్తే ఆమె అంతర్గత సౌందర్యానికి ఎవ్వరయినా ముగ్ధులుగాక తప్పదు.

## సీత పాతివ్రత్యాన్ని పరిశీలిద్దాము :

సీత రామునియందు స్థిరమైన చిత్తము గలది. లంకానగరములోని అశోకవనములో ఉన్నప్పటికీ ఆమె మనస్సు రామునియందే స్థిరముగా ఉన్నది. (సుందరకాండము 16వ సర్గము). అందుకనే హనుమంతుడు సీతను గూర్చి ఈ విధంగా అన్నాడు. "రాముడు సీతకోసమై సముద్రము వరకు వ్యాపించిన భూమియే కాదు జగత్తునంతనూ తల్లక్రిందులుగా చేసినా యుక్తమేనని నా అభిప్రాయము. మూడు లోకములపై అధికారము గొప్పదా జనకుని కూతురైన సీత గొప్పదా అని చూచినచో, మూడు లోకములపై రాజ్యాధికారము సీతలో పదహారవ పాలుకు కూడా సరికాదు". (సుందర కాండము 16వ సర్గము)

రావణుడు సీతతో తనకు ఎంత ఐశ్వర్యము, కీర్తి ఉన్నదో చూడమన్నాడు. నారబట్టలు కట్టుకునే రామునితో ఏమి చేసెదవన్నాడు? విజయము లేక ఐశ్వర్యమును

కోల్పోయి, వనములో నివసించుచు, ముని వ్రతము అవలంబించి నేలపై నిద్రించే రాముడు జీవించి ఉన్నాడా లేదా అనునది కూడా సందిగ్ధమే! అన్నాడు. ఈ విధముగా సీతను నిరాశపరచి లొంగ తీసుకోవటానికి నానా విధాలుగా ప్రయత్నించినా సీత స్థిర చిత్తము గలదై, మానసిక బలవంతురాలై రావణునికి నీతి బోధ చేసింది. చపల స్వభావుడై, తన భార్యలతో సంతృప్తి చెందక, ఇంద్రియ నిగ్రహము లేకుండా ఉన్న నీచబుద్ధి కల రావణుని, పర భార్యలు పరాభవము పొందిస్తారన్నది. దీర్ఘదృష్టి లేని పాపాత్ముడు, తాను చేసిన పనులే తనను దెబ్బతీయగా నశించిపోతాడన్నది. తాను సమస్త భూమికి ప్రభువైన ఆ రామునకు మాత్రమే భార్యనగుటకు తగినదాననన్నది. పెద్దపులుల గంధమును వాసన చూచిన కుక్క వాటి ఎదురు ఎట్లు నిలువజాలదో, అట్లే రామలక్ష్మణుల గంధము వాసన చూచిన పిమ్మట రావణుడు వారి ఎదుట నిలవజాలడన్నది. సీత మాటలు ఆమె ధైర్యాన్ని, రామలక్ష్మణులు లంకకు చేరి తనను తీసుకుపోగలరనే నమ్మకాన్ని, రావణసంహారాన్ని సూచిస్తున్నాయి. (సుందరకాండము)

రావణుడు సీతకు రెండు మాసములు గడువు ఇచ్చి తాను రావణుని భార్యగా ఉండుటకు అంగీకరించునో లేదో తేల్చుకోమన్నాడు. అంగీకరించనిచో చంపివేస్తానని బెదిరించాడు. కొందరు ఆడరాక్షసులను అశోకవనములో సీతకు కాపలా ఉంచాడు. వారు రావణుని కోరికను మన్నించమని సీతను ఒత్తిడి చేసి భయపెట్టి చంపుతామన్నారు. ఉన్నపళంగా ఆమెను తింటామన్నారు. అంతటి భయానక వాతావరణములో, మానసిక ఒత్తిడి, ఆందోళనలో సీత ఉన్నది. దిక్కుతోచని స్థితిలో ఉన్నప్పటికీ ఆమె అధైర్యపడలేదు. సీత స్థితిలో ఒక సామాన్య స్త్రీ ఉండినట్లయితే రావణునికి లొంగిపోయి ఉండెడిది. సీత ఆత్మస్థైర్యము కలది గనుకనే రాక్షసుల, రాక్షసరాజ బెదిరింపులకు లొంగలేదు! (యుద్ధకాండము)

## సీత ధర్మాన్ని పాటించిన వ్యక్తి :

సీత ధర్మాన్ని అనుసరించిన వ్యక్తి కనుకనే ధర్మము ఆమెను కష్టకాలములో కాపాడినది. అత్రి ముని భార్య అనసూయ సీతను సత్కరించినది. సీతను గురించి అనసూయ అన్న మాటలను పరిశీలిద్దాము. "భాగ్యము చేత నీవు ధర్మమును

పాటించుచున్నావు. ఓ సీతా! నీవు మంచి భాగ్యవంతురాలవు. బంధుజనమును, అహంకారమును, ఐశ్వర్యమును విడచి నీవు అడవికి వెళ్ళుచున్న రాముని వెంబడించి వచ్చుచున్నావు. ఏ స్త్రీలు తమ భర్త వనములో ఉన్నా, నగరములో ఉన్నా, పాపాత్ముడైనా, పుణ్యాత్ముడైనా, అతనిని అనుసరించి ఉండెదరో వారికి ఉత్తమ లోకములు కలుగును. ఉత్తమ స్వభావమువలన స్త్రీలకు భర్త - దుశ్శీలుడైనా, స్వేచ్ఛాచారియైనా, దరిద్రుడైనా అతడే ఉత్తమ దైవము!!".

ఇది ప్రాచీన భారతీయ స్త్రీ ధర్మం. సీత పాత్రను ప్రాచీన స్త్రీ ధర్మాన్ని అనుసరించిన ఉత్తమురాలిగా వాల్మీకి సృష్టించాడు. ఇది నారీలోకానికంతటికీ ఆదర్శమైన భారత ధర్మంగా చెబుతారు. అదే భారత నారీ ప్రత్యేకత.

లక్ష్మణుడు సీతకు ముందుగా అనగా రథము ఎక్కినప్పుడు ఆమె పరిత్యాగాన్ని గురించి చెప్పలేదు. అరణ్యములో రథము దిగిన తరువాత చెప్పాడు. లక్ష్మణుడు సీతా పరిత్యాగాన్ని గురించి ఈ విధంగా చెప్పాడు. "మా అన్నగారు నిన్ను ఈ విషయంలో లోకాల నిందకు పాలయేటట్లు చేశాడు. ఇది నా హృదయములో గొప్ప శల్యముగా ఏర్పడి"నదన్నాడు. అందుకు సీత "ప్రభూ! లక్ష్మణా! నేను ఏమి తప్పు చేశానని మునులకు చెప్పుదును? మహాత్ముడైన రాముడు ఏ కారణము చేత విడచినాడని చెప్పుదును?" అని సీత తన మనసులో బాధను వ్యక్తం చేసింది కాని రాముని మాత్రము నిందించలేదు. రామునితో ఇట్లు చెప్పమని లక్ష్మణుని కోరింది. "రామా! సీత పరిశుద్ధురాలు; గొప్ప భక్తి కలది; నిత్యము నీ హితము కోరునది అను విషయము నీకు తెలియును. వీరుడా! ప్రజలలో వచ్చిన అపకీర్తికి భయపడి నీవు నన్ను త్యజించినావు. లోకోపవాదము వలన నీకు కలిగిన ఈ నిందను తొలగించవలెను. నీవే నా ఉత్తమ గతి కదా!".

సీత మాటలను (సందేశాన్ని) పరిశీలించినచో భర్త పరువు ప్రతిష్ఠలు కాపాడటమే ఆమె లక్ష్యంగా ఉన్నది. అందుకు కష్టాలు భరించుటకు అనగా అరణ్యవాసము అంగీకరించుటకు (పరిత్యాగానికి) సిద్ధముగా ఉన్నదనే విషయము విదితమగుచున్నది. ఇది భారతీయ స్త్రీ ధర్మము.

సీత ఇంకా ఈ విధంగా అన్నది - "నరశ్రేష్ఠుడవైన రామా! నేను నా శరీరమును గూర్చి విచారించుట లేదు. పౌరుల అపవాదము ఎట్లున్నదో దానిని బట్టియే ప్రవర్తించెదను. స్త్రీకి భర్తయే దైవము; భర్తయే బంధువు, భర్తయే గురువు". (ఉత్తర కాండము)

ప్రాచీన భారతీయ భార్యాభర్తల బంధాన్ని భారత స్త్రీ ధర్మాన్ని పాటించుటకు సీత సిద్ధంగా ఉన్నది. ఇది రామాయణ సంస్కారము. దీనిని భారతావని అంతా మనము చూడగలము. భారతీయ వివాహ వ్యవస్థను ప్రపంచ దేశాలు కొనియాడినవి. ప్రపంచ దేశాలలో భారతీయ వివాహ వ్యవస్థకు ఒక ప్రత్యేకత ఉంది. అదే భార్యాభర్తల బంధము. భారతీయ స్త్రీ ధర్మము. ఇదే వివాహ వ్యవస్థకు మూలము. ఒక స్త్రీ ఒకే భర్తతో జీవితాంతము ఉండటము. ప్రస్తుత ఆధునిక భారతావనిలో వివాహ వ్యవస్థలో కొన్ని మార్పులు చోటు చేసుకొని విడాకుల సంఖ్య వృద్ధి పొందుతుంది. విడాకుల సంఖ్య వృద్ధి పొందడమంటే భారతీయ స్త్రీ ధర్మము బలహీనపడటమే!

**యుద్ధకాండము :**

సీత అనుభవించిన ఎక్కువ కష్టాలు వర్ణించబడ్డది యుద్ధకాండములోనే. రావణుడు రామలక్ష్మణుల మాయా శిరస్సులను ఖండించి తీసుకుని వచ్చి సీతకు చూపించి ఆమె దుఃఖానికి కారకుడయ్యాడు. రాముని శిరస్సును చూచిన సీత రాముడు నిజంగా మరణించాడని ఆవేదన, కలత చెందింది. పూర్వము పండితులు తనకు వైధవ్యము లేదన్నారు. పండితుల మాట అబద్ధమైపోయిందని వాపోయింది. రామునితో కలసి ధర్మాచరణము చేస్తానన్నది. తరువాత సీతకు ఇది రావణుని మాయ అని "సరమ" తెలియజేసింది. దుష్టుడైన రావణుని ఆలోచనలు, నిర్ణయము, ఏమిటో తెలుసుకొని రమ్మని "సరమ"ను గూఢచారిగా పంపింది సీత.

పై విషయాలను పరిశీలిస్తే రావణుని దుష్టప్రణాళిక, సీతకు రామునిపై గల స్థిరమైన ప్రేమ మనకు అర్థమవుతుంది.

సీత గుణగణాలను పరిశీలించినచో ఆమెకు దేవతా గుణములున్నవి. అపకార-ఉపకారాలను గురించి మాట్లాడుతూ అపకారము చేసినవారికి కూడా

ప్రత్యపకారము చేయకూడదన్నది. ఉపకారము చేయుటయే ధర్మమన్నది.

## సీతకు క్షమాగుణమున్నది :

మానవ గుణాలలో గొప్పగుణము క్షమాగుణము. రావణుడు సీతకు రెండు మాసములు గడువు ఇచ్చి, ఈ రెండు మాసములలోపు తన భార్యగా అంగీకరిస్తుందో లేదో తెలియజేయమన్నాడు. ఆమెకు కాపలాగా అశోకవనములో కొంతమంది ఆడ రాక్షసులను నియమించాడు. వారు సీతను నానా విధాలుగా హింసించి, రావణుని భార్యగా అంగీకరించమని ఒత్తిడి చేశారు. కానీ సీత అందుకు అంగీకరించలేదు. చివరకు ఆడ రాక్షసులు చంపుతామని బెదిరించారు. ఉన్నపళంగా సీతను తింటామన్నారు. సీత క్షోభ చెందినప్పటికీ ఆత్మస్థైర్యాన్ని వీడలేదు. రాముడు వచ్చి రావణ సంహారము చేసి తనను లంకనుండి తీసుకుపోతాడనే నమ్మకంతో ఉన్నది. హనుమంతుడు సీతను రాక్షసులు పెట్టే బాధలను స్వయంగా చూశాడు. దైవవశాత్తు రావణ సంహారము జరిగింది. ఆ విషయాన్ని సీతకు తెలియజేయమని రాముడు హనుమంతుని సీత వద్దకు పంపాడు. సీతకు రావణ సంహారవార్తను తెలిపిన తరువాత ఆ ఆడరాక్షసులను తాను చంపుతానని అందుకు సీత అంగీకారాన్ని హనుమంతుడు కోరగా ఆమె అందుకు అంగీకరించలేదు. అంతేకాకుండ ఆ ఆడరాక్షసులందరిని క్షమించానన్నది. ఈ క్షమాగుణం సీత గొప్పతననాకి నిదర్శనము!

కలియుగములో ఏసుక్రీస్తు, మహాత్మాగాంధి ఈ క్షమాగుణాన్ని కలిగినవారే! ఏసుక్రీస్తు తనను శిలువ వేసేవారిని (చంపేవారిని) గురించి తన తండ్రియైన యెహోవా దేవునికి వారిని క్షమించమని ప్రార్థించాడు. "తండ్రీ! వీరేమి చేయుచున్నారో వీరికి తెలియదు. వీరిని క్షమించమన్నాడు". ఇది ఎంత గొప్ప వాక్యము! ఎంత గొప్ప గుణము! సాధారణంగా మనలను ఎవరైనా ఒక దెబ్బకొడితే వారిని తిరిగి కొట్టడానికి శతవిధాల ప్రయత్నిస్తాము. ఇది లోకము తీరు.

అదే విధంగా మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధిగారిని "మహాత్ముని" చేసిన గుణగణాలలో క్షమాగుణమొకటి. ఎవరైనా మనలను ఒక చెంప మీద కొడితే రెండవ చెంపకూడా ఇవ్వమన్నాడు. ఎంత సహనం! ఎంత గొప్పమాట! ఇది క్షమాగుణము

యొక్క విలువ, గొప్పతనము.

రావణ సంహారము తరువాత సీతారాములు ఒక్కటి కావలసిన తరుణంలో రాముడు సీత మీద తనకు ఆసక్తి లేదని, ఆమె ఎక్కడికైనా వెళ్ళవచ్చునన్నాడు. తాను దగ్గర లేని సమయమున చపలచిత్తుడైన రావణుడు వచ్చి సీతను అపహరించాడని దైవకృతమైన దోషమును మానవుడైన తాను మానవ యత్నముచే సరిచేశానన్నాడు. గౌరవమును కోరి తాను మానవుడు ఏమి చేయునో అది చేసితినన్నాడు. యుద్ధ పరిశ్రమ తాను సీత కోసము చేయలేదని తన చరితను రక్షించుకొనుటకై చేశానన్నాడు. లోకాపవాదము రాకుండ చేసికొనుటకు, ప్రసిద్ధమైన తన వంశ కళంకము తుడిచి వేయుటకు తాను యుద్ధ పరిశ్రమ చేశానన్నాడు. సీతను పది దిక్కులలో తనకిష్టమొచ్చిన దిక్కునకు వెళ్ళవచ్చునన్నాడు. రాముని మాటలు విని సీత ఏడ్చి అగ్నిప్రవేశము చేయుటకు నిశ్చయించుకున్నది.

సీత అగ్నిప్రవేశము చేయుచుండగా బ్రహ్మాది దేవతలు, అగ్ని, రాముడు ఎందుకు సీతను నివారించలేదని ప్రశ్నింపగా దుఃఖించుచూ చూచుచున్న రాముడు సీత దోష రహితురాలని తనకు తెలుసునన్నాడు. లోకాపవాదము పోగొట్టుకొనుటకు ఆ విధంగా చేశానన్నాడు. అప్పుడు "అగ్ని" సీత దోషము లేనిదని రామునికి చెప్పగా రాముడు సీతను తీసుకొని పుష్పకవిమానము నెక్కి అయోధ్యకు బయలుదేరారు.

పై సంఘటనలు సీత పడ్డ ఆవేదన, కష్టాలు, ఆమె పాతివ్రత్య మహిమను తెలియజేస్తున్నాయి. ఆ సందర్భంగా రాముడు సీతను గురించి "సీత తనను విడిచి మరెవ్వరి సంబంధమును పొందదన్నాడు. జనకుని పుత్రియైన సీతతో సమానమైన పవిత్రురాలు ఈ మూడు లోకములలో లేదన్నాడు".

రాముని మాటలు సీత పాతివ్రత్యాన్ని విశదపరచటమే గాక, సీతకు తనయందు స్థిరమైన అభిప్రాయమున్నదని వెల్లడించుచున్నవి.

సీత గుణగణాలు రామాయణంలో ఏ ఒక్క కాండములోను లేవనే విషయమును నేను లోగడ స్పష్టం చేశాను. దాదాపు ఏడు కాండములలో ఉన్నవి. చివరగా ఉత్తర కాండములో సీత అనుభవించిన కష్టాలు, ఆమె పాతివ్రత్య మహిమను,

ఆమె దేవతా స్త్రీ అను విషయమును బ్రహ్మాది దేవతలు, వాల్మీకి మహర్షి చెప్పటాన్ని పరిశీలిద్దాము.

ఉత్తరకాండము 45వ సర్గములో రావణ సంహారము జరిగి అయోధ్యకు సీతారాములు తిరిగివచ్చిన పిమ్మట రాముడు ప్రజాభిప్రాయ సేకరణ మీదట లోకాపవాదమును గూర్చి సోదరులకు తెలిపి సీతను అరణ్యములో విడచి రమ్మని తమ్ముడైన లక్ష్మణుని ఆదేశించాడు.

ఆ సందర్భమున రాముడు లక్ష్మణునితో ఈ విధంగా అన్నాడు. "కీర్తిమంతురాలైన సీత పరిశుద్ధురాలని నా అంతరాత్మకు కూడా తెలియును. అందువల్ల సీతను తీసికొని అయోధ్యకు వచ్చినాను. నా హృదయంలో గొప్ప అధర్మచింత, శోకము కూడా ఉన్నవి. చాలా గొప్ప దైవ పౌరుల అపవాదము, గ్రామ ప్రజల అపవాదము వచ్చినది. అపకీర్తిని దేవతలు నిందింతురు. కీర్తిని లోకంలో అందరూ పూజింతురు'' అని రేపు సాయంకాలము సీతను గంగానది ఒడ్డున ఉన్న వాల్మీకి ఆశ్రమంలో వదలిపెట్టి రమ్మన్నాడు. రాముని నిర్ణయానికి సంతోషించిన సీత తన ఆభరణములను, చాలా విలువైన వస్త్రములను ముని భార్యలను ఇచ్చుటకు సర్దుకున్నది.

ఇక్కడ ఒక విషయాన్ని ప్రస్తావించాలి. తన పరిత్యాగాన్ని గురించి సీతకు తెలియదు. గంగా తీరాన ఉన్న ఆశ్రమాలకు వెళ్ళుచున్నానని సంతోషించింది.

గంగానది దాటిన పిమ్మట లక్ష్మణుడు సీతను రథమునుండి దింపి ఆమెకు అంజలి ఘటించి (ఆమెకు నమస్కరించి) భూమి మీద పడగా సీతకు ఏమీ అర్థము కాలేదు. అప్పుడు లక్ష్మణుడు వాల్మీకి ఆశ్రమమున మిమ్ములను వదలి రమ్మని రాముడు ఆజ్ఞాపించాడని తెలియజేయగా సీత విలపిస్తూ "లక్ష్మణా! బ్రహ్మ దేవుడు నిజముగా నా దేహమును దుఃఖమును అనుభవించుటకై సృష్టించినాడు. అందుచేతనే నేనిప్పుడు మూర్తీభవించిన దుఃఖమును అనుభవించుచున్నాను. పరిశుద్ధమైన నడవడికగల పతివ్రతనైన నన్ను రాజు విడచివేయుచున్నాడు. పూర్వము ఏమి పాపము చేసినానో'' అని నేను ఏమి తప్పు చేశానని మునులకు చెప్పాలి? నన్ను మహాత్ముడైన

రాముడు ఏ కారణము చేత విడచినాడని చెప్పాలి? అని ప్రశ్నించి రాజైన రామునికి తన సందేశాన్ని ఈ విధంగా పంపింది. "రామా! సీత పరిశుద్ధురాలు; గొప్ప భక్తి కలది; నిత్యము నీ హితము కోరునది అను విషయము నీకు తెలియును. వీరుడా! ప్రజలలో వచ్చిన అపకీర్తికి భయపడి నీవు నన్ను త్యజించినావు. లోకాపవాదము వలన నీకు కలిగిన ఈ నిందను తొలగించవలెను. నీవే నా ఉత్తమగతి కదా! అని ; పౌరుల అపవాదము ఎట్లున్నదో దానిని పట్టియే నేను ప్రవర్తించెదను. నీకు దూరముగా ఉండుటకు సిద్ధముగా ఉన్నాను''. స్త్రీకి భర్తయే దేవుడు, భర్తయే బంధువు, భర్తయే గురువు'' అన్నది.

సీత పలికిన మాటలు పరిశీలించినచో ఆమెకు పరిత్యాగము వలన కలిగిన బాధ మనసులో ఉన్నప్పటికీ రామునికి వచ్చిన అపవాదమును పోగొట్టుకొనుటకే నిశ్చయించుకొని ధైర్యంగా పరిత్యాగాన్ని భరించటానికి సిద్ధంగా ఉన్నది. ఇది సీత మానసిక స్థైర్యము, ధైర్యము. భారతీయ స్త్రీ ధర్మాన్ని పాటించి భర్తయే స్త్రీకి సర్వస్వమని భర్తను గౌరవించింది.

వాల్మీకి వచ్చి గంగానది ఒడ్డున ఉన్న సీతను తీసుకొని తన ఆశ్రమానికి వెళ్ళి అక్కడ ఉన్న ముని భార్యలతో సీతకు అవసరమైన సపర్యలు చేయమన్నాడు. **(ఉత్తరకాండము 43 నుండి 49 సర్గములు)**

ఉత్తరకాండము **95**వ సర్గములో సీత తన పరిశుద్ధత్వ విషయమున శపథము చేయవలెనని రాముడు అనగా రాముడు చేయుచున్న అశ్వమేథయాగానికి హాజరైన వాల్మీకి సీత పరిశుద్ధురాలని ఘోషించాడు. ఆ తరువాత సీత రాముడు కోరిన విధంగా రసాతలములో ప్రవేశించింది. అప్పుడు రాముడు వాల్మీకిని క్షమించమని కోరి ఈ విధంగా అన్నాడు. "మహామునీ! లోకాపవాదము బలవత్తరముగా ఉండుటచేతనే నేను సీతను విడిచితిని. ఆమెలో ఏ పాపము లేదని తెలిసి కూడా నేను లోక భయముచే త్యజించితిని. అందుకు నన్ను క్షమించుము''.

కాషాయ వస్త్రములు ధరించి అక్కడకు వచ్చిన సీత అందరినీ చూచి "నేను రాముణ్ణి తప్ప మరెవనైనా మనసులో స్మరించినచో భూదేవి నాకు వివరమునిచ్చు

గాక'' అని అన్నది. సీత ఆ విధముగా శపథము చేయుచుండగా అత్యుత్తమము, అత్యద్భుతము అయిన దివ్యమైన సింహాసనము భూతలమునుండి పైకి లేచి ఆ సమయమునందున్న భూదేవి సీతను బాహువులతో పట్టుకొని "వత్సా! రమ్మ!" స్వాగతముతో సింహాసనము మీద కూర్చుండబెట్టుకొనెను. అపుడు దివ్యమైన పుష్ప వృష్టి అవిచ్ఛిన్నముగా కురిసినది.

అపుడు బ్రహ్మదేవుడు సీత శోకమును ఓదార్చగా రాముడు సీతను తనకివ్వమని కోరగా బ్రహ్మదేవుడు పతివ్రతయైన సీత నీ పూర్వరూపమును (విష్ణు రూపమును) కోరుచూ నాగలోకమునకు వెళ్ళినదన్నాడు. నీకు మరలా ఆమె సంగమము స్వర్గములో కలుగుతుందన్నాడు. మహా విష్ణువు దేహమునందు ఈమెయే లక్ష్మిగా ప్రతిష్ఠత అయి ఉన్నది. సీతను చూడవలెనన్న ప్రయత్నమును విరమించుకొనుమన్నాడు. సీతను చూడవలెనని ఉన్నచో పుత్రులైన కుశీలవులను చూచుకొనుమని పలికాడు.

పై విషయములను పరిశీలిస్తే సీత పతివ్రత అని, దేవతా స్త్రీయని స్వయంగా భూదేవి, బ్రహ్మదేవుడు, వాల్మీకి మహర్షి చెప్పటము గమనార్హం. ఇది సీత పాతివ్రత్య మహాత్మ్యము. దీనిని భారతీయులందరూ ఆచరించాలని రామాయణం ద్వారా వాల్మీకి కోరుతున్నాడు. (ఉత్తరకాండం - 97వ సర్గము)

సీత పాత్ర రామాయణంలో వాల్మీకి అద్భుత సృష్టి. ధర్మబద్ధమైన పుత్రికగా, భార్యగా, మహిళా లోకానికి ఆదర్శవంతమైన గృహిణిగా, భర్తయందు భక్తి, అనురక్తి కలిగిన వ్యక్తిగా అన్నిటికంటె మించి పరాయివాని ఇంట బందీగా ఉన్నప్పటికీ సత్యధర్మాలను పాటించిన వ్యక్తిగా పాతివ్రత్యాన్ని ఆచరించి బ్రహ్మాది దేవతలు, భూమాత, అగ్నిచేత ప్రశంసలు అందుకున్న ఆదర్శనారీరత్నముగ భారతీయులందరికి ఆదర్శవంతురాలుగా, ఆరాధ్యనీయురాలుగా వాల్మీకి చిత్రించాడు.

రామాయణాన్ని త్రేతాయుగంలో వాల్మీకి మహర్షి, భారతాన్ని ద్వాపరయుగంలో వ్యాస భగవానుడు రచించారు. రామాయణంలో సీత నాయిక అయితే మహాభారతంలో ద్రౌపది నాయిక పాత్రను పోషించింది. వీరిద్దరిని పోల్చి

చూస్తే సీత పాత్ర భారతీయులందరికీ ఆరాధ్యురాలు. ద్రౌపది పాత్ర అంతగా ఆరాధ్యనీయము కాదు. కారణము సీత రాముని ఏకైక ధర్మపత్ని. ద్రౌపది ఐదుగురు అన్నదమ్ముల ఉమ్మడి భార్య. అందుకే ఈమె సీత అంత ఆరాధ్యురాలు కాలేకపోయిందని నా భావన. అంతేకాకుండా పాండవులు మహాప్రస్థాన పర్వములో మహాప్రస్థానమునకేగు సందర్భమున అరణ్యమును దాటుచుండగా ఒక్కరొక్కరుగా భూమి మీద పడి మరణించారు. ద్రౌపది యోగభ్రంశముచే నేలపైబడగా (మరణించగా) భీముడామె పడుట చూచి విషణ్ణవదనుడై ధర్మరాజుతో "ఈమెయందు ఎన్నడునూ ధర్మహాని కనిపించదు, ఇట్లు జరుగుటకు కారణమేమ"ని యడుగగా ధర్మరాజు "ఈమె అర్జునునియందు పక్షపాతము కలదగుట వలన సుకృతములు ఫలింపక ఇట్టి దురవస్థ ఆమెకు వాటిల్లినదని" చెప్పాడు.

దశరథునికి నలుగురు కుమారులున్నారు. నలుగురున్నప్పటికీ రాముడు తప్ప మిగిలినవారెవర్వరునూ సీత ముఖము కూడా ఎన్నడూ చూడలేదని రామాయణం చెబుతుంది. లక్ష్మణుడు సీతను వాల్మీకి ఆశ్రమంలో వదలిపెట్టి ఆమె పరిత్యాగాన్ని గురించి చెప్పేటప్పుడు కూడా ఆమె ముఖము చూచి ఆ విషయము చెప్పలేదు. ఇది ఈ రెండు పాత్రలకున్న భేదము. అగ్నిప్రవేశము చేసిన సీతను స్వయముగా భూదేవి, బ్రహ్మాది దేవతలు వచ్చి ఈమె పవిత్రురాలని ఉద్ఘాటించారు. కాని ద్రౌపది విషయంలో స్వయాన భర్తయైన ధర్మరాజే ఆమె అర్జునునియందు పక్షపాతము కలది అని స్పష్టం చేశాడు.

# అధ్యాయము - 7

## హనుమంతుని పాత్ర

హనుమంతుని జననము, గుణగణాలు, పరాక్రమము, గొప్పతనాన్ని తెలుసుకోవటానికి రామాయణం చదవాలి.

రామాయణ మహాకావ్యంలో హనుమంతుని పాత్ర అతి కీలకమైనది. హనుమంతుని పాత్ర సృష్టి జరుగకపోతే సీత జాడ తెలిసేది కాదు, లంకానగరానికి వానర సైన్యముతో రామలక్ష్మణులు వెళ్ళి ఉండేవారు కాదు, రావణ సంహారము జరిగేది కాదు. లంకపై దండెత్తడానికి వానర సైన్యాన్ని సమకూర్చి సముద్రానికి సేతువును నిర్మించటానికి కారకులు వానరులు. లంకానగరములో రాక్షసులతో యుద్ధము చేయుచున్నపుడు వానరులు నిరుత్సాహపడగా వారిని ఉత్సాహపరచి కార్యోన్ముఖులను గావించిన గొప్ప వీరుడు, నాయకుడు హనుమంతుడు. ఆజన్మ బ్రహ్మచారి. రామాయణం ఏడు కాండములలో కిష్కింధకాండము, సుందరకాండము, యుద్ధకాండము, ఉత్తరకాండములలో హనుమంతుని గురించిన సమాచారము మనకు లభిస్తుంది. ఈ నాలుగు కాండములు చదివినచో హనుమంతుని గురించి పూర్తి అవగాహన చదువరులకు కలుగుతుంది.

భారతదేశములో అనేక కోట్లమంది హనుమంతుని భక్తులున్నారు. దేశవ్యాప్తంగా హనుమంతుని ఆలయాలు, విగ్రహాలు ఉన్నాయి. హనుమంతుని పూజించేవారు, కొలిచేవారు దేశవ్యాప్తంగా ఉన్నారు. అంతటి జగత్ప్రసిద్ధుని జననము, విద్య, పాండిత్యము, శాస్త్రవిజ్ఞానము, తెలివితేటలు, ధైర్యసాహసాలు, సాధించిన ఘనకార్యాలు, విజయాలు, నిస్వార్థము మొదలగువాటిని గురించి పూర్తిగా ఈ అధ్యాయంలో తెలుసుకుందాము.

## హనుమంతుని జననము :

మేరు పర్వతము దగ్గర సూర్యుడిచ్చిన వరము చేత "కేసరి" అను రాజు రాజ్యాన్ని పాలిస్తున్నాడు. అతని భార్య "అంజన". ఈమె ప్రసిద్ధమైన అప్సర స్త్రీ. ఈమె ఇతర నామము "పుంజకస్థల". వాయుదేవుని వలన ఆమెకు హనుమంతుడు జన్మించాడు. తల్లి ఫలముల కోసము అడవికి వెళ్ళింది. ఆకలితో ఉన్న శిశువైన హనుమంతునికి ఉదయించుచున్న సూర్యుడు కనిపించగా అది ఫలమనుకొని సూర్యుని దగ్గరకు ఎగిరాడు. ఆ సమయములో రాహువు సూర్యుని మ్రింగి బయటకు విడుచుచున్నాడు. రాహువు తనను హనుమంతుడు పట్టుకుంటాడని భావించి ఇంద్రుని వేడుకున్నాడు. ఇంద్రుడు ఆ బాలుణ్ణి తన వజ్రాయుధముతో ఎడమ దవడపై కొట్టగా, అతడు క్రింద పడిపోయి మూతి వంకరపోయింది. అప్పటినుండి ఆ శిశువు హనుమంతునిగా పిలువబడ్డాడు. (ఉత్తరకాండము 35వ సర్గము)

హనుమంతుడు శక్తిమంతుడు, బలవంతుడు, ధైర్యశాలి, యుక్తిపరుడు, శాస్త్రవిద్యలు నేర్చినవాడు, వ్యాకరణములో పండితుడు. తొమ్మిది వ్యాకరణ పుస్తకములు వ్రాశాడు. సామర్థ్యము, బలము, నీతి, ధర్మబుద్ధి, వాక్చాతుర్యము, పరోపకారబుద్ధి, నిస్వార్థము, నమ్మకము - ఇత్యాది గుణములు హనుమంతుని ఆశ్రయించి ఉన్నాయి. అన్నిటికి మించి హనుమంతుడు సమర్థుడైన గూఢచారి. గూఢచర్యము చేయటములో అతనికి అతనే సాటి.

హనుమంతుని పరాక్రమాన్ని (బలాన్ని) గురించి అగస్త్యుడు రామునితో ఈ విధంగా అన్నాడు. "వాలి, రావణుల బలము సాటిలేనిది. కానీ వీరిద్దరి బలము హనుమంతుని బలముతో సమానము కాదని నా అభిప్రాయము". ధైర్యశాలే కాదు మంచి నాయకత్వ లక్షణాలున్న వ్యక్తి హనుమంతుడు. దుముకుట, ఎగురుటలో అగ్రగణ్యుడు. భయము ఎరుగనివాడు.

హనుమంతునికి బ్రహ్మాది దేవతలు ఇచ్చిన వరములను పరిశీలిద్దాము.

**1) ఇంద్రుడిచ్చిన వరము :** "ఇక మీదట ఇతడు (హనుమంతుడు) నా వజ్రము చేత చంపుటకు శక్యము కానివాడుగా అగును". ఇంద్రుని వజ్రాయుధము చేత

మరణము లేకుండ వరాన్ని పొందాడు హనుమంతుడు.

**2)** సూర్యుడు హనుమంతునికి ఇచ్చిన వరము : తన తేజస్సులో నూరవవంతు ఇస్తానని వరము ఇచ్చాడు సూర్యుడు. హనుమంతునికి శాస్త్ర విజ్ఞానము నేర్పుతానన్నాడు. దాని చేత అతడు మాటలలో నేర్పరి కాగలడన్నాడు. శాస్త్ర విజ్ఞానములో అతనిని పోలినవాడు ఉండడని సూర్యుడు హనుమంతునికి వరములనిచ్చాడు.

**3)** వరుణుడు హనుమంతునికి ఇచ్చిన వరము : "పది లక్షల సంవత్సరాలకు కూడా తన పాశము చేతగాని, బలము చేతగాని హనుమంతునికి మృత్యువు కలుగదని" వరుణుడు వరమిచ్చాడు.

**4) యముడు హనుమంతునికి ఇచ్చిన వరము :** యమదండము చేత చావు ఉండదని, రోగములు కలుగవని, యుద్ధములో దిగులు చెందడని వరమిచ్చాడు.

**5) కుబేరుడు హనుమంతునికి ఇచ్చిన వరము :** తన గద యుద్ధములో హనుమంతుని చంపదని వరమిచ్చాడు కుబేరుడు.

**6) శివుడు హనుమంతునికి ఇచ్చిన వరము :** తన ఆయుధము చేతగాని, తన చేతగాని హనుమంతుడు చంపబడడని శివుడు వరమిచ్చాడు.

**7) విశ్వకర్మ హనుమంతునికి ఇచ్చిన వరము :** విశ్వకర్మ తయారు చేసిన అస్త్రముల చేతగాని ఇతరములైన దివ్యాస్త్రముల చేతగాని చంపశక్యము కానివాడై హనుమంతుడు దీర్ఘాయుర్దాయవంతుడుగా యున్నతుండై చిరకాలము జీవించగలడని విశ్వకర్మ వరమిచ్చాడు.

**8) బ్రహ్మదేవుడు హనుమంతునికి ఇచ్చిన వరము :** చివరిగా హనుమంతునికి బ్రహ్మ దేవుడిచ్చిన వరాన్ని పరిశీలిద్దాము. "ఇతడు (హనుమంతుడు) ఏ బ్రహ్మదండముల చేతను చంపబడడు" అని మహాత్ముడైన బ్రహ్మదేవుడు వరమిచ్చాడు.

దేవతలనుండి ఇన్ని వరములు పొందిన వ్యక్తి రామాయణంలో హనుమంతుడు ఒక్కడే అని రామాయణం చెబుతుంది.

## మహాఋషులు హనుమంతునికిచ్చిన శాపాలను పరిశీలిద్దాం :

కేవలము దేవతల వరాలే కాదు మహర్షుల శాపాలు కూడా హనుమంతునికి ఉన్నాయి.

వరదానము వలన కలిగిన బలముల చేతను, తన సహజ బలముతోను కూడిన హనుమంతుడు సముద్రమువలె తనలో ఉన్న వేగముతో అపరాధములు చేయుచుండెను. మహర్షుల ఆశ్రమములో స్రుక్కులను, పాత్రలను, అగ్నిహోత్రమును, నారచీరలను బ్రద్దలు కొట్టి, చీల్చి నశింపచేయుచుండగా వారు హనుమంతునితో తాను ఏ బలము చూచుకొని మహర్షులను బాధించుచున్నాడో ఆ బలము మహర్షుల శాపముచే అతనికి (హనుమంతునికి) తెలియకుండుగాక అని శపించారు. అంతేగాక హనుమంతుని బలము ఎప్పుడు స్మరింపచేయుదురో అప్పుడు అతని బలము వృద్ధి పొందునని శపించారు. ఇది హనుమంతునికున్న శాపము (1. తన బలము తనకు తెలియకుండుట, 2. స్మరింప చేసిన తరువాతే బలము వృద్ధి పొందుట)

రామాయణంలో హనుమంతుడు నిర్వహించిన పాత్రను పరిశీలిద్దాము.

వాలి చేత రాజ్య బహిష్కరణ కావింపబడిన అతని తమ్ముడు సుగ్రీవుడు ప్రాణ భయంతో కొంతమంది మిత్రులతో ఋష్యమూక పర్వతానికి చేరి అక్కడ నివసించుచున్నాడు. సీతను వెదకుచున్న రామలక్ష్మణులు ధనుర్ధరులై ఋష్యమూక పర్వతానికి వచ్చినారని విని హనుమంతుని వారి వ్యవహారాలను తెలుసుకొని రమ్మని గూఢచారిగా పంపాడు సుగ్రీవుడు. హనుమంతుడు రామలక్ష్మణులను కలసి వారెవరని ప్రశ్నించి వారి రాకకు కారణంబడిగి తన వృత్తాంతాన్ని, సుగ్రీవుని వృత్తాంతాన్ని రామునికి తన వాక్చాతుర్యము ద్వారా వినిపించాడు. రాముడు లక్ష్మణునికి హనుమంతుని వాక్చాతుర్యాన్ని గురించి చెప్పాడు. వారిని వెంటబెట్టుకొని సుగ్రీవుని వద్దకు వెళ్ళాడు హనుమంతుడు. సుగ్రీవుడు రామలక్ష్మణులకు నమస్కరించాడు. లక్ష్మణుడు సీతాన్వేషణ విషయమున సుగ్రీవుని సహాయాన్ని కోరగా అందుకు సుగ్రీవుడు అంగీకరించాడు. వారిని తన గుహవద్దకు తీసుకెళ్ళి సీత వస్త్రాన్ని, ఆభరణాలని చూపించాడు. వారు అవి సీతవే అని నిర్ధారించారు. సీతను తీసుకొని

రావణుడు దక్షిణదిక్కు వైపు వెళ్ళుచుండగా ఆమె "హా రామా! హా లక్ష్మణా!" అని అరచిందని, అరచుచూ తన వస్త్రమును, ఆభరణాలను పచ్చికబయళ్ళ మీద జారవిడువగా తాను చూచి తన గుహలో భద్రపరచానన్నాడు. ముల్లోకాల్లో ఎక్కడ ఉన్నా సీతను తెచ్చి రామునికిస్తానని సుగ్రీవుడు రామునితో చెప్పాడు. ఆ మాటలు విన్న రాముడు సంతోషించాడు. ఆ విధంగా రామలక్ష్మణసుగ్రీవులకు మైత్రి కుదిరింది. రామలక్ష్మణసుగ్రీవుల మైత్రికి మూలము హనుమంతుని దౌత్యము. ఆ తరువాత రాముడు వాలిని హతమార్చి సుగ్రీవుని కిష్కింధ రాజుగా చేశాడు. వాలి భార్య "తార" విలపించగా హనుమంతుడు ఆమెను ఓదార్చాడు. ఆమె కుమారుడైన అంగదుని యువరాజుగా చేశాడు సుగ్రీవుడు. ఆ తదుపరి సుగ్రీవుడు వానర నాయకులను, వానర సైన్యాన్ని సిద్ధపరచి సీతాన్వేషణ కొరకు సంసిద్ధులయ్యారు.

హనుమంతుడు తన అసాధారణ సామర్ధ్యంతో దక్షిణదిక్కునను‌న్న నూరు యోజనముల పొడవున్న, భయంకరమైన మొసళ్ళతో నిండి ఉన్న సముద్రాన్ని ఆకాశమార్గాన తన దేహాన్ని పెద్దదిగా చేసుకొని లంఘించాడు. సముద్రపు అవతల ఉన్న లంకానగరానికి చేరిన తరువాత తన దేహాన్ని చిన్నదిగా చేసి లంకలో ప్రవేశించాడు. అనంతరము లంకలో ఉన్న వనములు, ఉద్యానవనములు, ఇళ్ళు అన్నీ చూచాడు. రావణుని అంతఃపురములో ప్రవేశించి సీత కొరకై వెదికాడు. ఎంత వెదికినా, లంకా నగరమంతా గాలించినా హనుమంతునికి సీత జాడ లభించలేదు. హనుమంతుడు నిరాశకు గురయ్యాడు. లంకనుండి కిష్కింధకు వెళ్ళిపోదామని ఆలోచించి ఇక్కడ హనుమంతుడు తన బుద్ధికుశలతను ఉపయోగించాడు. రాముని వద్దకు వెళ్ళి సీత జాడ తెలియుటము లేదని చెబితే రాముడు మరణిస్తాడని, ఆ వార్త విని లక్ష్మణుడు మరణిస్తాడని, ఆ వార్త విని భరతుడు మరణిస్తాడని ఆలోచన చేసి వెనుదిరిగి లంకానగరమునుండి వెళ్ళకుండ మరలా లంకానగరాన్ని వెదకడానికి నిశ్చయించు కున్నాడు. హనుమంతుని నిర్ణయము అతని బుద్ధికుశలతకు, సూక్ష్మబుద్ధికి నిదర్శనము!

లంకానగరములో ఉన్న అశోకవనములో అశోక వృక్షము క్రింద మాసిన శరీరముతో, మాసినబట్టలతో, తలదువ్వుకొనకుండ ఉన్న సీతను హనుమంతుడు

చూశాడు. ఆ దృశ్యాన్ని చూచి హనుమంతుడు దుఃఖించాడు. రాజభవనములో, అంతఃపురములో సంతోషంగా ఉండవలసిన సీత దుస్థితికి దుఃఖించాడు. సీతతో ఏవిధంగా మాట్లాడాలో హనుమంతునికి మొదట అర్థం కాలేదు. తాను రాముని దూతనని, హనుమంతుణ్ణి అని, సీతాన్వేషణము కొరకు అచటకు వచ్చానని సీతతో అంటే ఆమె నమ్ముతుందో లేదో అని ఆలోచించి సీత కూర్చొని ఉన్న అశోకవృక్షాన్ని ఎక్కి ఆకులు, కొమ్మల సముదాయములో సీతకు కనబడకుండ కూర్చొని రామకథను చెప్పటం ప్రారంభించాడు. సీత శ్రద్ధగా రామకథను విన్నది. రామకథను శ్రద్ధగా ఆలకించిన సీత తనను నమ్ముతుంది అని భావించిన హనుమంతుడు సీతతో తాను రాముని దూత హనుమంతుడినని, సీతను వెదకుచూ లంకా నగరానికి వచ్చానని చెప్పి సీతకు తనపై నమ్మకము కలిగించుటకు రాముడిచ్చిన ఉంగరాన్ని (అంగుళీయకము) సీతకు ఇచ్చాడు. ఆ ఉంగరాన్ని తీసుకొన్న సీత సంతోషించింది. ఈలోపు రావణుడు అశోకవనానికి వచ్చి సీతకు రెండు మాసములు గడువు ఇచ్చి తన భార్యగా అంగీకరిస్తుందో లేదో తేల్చుకోమన్నాడు. ఆ తరువాత ఆమెను చంపుతానన్నాడు. ఆడ రాక్షసులను సీతకు కాపలా పెట్టాడు. వారు సీతను భయపెట్టి రావణుని కోరికను మన్నించుమని సీతను బెదిరించారు. సీత అంగీకరించనిచో ఉన్నపళంగా ఆమెను తింటామన్నారు. సీత దురవస్థ చూచిన హనుమంతుడు తన వీపు మీద ఎక్కించుకొని సీతను రాముని దగ్గరకు తీసుకుపోతానన్నాడు. అందుకు సీత అంగీకరించలేదు. హనుమంతునితో రాముని వద్దకు వెళితే రాముని గౌరవ ప్రతిష్ఠలు తగ్గుతాయని, రాముడే స్వయముగా లంకానగరానికి వచ్చి రావణ సంహారము చేసి తనను తీసుకుపోతే రాముని గౌరవ, ప్రతిష్ఠలు పెరుగుతాయని (ఇనుమడిస్తాయని) భావించింది సీత.

అశోకవనానికి రావణుడు వచ్చి సీతకు రెండు మాసములు గడువు ఇచ్చి తన భార్యగా ఉంటుందో లేదో తేల్చుకోమని చెప్పి వెళ్ళిన పిదప కాపలాగా ఉన్న ఆడరాక్షసులు రావణుని కోరికను మన్నించమని సీత మీద ఒత్తిడి తెచ్చి, భయపెట్టి, చంపుతామని బెదిరించిన తరువాత దైవవశాత్తు రావణ సంహారము జరిగింది. రావణ సంహార విషయాన్ని సీతకు తెలియజేయుమని రాముడు హనుమంతుని సీత దగ్గరకు

పంపారు. ఆ విషయాన్ని అనగా రావణ సంహారాన్ని సీతకు తెల్పిన హనుమంతుడు అంతకు మందు తనను వేధించిన ఆడ రాక్షసులను చంపుతానని అందుకు సీత అంగీకారాన్ని కోరగా ఆమె అంగీకరించలేదు. ఆ ఆడ రాక్షసులందరినీ క్షమించాను అన్నది. ఎంత గొప్ప గుణం! సీతారాములమీద హనుమంతునికున్న నిజమైన గౌరవము, భక్తి ఇది!

హనుమంతుడు రావణ దర్శనము కొరకు లంకానగరములో ఉన్న ఉద్యానవనాలను నాశనము చేశాడు. రాక్షసులు ఈ విషయాన్ని గమనించి అతనిని బంధించి రావణుని దగ్గరకు తీసుకొని పోగా రావణుడు మీరెవరు? ఎందుకు వచ్చినారు? తదితర ప్రశ్నలను సంధించగా హనుమంతుడు తాను పరాక్రమశాలియైన రాముని దూతనని తమ దర్శనము కోసము వచ్చానని, రావణుని ముందు ధైర్యంగా చెప్పిన మహాధైర్యశాలి హనుమంతుడు. ఎందుకు ఉద్యానవనములు నాశనం చేశావని రావణుడు అడుగగా హనుమంతుడు తేలికగా రాజుగారి దర్శనము ఊరక లభించదు కదా! అన్నాడు. హనుమంతుని మాటలు ఆయన వాక్చాతుర్యానికి, ధైర్యసాహసాలకు నిదర్శనము. రావణునితో జరిగిన హనుమంతుని సమావేశములో మనం గుర్తుంచు కోవలసింది హనుమంతుని వాక్చాతుర్యము, ధైర్యసాహసాలు. ఆ తరువాత హనుమంతుని తోకకు నిప్పు పెట్టి రాక్షసులు వీధుల వెంట తిప్పారు. హనుమంతుడు ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని లంకా దహనం చేసిన ధైర్యశాలి!

సుగ్రీవుడు తన మంత్రులతో, వానరవీరులతో, వానర సైన్యము, రామలక్ష్మణులతో కలిసి లంకా నగరానికి బయలుదేరిన సందర్భమున వారి ముందున్న అతి క్లిష్టమైన సమస్య సముద్రాన్ని దాటటము. అది చాలా భయంకరమైన సముద్రము. నీలుడు వానర సైన్యముతో కలిసి సముద్రానికి సేతువుని నిర్మించాడు. సేతువు నిర్మాణము జరిగిన తరువాతనే కోట్లకొలది వానర సైన్యము రామలక్ష్మణు లతో కలసి సముద్రాన్ని దాటి, సముద్రపు ఒడ్డున ఉన్న సువేల పర్వతముపై తిష్టవేశారు. లంకానగర ప్రవేశము తరువాత రాక్షసులకు వానరులకు ఘోరమైన యుద్ధము జరిగినది. ఇరుపక్షాల వారు లక్షలకొలది సైన్యము మరణించి లంకానగర వీధులన్నీ పీనుగులతో భీభత్సంగా ఉన్నాయి. ఆ సమయములో చనిపోయిన వానరులను

చూచిన మిగతా వానరులు నిరుత్సాహపడి వెనుదిరగటానికి సిద్ధపడ్డారు. అప్పుడు హనుమంతుడు వానరులందరినీ ఉత్సాహపరచి యుద్ధోన్ముఖు లను గావించాడు. ఇది హనుమంతుని నాయకత్వ పటిమ, లక్షణము. ఎందరో రాక్షసులను హనుమంతుడు యుద్ధంలో చంపాడు. హనుమంతుడు చంపినవారిలో దేవాంతకుడు, త్రిసరస్సులు, నికుంభుడు, ధ్రూమాక్షుడు, అకంపనుడు తదితరులున్నారు. ఇంద్రజిత్తు (రావణుని పుత్రుడు) బ్రహ్మాస్త్రముచే రామలక్ష్మణులను, వానర సైన్యాన్ని మూర్ఛ చెందించగా హనుమంతుడు హిమాలయముల నుండి దివ్యౌషధములు ఉన్న పర్వతాన్ని తెచ్చాడు. ఆ ఔషధుల వాసన పీల్చిన రామలక్ష్మణులు, సమస్త వానరులు స్వాస్థ్యము చెందారు. ఔషధమొక్కలకు బదులుగా హనుమంతుడు పర్వతాన్నే హిమాలయాలనుండి మోసుకురావటము హనుమంతుని శక్తికి, బలానికి, పరాక్రమానికి నిదర్శనము!

ఇంద్రజిత్తు మాయా సీతను సృష్టించి, ఆమె శిరస్సుని ఖండించగా ఆమె మరణించిందని హనుమంతుడు దుఃఖించి ఆ విషయాన్ని రామునికి తెలిపాడు. ఆ వార్త విన్న రాముడు మూర్ఛపోయాడు. విభీషణుడు అది ఇంద్రజిత్తు మాయ అని, సీత బ్రతికే ఉన్నదని తెలుపగా హనుమంతుడు ఆ విషయాన్ని రామునికి తెలియజేయటానికి లక్ష్మణుని, నికుంభికులను పంపమని చెప్పాడు. దీనిని బట్టి సీతారాములపట్ల హనుమంతునికున్న భక్తి, పూజ్యభావము వ్యక్తమవుతుంది.

హనుమంతుడు సీత జాడను తెలుసుకొని ఆమెతో మాటలాడి రాముని వద్దకు బయలుదేరినపుడు సీత తన సందేశాన్ని హనుమంతుని ద్వారా రామునికి పంపింది. ఇది హనుమంతుడు నిర్వహించిన కీలక పాత్ర. భరతుడు అరణ్యవాసములో ఉన్న రాముని కలవటానికి వచ్చినపుడు ఆ విషయాన్ని హనుమంతుడే రామునకు చెప్పాడు. సీతారాముల వనవాసమునందు జరిగిన వృత్తాంతమును భరతునికి చెప్పినది హనుమంతుడే! ఇది హనుమంతుని పాత్ర, ప్రాముఖ్యత.

హనుమంతుడు లంకా నగరము చేరిన తరువాత లంకానగరాన్ని నిశితంగా పరిశీలించాడు. రావణ అంతఃపురాన్ని కూడా జల్లెడ పట్టాడు. రావణుని ఇంటనున్న పుష్పకవిమానాన్ని పరిశీలించాడు. లంకానగరము వెదికి సీత కనిపించకపోవుటచే

ఆమె మరణించి ఉండవచ్చని సందేహించి, దుఃఖించాడు. సీతను చూచిన హనుమంతుడు ఆమె శీలాన్ని కొనియాడాడు. కష్టాలలో ఉన్న సీతకు వానరుల ఉపకారాన్ని గూర్చి చెప్పి ఆమెను ఊరడించాడు.

పై విషయాలన్నీ హనుమంతుని పరిశీలనాశక్తి, సీత పట్ల తనకున్న భక్తి, పూజ్యభావాన్ని తెలియజేస్తున్నాయి.

రావణుని దగ్గరకు వెళ్ళిన హనుమంతుడు అతనికి రాముని పరాక్రమమును గూర్చి తెలిపి తన వాక్చాతుర్యముతో రావణునికి నీతి బోధ చేశాడు. రావణునితో ఈ విధంగా అన్నాడు. "నేను సాక్షాత్తూ వాయుదేవుని కుమారుడను. నా పేరు హనుమంతుడు. నేను సీత కొరకై శత యోజన విస్తీర్ణమైన సముద్రమును శీఘ్రముగా లంఘించి ఆమెను చూచుటకై ఇక్కడికి వచ్చినాను. నేను ఈ లంకలో తిరుగుచూ, తిరుగుచూ నీ యింటిలో సీతను చూచినాను. నీవు ధర్మాధర్మముల స్వరూపము తెలిసినవాడవు. గొప్ప తపస్సు చేసినావు. అందువలన ఓ మహాబుద్ధిశాలీ! నీవు పరభార్యను నీ ఇంటిలో ఉంచుకొనుట యుక్తము కాదు. నీవంటి బుద్ధిమంతులు ధర్మానికి విరుద్ధమైనవి, అనేక అపాయములతో కూడినవి, మూలమునే నశింపజేయునవి అయిన పనులు చేయరు కదా!.... రావణా! మూడులోకములలో ఏ ఒక్కడూ కూడా రామునకు అపకారము చేసి సుఖముగా ఉండజాలడ"న్నాడు.

హనుమంతుని మాటలు పరిశీలించినచో నిర్భయముగా రావణునికి హెచ్చరికలు జారీ చేశాడు. అతడు తప్పులు చేశాడని, పరభార్యలను తన ఇంట ఉంచుకున్నాడని, అందుకు తగిన శిక్ష అనుభవిస్తాడని రావణునికి స్పష్టం చేసి రాముని పరాక్రమాన్ని, రాముని చేతిలో నీకు మరణం తప్పదని సూచించాడు. హనుమంతుని మాటలు అతని వాక్చాతుర్యాన్ని, నిర్భయత్వాన్ని, ధైర్యాన్ని ధర్మనిరతిని విశదపరుస్తున్నాయి.

సీతారాములు ఆదర్శదంపతులు అని హనుమంతుడు ఎలుగెత్తి చాటాడు. సీతకు రాముని ముద్రికను (ఉంగరాన్ని) ఇచ్చి ఆమెపై రామునికి గల ప్రేమను తెలిపాడు. సీత గుణాలను ప్రశంసించి ముల్లోకాల్లో సీతవంటి స్త్రీ లేదన్నాడు. మూడు

లోకములపై అధికారము కంటె సీతను భార్యగా పొందటమే అదృష్టమన్నాడు.

హనుమంతుని తరువాత విభీషణుడు కూడా రావణునితో చెప్పాడు. లంకానగరములో పట్టుబడ్డప్పుడు దూతలను చంపుట అన్యాయమని చెప్పాడు. అందుకే రావణుడు అతనిని వదలివేశాడు. ఇంద్రజిత్తు మాయ సీత శిరస్సు ఖండించినపుడు స్త్రీలను చంపుట పాపమన్నాడు హనుమంతుడు. ఈ సంఘటన హనుమంతుని ధర్మబుద్ధిని తెలియజేస్తుంది. వాలి చనిపోయిన తరువాత విలపించుచున్న అతని భార్యయైన "తార"ను ఓదార్చాడు. హనుమంతుడు బోధించగా సుగ్రీవుడు తన మంత్రియైన నీలుని పంపించి వానరసైన్యమును సమకూర్చవలెనని ఆదేశించాడు. వానరులను భేదోపాయము చేత తనవైపు తిప్పుకొని తనతో రావలసినదిగా అంగదునికి బోధ చేశాడు. ఈ సంఘటనలన్నీ హనుమంతుని నాయకత్వ లక్షణాలను, నాయకత్వ పటిమను తెలియజేస్తున్నాయి.

హనుమంతుడు సూక్ష్మబుద్ధి గల గూఢచారి. రామాయణంలో అనేక సందర్భాలలో గూఢచర్యాన్ని నిర్వహించాడు. రామలక్ష్మణులు ధనుర్ధరులై ఋష్యమూక పర్వతానికి వచ్చారని తెలుసుకున్న సుగ్రీవుడు వారిని వాలి తనను చంపటానికి పంపాడేమోనని అనుమానంతో హనుమంతుని రామలక్ష్మణులను గురించి సమాచారము తెలుసుకొని వారెవరు? ఎందుకు వచ్చారు? - ఇత్యాది ప్రశ్నలను సాధారణ వ్యక్తిగా అడిగి వారి సమాధానాలను రాబట్టి, వారి హావభావాలను, ఆలోచనలను అంచనా వేయమన్నాడు. హనుమంతుడు రామలక్ష్మణుల వద్దకు గూఢచారిగా వెళ్ళి వారి సమాచారము సేకరించి వారికి తన గురించి, సుగ్రీవుని గురించి చెప్పాడు. వారిని వెంటబెట్టుకొని సుగ్రీవుని వద్దకు వచ్చారు. రాముడు హనుమంతుని వాక్చాతుర్యాన్ని గురించి లక్ష్మణునికి చెప్పాడు. ఆ తరువాత సుగ్రీవునికి రామ లక్ష్మణులతో మైత్రీ బంధము ఏర్పడ్డది. దీనికి మూలకారకుడు హనుమంతుడు.

సీత జాడ కొరకై తన దేహాన్ని పెద్దదిగా చేసి ఆకాశమార్గాన లంకా నగరము చేరి, తరువాత తన దేహాన్ని చిన్నదిగా చేసుకొని లంకానగర వీక్షణము గావించాడు. హనుమంతుడు ఆ తరువాత సీత కోసం లంకానగరం ఇల్లిల్లు తిరిగి చివరకు

రావణుని అంతఃపురాన్ని కూడా గాలించాడు.

చివరకు అశోకవనములో సీతను చూచి సంతసించి ఆమెకు తాను రామదూతనని నమ్మకాన్ని కలిగించటానికి సీత ఏ అశోకవృక్షము క్రింద కూర్చొని ఉన్నదో ఆ అశోకవృక్షాన్ని ఎక్కి ఆకులు, కొమ్మల మధ్య ఆమెకు కనబడకుండా రామకథను వినిపించగా ఆమె శ్రద్ధగా ఆలకించింది. ఇవన్నీ హనుమంతుని గూఢచార చర్యలే!

క్లుప్తంగా చెప్పాలంటే హనుమంతుడు బలసంపన్నుడు, శక్తిమంతుడు. నిస్వార్థపరుడు, ధైర్యశాలి, సూక్ష్మబుద్ధి, పరాక్రమము కలవాడు. అన్నిటికంటె మించి సీతారాముల భక్తుడు. తన శక్తియుక్తుల మీద అపార విశ్వాసము కలవాడు. సీతజాడను కష్టించి తెలుసుకొని ఆ విషయాన్ని రామునికి తెలియజేశాడు. సీత కష్టాలు చూచి దుఃఖించాడు. సీతారాముల కలయికకు తనవంతు కృషి చేశాడు. రావణ సైన్యాన్ని బలహీనపరచటానికి అనేకమంది వీరులైన రాక్షసులను చంపాడు. రావణుని కలసి తాను రాముని దూతనని, హనుమంతుడనని తెలిపి రాముని పరాక్రమాన్ని గురించి ధైర్యంగా చెప్పి సీతను లంకలో ఉంచుకోవటము ధర్మవిరుద్ధమైన చర్య అని ధైర్యంగా చెప్పి అందుకు తగిన శిక్షను అనుభవిస్తావని హెచ్చరించాడు. రాముడు ఇచ్చిన ఉంగరాన్ని సీతకు ఇచ్చి, సీత ఇచ్చిన చూడామణిని రామునికి ఇచ్చి ఇద్దరినీ ఆనందపరిచాడు. ఒక్కమాటలో చెప్పాలంటే హనుమంతుని పాత్ర సృష్టి జరుగకపోతే సీత జాడ తెలిసేది కాదు, రావణ సంహారము జరిగేది కాదు. అందుకనే రాముడు హనుమంతునితో తన చరిత్ర భూమి మీద ఉన్నంత కాలము హనుమంతుని చరిత్ర, కీర్తి లోకంలో ఉంటాయని అన్నాడు.

# అధ్యాయము - 8

## రావణుని గుణగణాలను, పరాక్రమాన్ని, గొప్పతనాన్ని, పతనాన్ని గూర్చి తెలుసుకోవటానికి రామాయణం చదవాలి

రామాయణంలో రావణుని పాత్ర వాల్మీకి అద్భుత సృష్టి. రావణుని పాత్రను సృష్టించకపోతే లోకంలో మంచికి చెడుకి, ధర్మానికి అధర్మానికి, సత్యానికి అసత్యానికి తేడా తెలియదు. అసత్య, అధర్మ, చెడుకి ప్రతీకగా రావణ పాత్ర సృష్టి జరుగకపోతే రామాయణంలో రాముని గుణగణాలు, పరాక్రమము, గొప్పతనము తెలిసేది కాదు. ధర్మప్రతిష్ఠ జరిగి ఉండేది కాదు. వెలుతురుకి, చీకటికి ఉన్నంత తేడా ఉన్నది రామరావణ పాత్రల సృష్టి మధ్య. రామాయణం ఏడు కాండములలో కేవలము నాలుగు కాండములలోనే రావణుని గురించిన సమాచారము మనకు లభిస్తుంది. 1. అరణ్యకాండము, 2. ఉత్తరకాండము, 3. సుందరకాండము, 4. యుద్ధకాండము.

**రావణుని జననము :**

రామాయణం ఉత్తర కాండము తొమ్మిదవ సర్గములో రావణుని జననానికి సంబంధించిన సమాచారాన్ని పరిశీలిద్దాము.

రావణుని తల్లిదండ్రులు "కైకసి, విశ్వవసుడు". విశ్వవసుడు కైకసికి నలుగురు సంతానము. 1. రావణుడు, 2. కుంభకర్ణుడు, 3. శూర్పణఖ, 4. విభీషణుడు.

రావణుడు జన్మించకముందే "కైకసి"కి ఎటువంటి సంతానం జన్మిస్తారో బ్రహ్మర్షియైన విశ్వవసుడు చెప్పాడు. "కైకసికి భయంకరులు, భయంకరమైన ఆకారం కలవారు, క్రూరులైననూ బంధువులయందు ప్రీతికలవారు, క్రూరములైన పనులు చేయువారు అయిన రాక్షసులు పుత్రులుగా పుట్టెదరు".

కైకసి ఇదేమి ప్రభూ అని వేడుకొనగా, విశ్వవసుడు "నీ చివరి పుత్రుడు ధర్మాత్ముడై నా సంతానానికి తగినవాడు అగును. సందేహము లేదు" అన్నాడు.

రావణుని ఆకారము : విశ్వవసుడు చెప్పిన కొద్దికాలానికి కైకసి భయంకరుడు, చాలా క్రూరుడు అయిన రాక్షస రూపముగల పుత్రుని కన్నది. ఆ పిల్లవానికి పది కంఠములు, పెద్దకోరలు, ఎఱ్ఱని పెదవులు, ఇరవై చేతులు, పెద్దనోళ్ళు, ప్రకాశించుచున్న జుట్టు ఉన్నవి. అతడు పుట్టగానే నిప్పుల ముద్దలు నోళ్ళలో ఉన్న ఆడ నక్కలు, మాంసములను తిను మృగాలు అపసవ్యముగా, గుండ్రముగా తిరిగినవి. దేవుడు రక్తాన్ని కురిపించాడు. మేఘములు కటువుగా ఉరిమాయి. సూర్యుడు ప్రకాశింపలేదు. భూమిపై పెద్ద ఉల్కలు పడ్డాయి. భూమి అదిరింది.

రావణుని ఇతర నామములు : వైశ్రవణుడు, దశగ్రీవుడు, దశాననుడు.

(ఉత్తరకాండము 9వ సర్గము)

## రావణుడు తపస్సు చేసి పొందిన వరము :

దశగ్రీవుడు పదివేల సంవత్సరములు ఆహారమేమియు లేక తపస్సు చేయుచు వేయి సంవత్సరములు పూర్తి అయినప్పుడల్లా తన శిరస్సును అగ్నిహోమము చేశాడు. ఈ విధముగా తొమ్మిది వేల సంవత్సరములు గడిచి తొమ్మిది శిరస్సులు అగ్నిలో హోమము చేశాడు. పదివేల సంవత్సరములు పూర్తి అయిన పిదప పదవ శిరస్సును అగ్నిహోమములో వేయుటకు ఉద్యుక్తుడగుచుండగా బ్రహ్మాది దేవతలు వచ్చి దశగ్రీవుని తనకిష్టమైన వరమును కోరుకొమ్మన్నారు. రావణుడు చేసిన తపస్సు వ్యర్థము కాదన్నాడు బ్రహ్మ.

అప్పుడు దశగ్రీవుడు సంతోషించి మరణము లేకుండా తనకు వరమివ్వమన్నాడు. అందుకు బ్రహ్మదేవుడు మరణము లేని వరము సాధ్యం కాదన్నాడు. అప్పుడు రావణుడు తనకు "పక్షులు, నాగులు, యక్షులు, దైత్యులు, దానవులు, రాక్షసులు, దేవతలు చంపజాలకుండునట్లు" వరమునిమ్మని బ్రహ్మదేవునితో అనగా బ్రహ్మ అట్లే అన్నాడు. ఆ తరువాత పూర్వము దశగ్రీవుడు హోమము చేసిన శిరస్సులన్నీ మరలా మొలచునన్నాడు బ్రహ్మ. అవి అట్లే మొలచాయి.

(ఉత్తరకాండం 10వ సర్గము)

**రావణుని నివాస గృహము :**

రావణుని నివాసము లంకా నగరము. కుబేరుడు మొదట లంకాధిపతి. ఇతడు రావణుని సవతి తల్లి కొడుకు. అతడు లంకా నగరాన్ని ఖాళీ చేసి కైలాస పర్వతానికి తండ్రి ఆజ్ఞమేరకు వెళ్ళాడు. లంకా నగరము సముద్రము ఆవలి ఒడ్డున ఉన్నది. ఆ పట్టణము ఇంద్రుని అమరావతివంటిది. రాక్షసులతో నిండి ఉన్నది. ఆ లంకానగరము చుట్టూ తెల్లగా ప్రకాశించుచున్న ప్రాకారము, దానిలో బంగారు మేడలు, వైఢూర్యములు పొదిగిన తోరణములు ఉన్నవి. ఆ పట్టణము ఏనుగులతోను, అశ్వములతోను, రథములుతోను కిక్కిరిసి ఉండెను. అన్ని కాలములందు ఫలములనిచ్చే ఉద్యానవనములతో శోభించుచుండెను. (సుందరకాండము 10వ సర్గము, అరణ్యకాండము 48వ సర్గము)

**రావణుని గుణగణములు :**

రావణుడు బ్రాహ్మణోత్తముడు, చంచల స్వభావుడు, నిత్యము పరస్త్రీలయందు ఆసక్తి కల కామ మోహితుడు, యుద్ధప్రియుడు, అధర్మపరుడు, కోరిన రూపములు ధరించుటకు వరములు పొందినవాడు, మాయల సృష్టికర్త, చెడు స్వభావము కలవాడు, ధర్మాధర్మ, న్యాయాన్యాయ విచక్షణ లేనివాడు, ముల్లోకములపై అధికారకాంక్ష కలవాడు, ఇటువంటి దుర్గుణములు రావణుని ఆశ్రయించి ఉన్నాయి. అన్నిటికంటె మించి ఎదురులేని క్రూరుడైన రాక్షసరాజు.

**దశగ్రీవుని పరాక్రమము :**

సాటిలేని పరాక్రమవంతుడు. రావణుని పరాక్రమాన్ని పరిశీలిద్దాము.

రావణుని సోదరి శూర్పణఖ అరణ్యములలో సంచరించుచు అరణ్యవాసములో ఉన్న రామలక్ష్మణులను చూచి రాముని మోహించి తనను వివాహమాడమన్నది. అందుకు రాముడు నిరాకరించి లక్ష్మణునిచే శూర్పణఖ ముక్కు చెవులు కోయించాడు. ఆమె తన అన్నయైన రావణుని వద్దకు వెళ్ళి రాముని మీద ప్రతీకారము తీర్చుకోమని, రాముని భార్యయైన సీత చాలా అందగత్తె అని ఆమెను

వివాహమాడమని ప్రోత్సహించింది. అందుకు రావణుడు మారీచుని సహాయము కోరి, అతనిని బంగారు జింక రూపమును ధరించమన్నాడు. ఆ తరువాత మారీచుడు బంగారు జింక రూపాన్ని ధరించి సీత ఉన్న ఆశ్రమ సమీపానికి వచ్చి సీత కంట పడగా, ఆమె ఆ జింక కావాలని రాముని కోరగా, అతడు జింకను వెంబడించి వెళ్ళి ఎంతసేపటికీ రాకపోగా, లక్ష్మణుని పంపించింది. రామలక్ష్మణులిద్దరు పర్ణశాలలో లేని సమయమున రావణుడు కపట సన్యాసి రూపాన్ని ధరించి సీత ఉన్న ఆశ్రమానికి రాగా అతడు నిజముగా సన్యాసి అని భావించి సీత అతనికి ఆతిథ్యమిచ్చింది. ఆ తరువాత రావణుడు తన నిజస్వరూపాన్ని చూపి తాను లంకాధిపతినని తన పరాక్రమాన్ని గురించి సీతకు ఈ విధంగా చెప్పాడు.

"ఇచ్ఛానుసారముగా ప్రయాణము చేసే, మంగళప్రదమైన పుష్పకమను పేరుగల విమానము కుబేరునిదని, తాను పరాక్రముచేత అతనిని ఓడించి (జయించి) ఆ విమానాన్ని సంపాదించానన్నాడు. దానిపైనెక్కి ఆకాశమునందు సంచరించుచున్నా నన్నాడు. సీతా! నాకు కోపము వచ్చినట్లు చూడగానే భయపడిపోయి దేవేంద్రుడు మొదలైన దేవతలందరూ పారిపోవుదురు. నేను నిలబడి ఉన్న చోట వాయువు భయపడుచు వీచును. తీవ్రమైన కిరణములుగల సూర్యుడు కూడా తన కిరణములను చల్లగా చేయును. నేను ఎక్కడ ఉందునో, నేను ఎక్కడ సంచరించుదునో అక్కడ చెట్ల ఆకులు కూడా కదలవు. నదులు మందముగా ప్రవహించుచుండును".

రాముడు స్వయంగా తానే సీతకు వర్ణించి చెప్పిన తన పరాక్రమమిది. (అరణ్యకాండము 48వ సర్గము)

## యుద్ధకాండములో రావణుని పరాక్రమాన్ని పరిశీలిద్దాము :

రావణుడు యుద్ధవిద్యలో గొప్ప వ్యూహకర్త. రామలక్ష్మణులు లంకానగరము చేరారని వార్త విన్న రావణుడు, వానర సైన్యాన్ని, వానర వీరుల సంఖ్యను, వారి బలాన్ని, వారి ఆయుధాల వివరాలను తెలుసుకోవటానికి సువేల పర్వతము మీద ఉన్న రామలక్ష్మణుల దగ్గరకు గూఢచారులుగా "శుకసారణులను" అను మంత్రులను పంపాడు. వారు వానర సైన్యాన్ని లెక్కించలేకపోయారు. విభీషణుడు వారిని గుర్తించి

రాముని వద్దకు తీసుకుపోగా రాముడు వారిని శిక్షించకుండ వదలి వేసి తన సందేశాన్ని వారి ద్వారా రావణునికి పంపాడు. "సారణుని" మాటలు విని రావణుడు వానరసైన్యాన్ని చూచుటకై ప్రాసాదము పైకి ఎక్కాడు.

లంకానగరములోనికి వానర సైన్యముగాని, రామలక్ష్మణులుగాని ప్రవేశించకుండా నలుదిక్కులా వీరులైన రాక్షసులను రాక్షససైన్యముతో కాపలా ఉంచాడు. ఒక దిక్కున తానే పెద్ద రాక్షససైన్యముతో కాపలా కాశాడు. వీరులైన రాక్షసులను వానర సైన్యముతో ఉన్న రామలక్ష్మణులతో ముందుగా యుద్ధానికి పంపాడు. రావణుడు పంపిన యుద్ధవీరులలో ధ్రూమాక్షుడు, వజ్రదంష్ట్రుడు, అకంపనుడు, దేవాంతక నరాంతకులు, త్రిశిరస్సులు, మహోదరుడు, మహాపార్శ్వుడు, వికుంభుడు, కుంభుడు, అతికాయుడు, విరూపాక్షుడు, విరాధుడు, మకరాక్షుడు తదితరులున్నారు. వారందరూ మరణించిన తరువాత రావణుడు తానే స్వయముగా యుద్ధానికి బయలుదేరాడు. రాముని చేతిలో పరాభవము పొందిన రావణుడు తన సోదరుడైన కుంభకర్ణుని యుద్ధానికి పంపాడు. కుంభకర్ణుడు యుద్ధములో అనేకమంది వానరులను చంపాడు. రామునితో ఘోరయుద్ధము చేసిన కుంభకర్ణుడు చివరకు రాముని చేతిలోనే మరణించాడు. కుంభకర్ణుడు మరణించగా రావణుడు విలపించాడు. ఆ తరువాత రావణపుత్రుడైన ఇంద్రజిత్తు (మేఘనాథుడు) యుద్ధరంగములోనికి దిగి రామలక్ష్మణులను ఇబ్బందిపెట్టి నాగపాశముతో బంధించాడు. వారు స్పృహను కోల్పోవగా గరుత్మంతుడు వారిని నాగపాశ బంధమునుండి విడిపించాడు. లక్ష్మణ ఇంద్రజిత్తుకి జరిగిన ఘోర యుద్ధములో లక్ష్మణుడు ఇంద్రజిత్తుని వధించాడు. కుంభకర్ణుడు, ఇంద్రజిత్తు మరణించిన తరువాత రావణుడు స్వయంగా రామునితో యుద్ధానికి దిగాడు. ఇద్దరూ పరాక్రమవంతులే. వరాలు పొందినవారే. రావణుడు చేసిన పొరపాటు ఏమనగా బ్రహ్మనుండి వరము పొందేటప్పుడు "పక్షులు, నాగులు, యక్షులు, దైత్యులు, దానవులు, రాక్షసులు, దేవతల"నుండి మరణం లేకుండా వరాన్ని కోరాడు గానీ, మనుష్యులనుండి మరణం లేకుండా వరాన్ని పొందలేదు. కానీ రాముడు మానవుడు, దశరథుని జ్యేష్ఠపుత్రుడు. ఇంద్రుడు రామునికి తన రథాన్నిచ్చాడు. బ్రహ్మాస్త్రమును

వరముగా పొందాడు. తన బాణాలతో రావణుని శిరస్సులను ఖండిస్తుండగా అవి మరలా మొలుస్తున్నాయి. రాముడు సంకట స్థితిలో పడ్డాడు. అప్పుడు రాముడు రావణుని వక్షస్థలము మీద బ్రహ్మాస్త్రమును ప్రయోగించగా రావణుడు మరణించాడు. రామరావణ యుద్ధము ఏడురోజులు జరిగింది. చివరకు రాముడు రావణుని బ్రహ్మాస్త్రముతో చంపగలిగాడు. రావణుడు మరణించాడు. రాముడు గనుకనే రావణుని చంపగలిగాడు. దేవతల ఆశీస్సులు కూడా రామునికున్నాయి. ఇది రాముని పరాక్రమము. రావణుడు పరాక్రమవంతుడైనా రాముని పరాక్రమమునందు రావణుని పరాక్రమము పనిచేయలేదు.

**రావణుడు త్రిలోక కంటకుడు :**

రావణుడు తాను పొందిన వరబలముచేతను, తనకున్న బలము చేతను మూడు లోకాలు తిరిగి మూడు లోకాలలో ఉన్న ప్రముఖులందరిని తనతో యుద్ధానికి రమ్మని, రానివారిని ఓడిపోయానని ఒప్పుకోమని కబురంపాడు. ముల్లోకాలను జయించాలనేదే రావణుని బలమైన కోరిక! యుద్ధోన్మాది! మునులను, మహర్షులను సయితము నానా ఇబ్బందులకు గురిచేశాడు. త్రిలోక కంటకుడిగా మారాడు. రావణుడు సీతను అపహరించి తీసుకుపోవుచున్నప్పుడు జటాయువుతో యుద్ధము చేసి రెక్కలు తెగనరికి చంపాడు (అయోధ్యకాండము 50వ సర్గము)

రావణుడు ఎవరెవరిపై యుద్ధాన్ని ప్రకటించి యుద్ధానికి వెళ్ళిన విషయ వివరములు ఉత్తరకాండములో నిక్షిప్తమై ఉన్నవి. వాటిని పరిశీలిద్దాము.

1) రావణుడు తన తపోబలముచే పొందిన వరములచే ముల్లోకాలను జయించాలనే కోరిక అతనిలో బలంగా ఉన్నది. తన మంత్రులతో కలసి యక్షులపై ఆక్రమణము చేసి వారిని ఓడించి విజయము పొందాడు.

**రావణ యక్షుల యుద్ధము :** రావణుడు వీరులైన తన ఆరుగురు మంత్రులతో కైలాస పర్వతము చేరాడు. యుద్ధాభిలాషతో ఉన్న రాక్షస రాజైన రావణుని ఎదుట యక్షులు నిలువజాలకపోయిరి. రావణుడు కుబేరుని సోదరుడు అని తెలుసుకున్న యక్షులు కుబేరుని వద్దకు వెళ్ళి అతని అనుమతిని పొందిన తరువాత రావణునితో

యుద్ధానికి సన్నద్ధమయ్యారు. యక్షులకు రావణునికి జరిగిన యుద్ధములో యక్షులు నిలువజాలకపోయిరి. కొందరు మరణించారు. కొందరు పారిపోయారు. తుదకు రావణుడు విజయము సాధించాడు. (ఉత్తరకాండము 14వ సర్గము)

2) వేదవతి అగ్నిలో ప్రవేశించిన పిమ్మట రావణుడు పుష్పకవిమానమునెక్కి భూలోకంలో సంచరించుచున్న "ఉశీరబీజ"మను క్షేత్రమునకు వెళ్ళి అక్కడ యాగము చేయుచున్న "మరుత్తమ మహారాజును", దేవతలను చూచాడు. సాక్షాత్తూ బృహస్పతి సోదరుడు, ధర్మములు ఎరిగినవాడూ అయిన "సంపర్తుడను" బ్రహ్మర్షి సమస్త దేవగణముతో కూడినవాడై యాగములు చేయిస్తున్నారు. ఆ దేవతలు రావణుని చూచి భయపడి తిర్యగ్జంతువులలో ప్రవేశించి ఇంద్రుడు నెమలిగాను, యముడు కాకిగాను, కుబేరుడు తొండగాను, వరుణుడు హంసగాను మారారు. రావణుడు అశుచియైన కుక్కవలె యజ్ఞశాలలో ప్రవేశించి ఆ రాజువద్దకు వెళ్ళి తనతో యుద్ధము చేయమని లేదా ఓడిపోయానని అంగీకరించమనగా మరుత్తరాజు యుద్ధానికి సిద్ధపడగా యజ్ఞము పూర్తికాకుండా యుద్ధము చేయకూడదని వారించాడు సంపర్తుడు. అప్పుడు రావణుడు యుద్ధములో గెలిచినట్లు చాటుకున్నాడు. (ఉత్తరకాండము 18వ సర్గము)

3) నారదుని ప్రేరణచే రావణుడు యుద్ధమునకై యమలోకానికి వెళ్ళాడు. భూలోకంనుండి పుష్పకవిమానంలో ఆకాశాన తిరుగుతున్న రావణునికి నారదుడు కనిపించాడు. భూలోకవాసులు అనేక కష్టాలను అనుభవించుచున్నారని వారిని చంపుట పెద్ద గొప్పకార్యము కాదని, యమలోకానికి వెళ్ళి యమునితో యుద్ధము చేయమని నారదుడు రావణునికి చెప్పగా అట్లేనని యమలోకానికి బయలుదేరాడు రావణుడు. రావణుని కంటె ముందే నారదుడు యమలోకానికి వెళ్ళి యముణ్ణి కలిసి రావణుడు యమలోకానికి యుద్ధానికి వస్తున్నాడని యమునకు చెప్పగా యమభటులు రావణుని మీద యుద్ధానికి సిద్ధమయ్యారు. ఇంతలో రావణుని పుష్పకవిమానము రానే వచ్చింది. యమభటులు కొందరికి విధించిన శిక్షను రావణుడు తప్పించగా నీవెవరవని వారతనిని అడిగి అతనితో యుద్ధానికి తలపడ్డారు. రావణుని మంత్రులను యుద్ధములో యమభటులు రావణునితో సహా కుమ్మివేశారు. పుష్పకవిమానము

మీద శిలములు, పరిఘలు, ముగ్గముల వర్షము కురిపించారు. రావణుడు పుష్పకాన్ని వదలి భూమి మీదకు వచ్చి యమభటులతో యుద్ధము చేశారు. రావణునికి ఒడలంతా రక్తము కారుచున్నది. చివరకు రావణుడు బాణప్రయోగము చేసి వారిని తరిమి వేసి సింహనాదము చేయగా ఆ శబ్దము విని యముడు తన దండము తీసికొని రథమెక్కి యుద్ధభూమికి వచ్చాడు. మృత్యువు యమునితో అతడు అవసరము లేదని తనకు అధికారమివ్వవలసిందిగా కోరగా అందుకు యముడు అంగీకరించ లేదు. యమదండముచే ముల్లోకాలు నశిస్తాయని అక్కడ జరిగిన వ్యాకులమైన యుద్ధాన్ని చూచి దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు బ్రహ్మదేవునితో కలిసి ఆ యుద్ధరంగానికి వచ్చారు. బ్రహ్మదేవుడు యమునితో తన దండాన్ని రావణుని మీద ప్రయోగించవద్దని, తాను రావణునికిచ్చిన వరము అసత్యమవుతుందని యుద్ధ నివారణ చేశాడు. ఇంద్రుడు తన రథముతో కానరాకుండా వెళ్ళిపోగా రావణుడు తాను విజయము పొందానని గర్వించాడు. (ఉత్తరకాండము 20,21,22 సర్గములు)

**4) రావణుడు సూర్యుని జయించుటకై సూర్యలోకానికి వెళ్ళాడు.**

రావణుడు "ప్రహస్తుని" తీసుకొని పుష్పకవిమానము ఎక్కి సూర్యలోకానికి వెళ్ళాడు. అక్కడ సర్వాలంకార భూషితుడు, సకల తేజః స్వరూపుడు, మంగళ ప్రదుడైన సూర్యదేవుణ్ణి చూశాడు. సూర్యుడు వేయి కిరణములతో ప్రకాశించుచున్నాడు. ఉచ్చైఃశ్రవమును (సూర్యుని వాహనము) ఎక్కి ఉన్నాడు. ప్రహస్తుని రావణుడు సూర్యుని వద్దకు పంపి రావణుడు యుద్ధానికి వచ్చాడు, యుద్ధము చేయుటకు రమ్మని చెప్పమన్నాడు లేదా ఓడిపోయానని చెప్పమన్నాడు. ప్రహస్తుడు ద్వార పాలకులైన పింగళుడు, దండికి చెప్పగా వారు సూర్యునితో చెప్పగా సూర్యుడు "దండీ! నీవు వెళ్ళి అతనిని (రావణుని) జయింపుము లేదా ఓడిపోయానని చెప్పుము. ఈ రాక్షసుని విషయమున నీకెట్లు ఇష్టమో అట్లు చెప్పు"మని చెప్పాడు. సూర్యుడు చెప్పిన మాటలను దండి రావణునికి పూర్తిగా వివరించి చెప్పగా రావణుడు దండి మాటలు విని తన జయములను చాటించి వెళ్ళాడు. (ఉత్తరకాండము 2వ ప్రక్షిప్త సర్గము)

**5)** రావణుడు చంద్ర లోకానికి యుద్ధమునకు వెళ్ళగా బ్రహ్మదేవుడు వారించాడు.

6) రావణుడు తన సైన్యముతో ఇంద్రలోకము వెళ్ళి ఇంద్రుని మీద యుద్ధమును ప్రకటించాడు. ఇంద్రుడు విష్ణుమూర్తిని కలసి రావణుని విషయమున తానేమి చేయవలయునని అడిగాడు. రావణుడు వరములు ఉండుట చేత మాత్రమే బలవంతుడుగాని మరొక కారణము చేత కాదని బ్రహ్మదేవుడు చెప్పిన వచనము సత్యము అగునట్లు చేయవలెను కదా? అన్నాడు. అందుకు ఇంద్రుడు విష్ణువుతో నీవు నారాయణుడవు చక్రము ధరించి రావణునితో యుద్ధము చేసెదవో లేదో స్వయముగా యదార్ధము చెప్పమన్నాడు. అందుకు విష్ణుమూర్తి రావణుని తాను చంపుతానని అయితే సమయము ఇంకా రాలేదని ప్రస్తుతము ఇంద్రుణ్ణి యుద్ధము చేయమన్నాడు. ఇంద్రుడు తన సైన్యాన్ని పంపాడు. ఇంద్ర రావణ సైన్యానికి ఘోరమైన యుద్ధము జరిగింది. ఆ తరువాత రావణుని కుమారుడు ఇంద్రజిత్తు, ఇంద్రుని కుమారుడు జయంతుడు యుద్ధరంగంలో ప్రవేశించారు. వారు యుద్ధము చేయుచుండగా జయంతుని తాత "పులోముడు" అతనిని తీసుకొని సముద్రము లోనికి వెళ్ళారు. ఆ తరువాత ఇంద్ర రావణుల యుద్ధం జరిగింది. రావణుడు యుద్ధమునుండి బయటకు పోగా అతనిని పట్టుకొనుటకై దేవతలు ప్రయత్నించు చుండగా ఇంద్రుణ్ణి మేఘనాథుడు మాయాప్రయోగము చేత బంధించాడు. బ్రహ్మదేవుడు ఇంద్రజిత్తుకి వరము ఇచ్చి ఇంద్రుణ్ణి బంధనమునుండి విడిపించారు. ఇంద్రుడు యజ్ఞము చేసి స్వర్గానికి వెళ్ళాడు. ఆ విధముగా రావణుడు ఇంద్రుణ్ణి జయించాడు. (ఉత్తరకాండము 27 నుండి 30 సర్గములు)

7) నారదుడు చెప్పగా శ్వేత పర్వతమును గూర్చి విని రావణుడు అక్కడివారితో యుద్ధము చేయుటకై వెళ్ళి అక్కడ స్త్రీల చేత అవమానము పొందాడు. (ఉత్తర కాండము 10వ ప్రక్షిప్త సర్గము)

8) పాతాళలోకానికి వెళ్ళి బలి చక్రవర్తిని కలిసి అతనితో యుద్ధము చేయలేదు కాని పరిస్థితులను పరిశీలించాడు.

ఈ విధముగా రావణుడు మూడు లోకములలో ప్రసిద్ధులయిన అందరితో కదనరంగానికి కాలు దువ్వి విజయాన్ని ప్రకటించుకున్న యుద్ధప్రియుడు.

రావణుడు పరస్త్రీలయందు ఆసక్తి కలవాడు, కామ మోహితుడు.

**1)** రావణుని ధర్మపత్ని "మండోదరి". ఈమె సీతవలె మహా పతివ్రత. రావణుడు చంచల స్వభావుడు, త్రిలోక సంచారి. మాయారూపములు ధరించగలవాడు. పుష్పకవిమానాన్ని అపహరించిన తరువాత ఒకరోజు భూలోకములో సంచరించుచూ హిమవత్పర్వత ప్రాంతాన తపస్సు చేయుచున్న కుశధ్వజుడను బ్రహ్మర్షి కుమార్తె అయిన వేదవతిని గాంచి ఆమె అందానికి ఆశ్చర్యపడి తపస్సు చేయుట ఆ వయస్సులో ఆమెకు తగదని సంసార సుఖములు అనుభవించమని ఆమె చేయి పట్టుకొనగా ఆమె అవమానంగా భావించి అగ్నిప్రవేశము చేసి మరుజన్మలో సీతగా జనకుని ఇంట జన్మించి రావణ సంహారము చేస్తానన్నది.

**2)** ఇంద్రుని భార్య శచీదేవి చేయి పట్టుకొని రావణుడు ఆమెను ఇబ్బంది పెట్టాడు.

**3)** అప్సరసలందరిలో అందగత్తె "రంభ". ఆమెను రావణుడు బలవంతంగా అనుభవించాడు. ఈ విషయము తెలుసుకున్న "నలకూబరుడు" రావణుని శపించాడు. ఇకపై రావణుడు కామములేని మరొక స్త్రీని పొందజాలడన్నాడు. రావణుడు కామములేని ఎవరినైనా అవమానించినచో అప్పుడతని శిరస్సు ఏడు ముక్కలుగా బ్రద్దలగునని శపించాడు. (ఉత్తరకాండము 26వ సర్గము)

**4)** ఒక రోజు రాక్షస రాజైన రావణుడు "మహాపార్శ్వుని"కి తన రహస్యమొకటి చెప్పాడు. పూర్వము చాలా కాలము క్రితము "పుంజికస్థల" అను అప్సరస తనను చూచి భయపడ్డదన్నాడు. భయపడిన ఆమెను వివస్త్రను చేసి బలాత్కారముగా అనుభవించానన్నాడు. ఈ విషయము బ్రహ్మదేవునికి తెలిసింది. బ్రహ్మదేవుడు రావణుని శపించాడని చెప్పాడు. ఆ రోజు మొదలు రావణుడు పరస్త్రీని బలాత్కారముగా అనుభవించినట్లయితే అతని శిరస్సు నూరుముక్కలుగా బ్రద్దలగుతుంది. సందేహము లేదన్నాడు. (యుద్ధకాండము 13వ సర్గము)

**5)** ఎందరో అందమైన స్త్రీలను అపహరించి రావణుడు లంకా నగరములో తన అంతఃపురములో తన భార్యలుగా చేసుకున్నాడు. చివరకు రాముని ధర్మపత్నియైన సీతను కూడా కపట సన్యాసి రూపములో అరణ్యావాసములో ఉన్న సీత పర్ణశాలకు

వచ్చి ఆమెను చూచి, ఆమె సౌందర్యానికి ఆశ్చర్యచకితుడై, ఆమెను తన పట్టమహిషి కమ్మని కోరాడు. అందుకు ఆమె నిరాకరించగా తాను సన్యాసి కాదని లంకాధిపతిని అని తన పరాక్రమాన్ని గూర్చి వివరించాడు. రాముడు రాజ్యాధికారాన్ని కోల్పోయి అడవుల బాట పట్టాడని, లంకానగరములో తనతో సర్వసుఖములు అనుభవించవచ్చునన్నాడు. రాముడు బుద్ధిహీనుడని అట్టివానితో సీతకేమి పని అన్నాడు. తాను కామ మోహితుడనై ఆమె దగ్గరకు వచ్చానని ఆమెను సమీపించి పట్టుకొని తన ఒడిలో కూర్చుండబెట్టుకొని లంకానగరానికి తీసుకుపోయిన క్రూరుడు. సీతను అపహరించిన రావణుడు ఆమెను బలవంతంగా ఎందుకు అనుభవించలేదనే సందేహము చదువరులకు కలుగవచ్చును. అందుకు కారణం బ్రహ్మశాపము.

సీతకు రామునియందు తప్ప రావణుని యందు కామవాంఛ ఏ కోశాన లేదు. మహా పతివ్రత కనుకనే రావణ సంహారానికి ఇంద్రాది దేవతలు సహకరించారు. రావణ సంహారము తరువాత దేవతలందరూ అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందారు.

పరస్త్రీ వాంఛాపరులకు పతనము తప్పదనే సందేశాన్ని రామాయణం రావణుని పాత్ర ద్వారా స్పష్టం చేసింది.

రావణుడు అధర్మపరుడు, మాయల సృష్టికర్త, కోరిన రూపములు ధరించగలవాడు. న్యాయాన్యాయ విచక్షణా జ్ఞానం లేనివాడు, అహంకారి.

రామునికి సీతను ఇచ్చి రామునితో సంధి చేసుకోమని హనుమంతుడు, విభీషణుడు, కుంభకర్ణుడు మొదలగువారు సలహా ఇచ్చినప్పటికీ రావణుడు వారి సలహాలను పెడచెవిన పెట్టాడు. తన దేహమున్నంతవరకు సీతను రామునికి ఇవ్వనన్న క్రూరుడు, మూర్ఖుడు, అధర్మపరుడు. రామరావణయుద్ధము ఇద్దరు రాజుల మధ్య, ఇద్దరి బలవంతుల మధ్య జరిగినది కాదు. ధర్మానికి - అధర్మానికి, సత్యానికి - అసత్యానికి, మంచికి - చెడుకి మధ్యన జరిగిన యుద్ధం. అధర్మానికి మద్దత్తు తాత్కాలికంగా లభించవచ్చని చివరకు ధర్మమే జయించునని రామాయణం స్పష్టం చేసింది.

రావణుడు మాయల సృష్టికర్త. మాయలు సృష్టించగల సామర్ధ్యమున్నది గనుకనే యుద్ధకాండములో రామలక్ష్మణుల మాయాసృష్టిగావించి వారి శిరస్సులు నరికి వారు చనిపోయారని సీతను నమ్మించి ఆమెను లొంగతీసుకోవటానికి ప్రయత్నించాడు. ఇదంతా మాయ, రావణుని సృష్టి అని "సరమ" సీతకు తెలిపింది.

రావణుడు కోరిన రూపములు ధరించగలిగినవాడు గనుకనే కపట సన్యాసి రూపంలో సీత ఉన్న ఆశ్రమానికి వచ్చి అక్కడ తన నిజ స్వరూపాన్ని బయట పెట్టాడు.

న్యాయాన్యాయవిచక్షణా జ్ఞానం లేనివాడు రావణుడు. కనుకనే ఇంద్రుని భార్యయైన శచీదేవిని ఇబ్బందిపెట్టాడు. రాముని ధర్మపత్నియైన సీతను సన్యాసి రూపములో వచ్చి బలవంతంగా ఎత్తుకెళ్ళాడు. ఆ తరువాత పరస్త్రీలను కామంతో అనుభవించినాడు. ధర్మముచే అర్థమును, అర్థముచే కామమును నియంత్రించాలి. రావణుడు అధర్మపరుడు గనుక ఆ విధముగా చేయలేకపోయాడు.

క్లుప్తంగా చెప్పాలంటే రావణుని పాత్ర సృష్టి ఎందుకు జరిగిందంటే రామాయణం ద్వారా వాల్మీకి మంచికి చెడుకి, ధర్మాధర్మానికి, న్యాయాన్యాయాలకు తేడాని స్పష్టం చేయదలచుకొని రావణ పాత్ర సృష్టి చేశాడు. రావణుని జననము దగ్గరనుండి మరణము వరకు చదువరులకు రావణుని పాత్ర పట్ల సానుభూతి లేదు. రావణ సంహారముతో చెడు అంతమయిందని చదువరులు ఆనందించారు. **పాపానికి ఫలము మరణమనే విషయము బైబిల్ గ్రంథముకంటె ముందుగానే రామాయణం స్పష్టం చేసింది.**

# అధ్యాయము - 9

## అయోధ్య రాజ్యము - రాముని పాలన - రామ రాజ్యము

రాముడు పాలించిన అయోధ్య రాజ్యాన్ని రామరాజ్యమంటారు. రామరాజ్య విశేషాలను, రాముని పాలనాదక్షతను, ఆనాటి ప్రజల స్థితిగతులను, పాలనమీద ప్రజాభిప్రాయాన్ని, పాలకుని పట్ల (రాజుపట్ల) ప్రజల ఆదరాభిమానాన్ని తెలుసుకోవటానికి రామాయణాన్ని చదవాలి.

రాముని పాలనైనా నేటి ప్రజాపాలనైనా ప్రజలందరూ కోరుకునేది ధర్మపాలన, నీతిమంతమైన పాలన. ప్రజలందరూ సుఖశాంతులతో ఉండాలని, పాడిపంటలతో వర్ధిల్లాలని, ఆనందంగా ఉండాలని, పాలకులు ధర్మబద్ధమైన పాలనను సాగించాలని, శాంతి వెల్లివిరియాలని, అసాంఘిక శక్తులను అరికట్టాలని, పాలన సజావుగా సాగాలని ప్రజాబాహుళ్యము కోరుకుంటారు. పాలన బాగా లేకపోతే ప్రజలు అసంతృప్తులు అవుతారు, పాలకులమీద, పాలనమీద వారి గళాన్ని విప్పుతారు, వారి నిరసనలను తెలియజేస్తారు. చివరకు ప్రభుత్వాల మీద తిరుగుబాటు చేస్తారు.

రాముని పాలనలో అయోధ్య నగరమెట్లున్నది? ప్రజలు సుఖసంతోషాలతో సంతృప్తిగా ఉన్నారా? పాలన మీద ప్రజల మనోభావాలు ఎలా ఉన్నాయి? ప్రజాభిప్రాయము గౌరవింపబడుతుందా? - ఇత్యాది ప్రశ్నలకు సమాధానాలను పరిశీలిద్దాము. ఆ ప్రశ్నలకు సమాధానాన్ని పరిశీలించేముందు దశరథుని కాలములో మంత్రులు ఎలా ఉన్నారు? అయోధ్య ప్రజల స్వభావము, స్థితిగతులు ఎలా ఉన్నాయి? - వాటిని పరిశీలిద్దాము.

**అయోధ్య రాజ్యము - మంత్రులు :**

దశరథుని రాజ్యములో సమర్థులయిన మంత్రులు ఉన్నారు.

1) లంచములు తీసుకొనుట మొదలగు దోషములు లేనివారు.

2) వ్యవహార శుద్ధి కలవారు, సమస్త విద్యలు నేర్చినవారు. శాస్త్రజ్ఞానము కలవారు, కీర్తిమంతులు. కార్యములు చేయునపుడు ఏకాగ్ర చిత్తము కలవారు. చిరునవ్వు నవ్వుచూ మాటలాడువారు.

3) కోపము వలనగాని, కామము చేతగాని, ధనము కొరకు గాని వారెన్నడూ అసత్యమాడెడివారు కాదు.

4) ఆ మంత్రులు వ్యవహారదక్షులు. వారు ఎట్టివారికి స్నేహితులుగా ఉన్నారో తెలుసుకొనుటకు ఆ స్నేహితులందరును (రాజు చేత) పరీక్షించబడినవారే.

5) ఆ మంత్రులు తమ కుమారులను కూడ ఆవశ్యకమైనపుడు సరియైన దండమును విధించెడివారు.

6) అపరాధము చేయనిచో శత్రువునైనను హింసించరు.

7) పరిశుద్ధమైన నడవడికగల ఆ మంత్రులందరును ఐకమత్యముతో రాజకార్యములను చక్కబెట్టుచుండెడివారు.

8) ఆ మంత్రులందరును మంచి శీలము కలవారు.

9) సహజముగ ఐశ్వర్యవంతులు, ఆలోచనలను రహస్యముగా ఉంచుటయందును, సూక్ష్మ విషయములను గ్రహించి, నిర్ణయము చేయుటయందును సమర్థులు. నీతి శాస్త్రములో విశేషములన్నియు తెలిసినవారు. ఇతరుల మనస్సులను నొప్పింపని విధమున మాటలాడువారు.

వారిని నేటి మన ప్రభుత్వాల మంత్రివర్గాలతో పోల్చి విజ్ఞులైన పాఠకులు చూడగలరు. (బాలకాండము - 7వ సర్గము)

**బాలకాండము 6వ సర్గములో దశరథుని పాలనలో ఉన్న అయోధ్య ప్రజల స్వభావాన్ని, స్థితిగతులను పరిశీలిద్దాము :**

అయోధ్యపురములో నివసించు నరులందరును సంతోషవంతులు, ధర్మాత్ములు, చక్కగ శాస్త్రాభ్యాసము చేసినవారు. తమకు ఉన్నదానితో తృప్తి చెందినవారు. ఆశ లేనివారు. ఎప్పుడూ సత్యమునే పలుకువారు.

ఆ నగరములో ఎక్కువ ధనమును మాత్రమే సంపాదించినవాడుగాని; ధర్మార్థకామములనెడు పురుషార్థములను సాధించనివాడుగాని, గోసంపద, అశ్వ సంపద, ధనధాన్యములు లేనివాడుగాని అయిన కుటుంబి ఒక్కడును లేడు.

కాముకుడుకాని, లోభికాని, క్రూరుడుకాని, విద్యావిహీనుడుకాని, నాస్తికుడు కాని ఆ అయోధ్యలో వెదకినను కానరాడు. ఆ నగరములోని స్త్రీలు, పురుషులు కూడ ధర్మశీలులు, మంచి ఇంద్రియ నిగ్రహము కలవారు. మంచి స్వభావముతో, మంచి నడవడికతో ఒప్పుచున్నారు. మహర్షులవలె పరిశుద్ధమైనవారు.

ఆ నగరములో కర్ణభూషణములు లేనివాడుగాని, శిరోభూషణము లేనివాడు గాని, పుష్పమాలలు ధరించనివాడుగాని, భోగములతో కొరత ఉన్నవాడుగాని, అభ్యంగన స్నానము చేయనివాడుగాని, శరీరమునకు అంగరాగమును పూసికొననివాడుగాని, మంచి సుగంధ ద్రవ్యములను సేవించని వారుగాని లేడు.

ఆ నగరములో కడుపునిండా తిండిలేనివాడుగాని, దానము చేయనివాడు గాని, బాహుపురులను, కంఠాభరణములను ధరింపనివాడుగాని, ముంజేతికి అలంకారము లేనివాడు గాని, ఇంద్రియ నిగ్రహము లేనివాడు గాని ఒక్కడును కనబడడు.

అయోధ్యలో ఆహితాగ్ని కానివాడు కాని, యాగము చేయనివాడు కాని, నీచుడుకాని, దొంగ కాని, వర్ణ సంకరము చేసినవాడు కాని, ఒక్కడును లేకుండెను. అయోధ్య నగరములో నాలుగు వర్ణములకు చెందిన పురుషులందరును దేవతా పూజలు, అతిథి పూజలు చేయువారు, కృతజ్ఞులు, ఉదారులు, శూరులు, పరాక్రమవంతులు. వారు దీర్ఘాయుర్దాయవంతులై, ఎల్లప్పుడును దారపుత్ర

పౌత్రాదులతో కలిసి ఆనందించెడివారు.

## అయోధ్యకాండము :

అయోధ్య నగరానికి రాజు దశరథ మహారాజు. అతడు వృద్ధుడైనాడు. తన జ్యేష్ఠపుత్రుడైన రాముని రాజుగా చేయాలని మనసులో ఉవ్విళ్ళూరుతున్నాడు. రాముడు అన్ని విధాల రాజ్యపాలనకు తగినవాడని దశరథుడు ఇట్లన్నాడు. "రాముడు ప్రజల అభివృద్ధిని కోరువాడని, సకల ప్రాణులను దయతో చూచువాడని, ప్రజలందరికి తనకంటె గూడ ఎక్కువ ప్రియుడని, పరాక్రమమునందు యమునితో, దేవేంద్రునితో సమానుడని, బుద్ధియందు బృహస్పతితో, ధైర్యమునందు పర్వతునితోను సమానుడని తనకంటెగూడ మంచి గుణములు కలవాడని, తన కుమారుడు భూమినంతను పరిపాలించుచుండగా చూచి స్వర్గము పొందవలెనని" భావించాడు. (అయోధ్య కాండము 1వ సర్గము)

రాముడు ప్రజలను పాలించుటలో మెలకువలు తెలిసినవాడు. ఇంద్రియములను జయించినవాడు. ముల్లోకములను కూడ పాలింప సమర్థుడు. ఇంద్రాది దిక్పాలకులతో సమానుడు అయిన రాముడు ప్రభువు కావలెనని ప్రజలు కోరుచున్నారు. రామునికి పట్టాభిషేకము చేయవలయునని నిర్ణయించిన దశరథ మహారాజు రాజ పురోహితుడైన వశిష్ఠునితోను, తన మంత్రులతోను ఏర్పాట్లు గావించమన్నాడు. ఈ వార్త అయోధ్య నగరమంతా వ్యాపించింది.

రాముని రాజుగా భావించిన అయోధ్య ప్రజల మనోభావాలను, వారి ఉత్సుకతను, సంతోషాన్ని చూద్దాము.

### 1) వీధులందు జనోత్సాహము :

అయోధ్య నగరమందు రాజమార్గములన్నియు కుతూహలముచే గుంపులు గుంపులుగా ఏర్పడిన జనులతో ఇరుకుగా అయినవి. ఆ జన సమూహముల ధ్వని, హర్ష ధ్వని కలియుటచే రాజమార్గములందలి ధ్వని సముద్రఘోషవలె ఉన్నది.

### 2) రామ పట్టాభిషేకమున జనస్పందన :

జనము అన్ని వీధులను తుడిచి నీళ్ళు చల్లారు. వృక్షముల పంక్తులు

ఏర్పరచినారు. ఇండ్లపై ధ్వజములు ఎగురవేసినారు. స్త్రీ, బాల, వృద్ధ సహితముగా అయోధ్య వాసులందరును రామాభిషేకము జరుగవలెనని కోరుచూ సూర్యోదయము ఎప్పుడగునా అని వేచియున్నారు. అయోధ్య నగరములో జరుగుచున్న మహోత్సవము చూచుటకై ప్రజలు ఉవ్విళ్ళూరుచున్నారు.

**3) అయోధ్యలో నృత్య, నాట్య, గానములు :**

అక్కడక్కడ వీధులువెంట నటులు అభినయము చేయుచున్నారు. నర్తకులు నృత్యము చేయుచున్నారు. గాయకులు గానము చేయుచున్నారు. జనులు చతుష్పథములందును, గృహములలోను పరస్పరము రామాభిషేకమునకు సంబంధించిన మాటలు చెప్పుకొనుచున్నారు.

**4) వీధుల అలంకరణ :**

రామాభిషేకము సందర్భమున పౌరులందరును, పుష్పములు చల్లి ధూపములు సుగంధములు వ్యాపింపజేసి రాజమార్గమును శోభాయుక్తంగా అలంకరించారు. వీధులలో దీప వృక్షములను, అనగా వృక్షాకారములో అమర్చిన దీపాలను ఆ రాత్రి ఏర్పాటు చేశారు.

**5) రాముని గురించి ప్రజలు ఈ విధంగా అనుకొనుచున్నారు.**

దశరథుడు తాను వృద్ధుడైన విషయమును గ్రహించి రాముని రాజ్యమునందు అభిషేకించుచున్నాడు. ఇతడు (రాముడు) గొప్ప మనస్సు కలవాడు. జనులలో తారతమ్యములు తెలిసిన రాముడు రాజై చాలా కాలము మనలను రక్షింపగలడనుకొన్నారు.

**6) రాముడు రథమునెక్కి పట్టాభిషేకానికి పోవుచున్నప్పుడు స్త్రీల, ప్రజల స్పందన:**

రాముడు వీధులనుండి వెళ్ళుచున్నప్పుడు చక్కగా అలంకరించుకొని స్త్రీలు మేడల కిటికీల వద్ద నిలబడి నలువైపులనుండి అతనిపై పుష్పములు చల్లారు. భూమిపైనున్న ఉత్తమ స్త్రీలు మంచి మాటలు పలుకుచు రామునికి నమస్కరించారు. అచట గుమిగూడిన పౌరులు మిక్కిలి సంతోషముతో రాముని గురించి ఈ విధముగా

చెప్పుకొనుచున్నారు. "ఈ రాముడు నేడు రాజానుగ్రహమువలన ఈ భూమిని, రాజ్యలక్ష్మిని పొందనున్నాడు. ఇట్టి రాముడు మనకు పాలకుడు కానున్నాడు కాన మన కోరికలన్నియు సఫలము కానున్నవి. ఈ రాముడు రాష్ట్రమునంతను చాలా కాలము పరిపాలింపనున్నాడనునది ప్రజల గొప్ప స్వభావము. ఇతడు రాజైనచో ఎవ్వరును, ఎన్నడును, అప్రియముగా గాని, దుఃఖమునుగాని చూడరు". (అయోధ్య కాండము 16వ సర్గము)

## రాముని పాలన :

రావణ సంహారము తరువాత సీతా సమేతుడై రాముడు లంకనుండి పుష్పక విమానములో సుగ్రీవుడు, విభీషణుడు, అంగదుడు, జాంబవంతుడు, మొదలైన వారితోను, దేవతాగణముతోను అయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుడై పాలన చేశాడు.

రాముని పాలనను, అయోధ్య ప్రజల స్థితిగతులను, రాజ్యపరిస్థితులను పరిశీలిద్దాము.

1) రాముడు పాలించిన కాలములో స్త్రీలు వైధవ్య ముఖమును పొందలేదు.

2) క్రూర జంతువుల వలన భయము కాని, వ్యాధుల వలన భయము కాని లేదు.

3) లోకంలో దొంగలు లేరు.

4) ఎవ్వనికీ కూడ అనర్ధము జరుగలేదు.

5) పెద్దవాళ్ళు, చిన్నవాళ్ళకు ప్రేత కార్యము చేయు అవసరమెన్నడు, ఎక్కడా కలుగలేదు. అంతా ఆనందమయముగానె ఉండెను.

6) ప్రజలందరూ ధర్మపరులైయుండిరి.

7) రాముణ్ణే చూచుచు, అనగా రాముని మనస్సుకు బాధ కలుగును అను అభిప్రాయముతో, లేదా రాముడెక్కడ శిక్షించునో అను అభిప్రాయముతో, ప్రజలు ఒకరినొకరు హింసించుకొనలేదు.

8) రాముడు రాజ్యము చేయుచున్న కాలంలో ప్రజలు వేలకొలది సంవత్సరములు వేలకొలది పుత్రులతో రోగములు లేనివారై యుండిరి.

9) ప్రజలు ఎక్కడ చూచినా రాముడు రాముడు అని ఎల్లప్పుడూ రాముణ్ణి గూర్చి కథలు చెప్పుకొనిరి.

10) రాముడు పాలించిన కాలములో జగత్తు అంతా రామమయము అయిపోయెను.

11) అప్పుడు వృక్షములు ఎట్టి వ్రణములు, అనగా క్రిమికీటకాదుల వలన గాయములు లేక నిత్యము పుష్పఫలములతో నిండి ఉండెను.

12) మేఘము తగిన కాలమునందు వర్షించుచుండెను.

13) వాయువు స్పర్శ సుఖముగా ఉండెను.

14) బ్రాహ్మణులు, వైశ్యులు, క్షత్రియులు, శూద్రులు దురాశ లేక తమ తమ పనులతోనే సంతృప్తి చెందుచు తమ తమ కర్తవ్యములు చేసికొనుచుండిరి.

15) రాముడు రాజ్యము పాలించుచుండగా ప్రజలు ధర్మపరులై అసత్యమనేది లేక నివసించుచుండిరి. ప్రజలందరూ ఉత్తమ లక్షణ సంపన్నులే. అందరూ ధర్మమునందు ఆసక్తి కలవారే. రాముడు ఈ విధముగా పదకొండు వేల సంవత్సరములు రాజ్యము చేశాడు. (యుద్ధకాండము 128 సర్గము)

ఉత్తరకాండము 99వ సర్గములో కూడ రాముని పాలన గురించి పేర్కొన్నాడు వాల్మీకి.

"సుభిక్షముగా ఉండునట్లు మేఘములు కాలమునందు వర్షించుచుండెను. దిక్కులు నిర్మలముగా ఉండెను. నగరములు, గ్రామములు కూడ ఆనందముతో పుష్టిగా ఉన్న జనులతో నిండి ఉండెను. రాముడు రాజ్యము పాలించుచుండగా ఎవ్వనికీ అకాల మరణము రాలేదు. ప్రాణులకు వ్యాధులు లేవు. ఎట్టి అనర్థములూ కలుగలేదు''.

రాముని పాలన త్రేతాయుగములో జరిగినప్పటికి మనం నేటికి రామరాజ్యాన్ని కలవరిస్తున్నాము. ప్రస్తుత పాలనకు రాముని పాలనకున్న తేడాలను పరిశీలిద్దాము :

**1) రాముని పాలనలో స్త్రీలు వైధవ్యమును పొందలేదు.**

నేటి కాలములో స్త్రీలు వైధవ్యముతో పాటు అనేక సమస్యలను ఎదుర్కొంటున్నారు. మానభంగాలు, హత్యలు, ఆత్మహత్యలు, అభద్రతాభావము - ఇవన్నీ స్త్రీలు ఎదుర్కొనే సమస్యలే. అందుకనే ప్రభుత్వము ఒంటరి మహిళలకు జీవితంలో భరోసా కల్పించే భాగంలో పారితోషికాన్ని ఇస్తున్నారు. నిర్భయ చట్టాన్ని తెచ్చి స్త్రీల మీద జరిగే మానభంగాలను అరికట్టడానికి ప్రయత్నిస్తున్నారు. అయినప్పటికీ స్త్రీల మానభంగాలు, హత్యలు జరుగుతూనే ఉన్నాయి. పోలీసు వ్యవస్థ పటిష్ఠంగా పని చేసినప్పటికీ ప్రజలలో నీతి చచ్చింది. నాటికి నేటికి హస్తిమశకమంత తేడా ఉన్నది.

**2) రాముని పాలనలో క్రూర జంతువుల వలన భయముగాని వ్యాధుల వలన భయము గాని లేదు.**

నేటి కాలములో క్రూరజంతువుల వల్ల కొన్ని ప్రాంతాల్లోనే భయమున్నది. వ్యాధులవలన దేశవ్యాప్తంగా భయమున్నది. ప్రజలు అంతు తెలియని వ్యాధుల బారిన పడి అకాల మరణాలు కూడా సంభవిస్తున్నాయి. ప్రభుత్వం వారు ఉచిత ఆరోగ్య పథకాలు ప్రవేశపెట్టినప్పటికీ ప్రైవేటు ఆసుపత్రులు రోగులతో కిటకిటలాడుతున్నాయి. వైద్యం ఖరీదు ఎక్కువయింది (పెరిగింది).

**3) రాముని పాలనలో లోకంలో దొంగలు లేరు.**

ప్రస్తుత కాలంలో చోర భయము అధికంగానే ఉన్నదని చెప్పాలి. ఇంటికి తాళము వేసి ఊరికి వెళ్ళి ఒకటి రెండు రోజులు రాకపోతే అటువంటి ఇండ్లలో దొంగలు పడుతున్నారు. డబ్బు, బంగారాన్ని తస్కరిస్తున్నారు. బజారులోకాని, ఇంటి ముందు కాని తాళాలు వేసిన కార్లుకాని, ద్విచక్రవాహనాలు కూడా దొంగతనానికి గురవుతున్నాయి.

**4) రాముని కాలములో ఎవ్వనికీ అనర్థము జరుగలేదు.**

నేటి కాలములో అకాలమరణాలు, ఆకస్మిక జబ్బులు, ప్రమాదాలు, ప్రకృతి వైపరీత్యాలు జరుగుతున్నాయి.

**5) పెద్దవాళ్ళు, చిన్న వాళ్ళకు ప్రేతకార్యములు చేయు అవసరము రాముని కాలములో ఏర్పడలేదు.**

ప్రస్తుతకాలంలో చిన్న వయసువారే అనేక అనారోగ్య కారణాల వల్ల, హృద్రోగాల వల్ల మరణిస్తున్నారు. తండ్రి బ్రతికి ఉండగానే కుమారుడు మరణిస్తే ఆ తండ్రి వేదన వర్ణనాతీతము.

**6) రాముని కాలంలో ప్రజలందరూ ధర్మపరులై ఉండిరి.**

నేటి కాలములో అధికభాగము ప్రజలు అధర్మపరులుగా ఉన్నారని ప్రజలే చెప్పుకొనుచున్నారు. ఇది నిర్వివాదాంశము.

**7) రాముని కాలములో హింసలు లేవు. ప్రజలలో కొట్లాటలు, తగాదాలు లేవు.**

నేటి కాలంలో హింస అధికమైంది. ప్రజలు చిన్న చిన్న విషయాలకే సహనము కోల్పోయి కొట్లాటకు, తగాదాలకు దిగుతున్నారు.

**8) ప్రజలు ఎక్కువ కాలము బ్రతికారు.**

నేడు జీవన ప్రమాణము పెరిగినా వ్యాధుల బారిన పడి 90, 100 సంవత్సరాలు బ్రతికేవారి సంఖ్య అతి స్వల్పంగా ఉన్నది.

**9) వృక్షములకు క్రిమికీటాదులు, తెగుళ్ళు లేక అధిక ఫలములు ఇచ్చుచుండెడివి.**

నేడు మనం తినే ఆహార పదార్థాలన్నీ పురుగు మందులు వాడి పండించేవే. కూరగాయలు, పండ్లు అన్నింటికి పురుగుమందు వాడాల్సిందే.

**10) రాముని కాలములో సకాలములో వర్షాలు పడి పాడిపంటలు సమృద్ధిగా పండేవి.**

నేటి కాలములో అతివృష్టి, అనావృష్టి, అకాల వర్షాలతో వ్యవసాయదారులు ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. నీటి సమస్య అతి ముఖ్యమైన ప్రజల సమస్యగా మారింది.

**11) అన్ని కులముల వారు వారి వారి పనులయందు నిమగ్నమై వారి వారి ఆదాయాలతో తృప్తిగా జీవించేవారు.**

నేటి జీవితములో కనబడంది, కరువయింది తృప్తి మాత్రమే. కష్టించి పనిచేసే తత్త్వము అందరిలో సన్నగిల్లింది (తగ్గిపోయింది).

**12) రాముని పాలనలో ప్రజలు ధర్మపరులై అసత్యము లేక నివసించారు.**

నేటికాలములో ధర్మమనే పదం వింతగా ఉంటుందేమో! అసత్యానికి ఆదరణ అధికంగా ఉన్నది.

**13) రాముని కాలంలో వాయువు స్పర్శ సుఖముగా ఉన్నది.**

నేటి కాలములో అనేక కారణాల వల్ల స్వచ్ఛమైన గాలి కొరతగానుంది.

ఇక్కడొక విషయము మనము గుర్తుంచుకోవాలి. "యధారాజా తథా ప్రజ" అనేది నానుడి. రాముడు సత్యధర్మాలయందు ఆసక్తి కలవాడు కనుకనే ప్రజలు కూడా సత్యధర్మాలను రాముని పాలనలో పాటించారు. పాలకులు అసత్యాన్ని ఆరాధించేవారు, అధర్మాన్ని ఆచరించేవారైతే ప్రజలు తప్పకుండ పాలకులనే అనుసరిస్తారు.

**రాముని పాలనపై ప్రజల మనోభావాలను పరిశీలిద్దాము :**

రాముడు తాను ధనప్రధానుడను కానని అయోధ్య కాండము 19వ సర్గములో చెప్పాడు.

అరణ్యావాసానికి వెళ్ళేముందు కైకేయి గృహానికి వెళ్ళి ఆమెతో మాట్లాడే సందర్భములో "దేవీ! నేను ధన ప్రధానుడను కాను. లోకమర్యాదను అనుసరించవలెనని మాత్రమే కోరుచున్నాను. కేవలము ధర్మము అవలంబించిన నేను ఋషితుల్యుడనని తెలుసుకొనుము" అన్నాడు. దీనిని బట్టి రాముడు ధర్మనిరతుడని తెలియుచున్నది. రాముని పాలన కూడా ధర్మబద్ధమైనదే.

1) రాముడు అరణ్యావాసమునకు బయలుదేరినప్పుడు జనులందరును ప్రాసాదముల (రాజదేవతా గృహములను), ధనికుల గృహములను, ఏడంతస్తుల మేడల శిఖరములనుండి దుఃఖించుచు చూచుచుండిరి. అసంఖ్యాకులైన జనులతో నిండిన వీధులు నడచుటకు శక్యము కాకుండెను. అందుచే దుఃఖాక్రాంతులైన ప్రజలు,

ప్రాసాదములను ఎక్కి, రాముని చూచుచుండిరి. (అయోధ్య కాండము 33వ సర్గము)

2) "రాముడు వనమునకు వెళ్ళుచున్నాడు గాన ఆ వనమే నగరమగు గాక మనము విడిది చేసిన ఈ నగరమే వనమగుగాక అని ప్రజలు అన్నారు. (అయోధ్యకాండము 33వ సర్గము)

3) రాముడు అరణ్యావాసానికి వెళ్ళేటప్పుడు ద్విజులు అగ్ని హోమములను చేయలేదు. గృహస్థులు ఇండ్లలో వంటలు వండలేదు. ప్రజలు తమ విధులు చేయలేదు. సూర్యుడు కూడా కనబడకుండా పోయాడు. తొలిసారిగా కుమారులు పుట్టినను తల్లి అందుకు సంతోషించలేదు. (అయోధ్య కాండము 41వ సర్గము)

**4) దుఃఖించుచున్న ప్రజలకు రాముడు ఇచ్చిన సందేశాన్ని పరిశీలిద్దాము :**

"అయోధ్య నివాసులైన మీరందరును నాపై మీకు గల ప్రేమ గౌరవమును, భరతునిపై చూపుడు. అట్లు చేసినచో నాకు అధికముగా సంతోషము కలుగును". (అయోధ్యకాండము 45వ సర్గము)

అరణ్యావాసమునకు రాముని వెంబడించిన ప్రజలను వదలి తెల్లవారకముందే రాముడు గంగానదిని దాటి వెళ్ళాడు. అప్పుడు ప్రజల మనోభావాలు ఈ విధముగా ఉన్నాయి.

"మహాబాహువైన ఆ రామునకు చేసిన సేవ ఎన్నడును వ్యర్థము కాదు. అట్టి రాముడు తన భక్తుల నమ్మకములను విడచి ఎట్లు దూరముగా వెళ్ళిపోయినాడు? తండ్రి ఔరసులయిన తన కుమారులను పాలించునట్లు రాముడు మనలను సర్వదా పాలించుచుండెడివాడు. అట్టి రాముడు మనలను విడచి అరణ్యమునకు ఎట్లు వెళ్ళాడు? మనమందరము ఇక్కడే మరణించెదము... రాముని లేని జీవితము వ్యర్థము".

పై వాక్యాలను పరిశీలిస్తే రాముని కోసం అనగా పాలకుని కోసం ప్రాణ త్యాగానికి సిద్ధపడ్డారు అయోధ్య ప్రజలు. రాముడు లేని జీవితము వ్యర్థమని వాపోయారు. ఇది పాలకునిపై ప్రజల అద్భుత స్పందన.

(అయోధ్య కాండము 47వ సర్గము)

## 6) రాముడు ఇంక కనబడడని ప్రజలు దుఃఖించిన తీరు చూద్దాము.

"దాన యజ్ఞ వివాహోదులలందును, గొప్ప గొప్ప సమాజములందును, మనము రాముని చూచుచెండెడివారము. రాముడు తండ్రివలె "ఈ జనమునకు ఏది తగినది? ఏది ప్రియమైనది? ఏది వీరికి సుఖము కలిగించును?" అని పర్యాలోచించి ఈ నగరమును పాలించుచుండెడివాడు. ఇపుడాతడు మరి ఎన్నడును మనకు కనబడడు" అని పౌరులు దుఃఖించారు. (అయోధ్య కాండము 57వ సర్గము)

## రాముడు లేని భరతునికి కనిపించిన అయోధ్య :

ఏడు దినములు ప్రయాణం చేసి మేనమామ ఇంటినుండి అయోధ్య నగరమునకు వచ్చిన భరతుడు అయోధ్య నగరమును చూచి తన సారథితో అన్న మాటలను పరిశీలిద్దాము. "సారథీ! పుణ్యమైన ఉద్యానవనములతో ఒప్పుచు, మంచి కీర్తిని కలిగిన ఈ అయోధ్య నగరము నాకు దూరమునుండి అస్పష్టముగా కనబడుచున్నది. ఆ ఉద్యానవనములే ఇప్పుడు కాముకులు విడిచిపెట్టుటచే ఏడ్చుచున్నట్లున్నవి. సారథీ! అయోధ్య నగరము నాకిపుడు అరణ్యము వలె కనిపించు చున్నది. (అయోధ్య కాండము 71వ సర్గము)

భరతుని మాటలు పరిశీలించిన రాముడు లేని అయోధ్య రాజ్యము కళావిహీనంగా ఉన్నదనే విషయము స్పష్టమగుచున్నది.

రాముడు రాజ్యపాలనలో మెలకువలు తెలిసినవాడు, మంచి పాలకుడు. అయోధ్య కాండము 100వ సర్గములో రాముడు భరతునికి ఉపదేశించిన రాజనీతి ద్వారా ఈ విషయాన్ని చదువరులు గ్రహించగలుగుతారు. మహాభారతంలో భీష్ముడు ధర్మరాజుకి రాజధర్మాలను చెప్పాడు. రామాయణంలో రాముడు భరతునికి రాజనీతిని చెప్పాడు.

రాముడు భరతునికి ఉపదేశించిన రాజనీతిని పరిశీలిద్దాము. ఈ పరిశీలన ద్వారా రామునికి రాజ్యపాలనయందు ఎంత అవగాహన ఉన్నదో మనకు అర్థమవుతుంది.

1) రాజ్యపాలనయందు రాజుతోపాటు మంత్రులూ ఉంటారు. ఎటువంటివారిని మంత్రులుగా నియమించాలో రాముడు భరతునికి ఉపదేశించాడు. శూరులు, విద్యావంతులు, జితేంద్రియులు, ఉత్తమ కులమునందు పుట్టినవారు, మనస్సులోని భావములను తెలుసుకోగలిగిన వారినే మంత్రులుగా నియమించాలన్నాడు.

2) రాజు నిద్రకు వశుడు కాకూడదు. తన కాలమునందే మేల్కొనాలి. వివిధ కార్యముల సామర్ధ్యమును గూర్చి తెల్లవారురఝామునందే ఆలోచించాలి. రాజు ఒక్కడే ఆలోచించకూడదు. మంత్రులతో కలిసి ఆలోచించాలి. రాజు నిర్ణయాలు రాజ్యములోని వారికందరికిని తెలియకూడదు. స్వల్పమైన ప్రయత్నములతో ఎక్కువ ఫలములు సాధింపగలిగిన కార్యమును నిశ్చయించి ఆలస్యము చేయకుండగ వెంటనే దానిని ప్రారంభించాలి.

3) అధికారవాంఛతో రాజు అంతరంగిక సేవకులలో భేదము కలిగించుటకు ఎవరైనా ప్రయత్నించినచో రాజు అట్టివారిని వధించవలెను. అట్లు చేయనిచో అతడే నశించును.

4) తృప్తి కలవానిని, శూరుడు బుద్ధిమంతుడైనవానిని, ధైర్యము, నిజాయితీ కలవాడు, ఉత్తమకుల సంజాతుడు, రాజభక్తి కలవాడిని సేనాపతిగా నియమించాలి. బుద్ధిమంతులు, యుద్ధములో నేర్పుగలవారిని, వీరులను సత్కరించి గౌరవించాలి. సైన్యమునకు ఇవ్వదగిన ఆహారమును, యథోచితమైన జీతమును ఆలస్యము చేయకుండ తగు సమయములో ఇవ్వాలన్నాడు. ఆహారము, వేతనము అందవలసిన కాలములో అందకపోయనచో భృత్యులు రాజు విషయమున కోపించి అతనికి విరుద్ధముగా ప్రవర్తించెదరు. దీనివలన గొప్ప అనర్థము జరుగును.

5) స్వదేశములో పుట్టినవారు, విషయములు తెలిసినవారు, సమర్థుడు, సమయస్ఫూర్తి గలవాడు, చెప్పిన సమయమున ఉన్నది ఉన్నట్లు చెప్పువాడు, పండితుడు అయిన పురుషుని దూతగా నియమించాలి.

6) గూఢచారులను నియమించి వారి ద్వారా విషయములు తెలుసుకోవాలి. శత్రువుల యెడ జాగ్రత్త వహించాలి.

7) దేశరక్షణ విషయమున తగు జాగ్రత్తలు పాటించాలి.

8) వ్యవసాయము, గోరక్షణపై ఆధారపడి జీవించు వారందరి ఆపదలను రాజు తొలగించి పోషించాలన్నాడు. ఎందుచేతననగా రాజు దేశములోని ప్రజలనందరిని ధర్మముతో రక్షించాలన్నాడు.

9) స్త్రీలతో మంచి మాటలాడుచు వారిని రక్షించాలన్నాడు. వారికి రహస్యములు చెప్పకూడదన్నాడు.

10) రాజు ప్రజాదర్బారును ప్రతిరోజు నిర్వహించాలి. ప్రతి రోజు రాజు ప్రజా సమస్యలు వినాలన్నాడు. రాజు క్రింద పనిచేయువారు రాజుని చూచి మిక్కిలి భయపడకూడదని, భయము చేత వారందరు దూరముగా ఉండకూడదని, ఈ రెండుగాక మధ్యమార్గమును అవలంబించుట మంచిదన్నాడు.

11) దుర్గములన్నింటిలోను ధనధాన్యములు, ఆయుధములు, ఉదకము, యంత్రములు, శిల్పులు, ధనుర్ధరులు కావలసినంతగా ఉండాలన్నారు.

12) ఆదాయము అధికముగానుండి వ్యయము చాలా తక్కువగా ఉండాలన్నారు. ప్రభుత్వ ధనము అపాత్రుల చేతులలోనికి వెళ్ళిపోకూడదన్నాడు.

13) చోరులను వదలివేయకూడదు, వారిని కఠినంగా శిక్షించాలన్నాడు.

14) మంత్రులు ధనికులకు కష్టమువచ్చినపుడు, దరిద్రునకు కష్టము వచ్చినపుడును, ఇతడు ధనికుడు, ఇతడు దరిద్రుడు అను పక్షపాత బుద్ధి లేక వ్యవహార నిర్ణయము చేయాలన్నాడు.

15) రాజు తనకిష్టమొచ్చిన శాసనములు చేసి ఎవరిపైనా లేని అపరాధమును మోపి శిక్షింపకూడదన్నాడు. ఆ విధముగా శిక్షించినచో అతడు కార్చిన కన్నీళ్ళు ఆ రాజు పుత్రపశ్వాదులను నశింపజేయునన్నాడు.

16) వృద్ధులను, బాలురను, ఉత్తములైన పండితులను దానము, మనస్సు, వాక్కు అను మూడింటిచే వశము చేసికొనుటకు ప్రయత్నించాలన్నాడు.

17) గురువులకు, వృద్ధులకు, మునులకు, దేవతలకు, చైత్యములకు, కృతార్థ బ్రాహ్మణులకు నమస్కారము చేయాలన్నాడు.

18) రాజు అర్థము చేత ధర్మము గాని, ధర్మము చేత అర్థమును కాని, అధిక సూఖాసక్తుడై, కామము చేత ధర్మార్థములను బాధించకూడదన్నాడు.

19) రాజైనవాడు పదునాలుగు దోషాలను జయించాలన్నాడు. అవి ఈ విధముగా ఉన్నాయి.

i) నాస్తికత్వము, ii) అసత్యము, iii) క్రోధము, iv) ఏమరుపాటు, v) ఏ కార్యముల విషయమునను, నిర్ణయము తీసికొనకుండా దీర్ఘాలోచన చేయుటము, vi) జ్ఞానవంతులను నిర్లక్ష్యము చేయుట, vii) సోమరితనము, viii) ఇంద్రియములకు వశుడగుట, ix) మంత్రులెందుకని తానొక్కడే ఆలోచన చేయుట, x) విషయము అర్థముగాని వారితో ఆలోచనలు చేయుట xi) నిర్ణయించిన కార్యములను ప్రారంభించక పోవుట, xii) ఆలోచనలను రహస్యముగా ఉంచకపోవుట, xiii)మంగళకరమైన పనులను చేయకపోవుట, xiv)చాలామంది శత్రువులను ఒకే కాలమునందు ఎదిరించుట.

పైన పేర్కొన్న దోషాలన్నీ జయించి రాజ్యపాలన చేస్తే పాలన బాగుంటుందని రాముని అభిప్రాయము. పాలనపై రామునికున్న అభిప్రాయము శ్లాఘనీయమైనది, సర్వజనామోదనీయము.

## రామరాజ్యపాలనలో ప్రజాభిప్రాయ సేకరణ :

ప్రజాపరిపాలనలో కాని, రాజుల పాలనలోకాని పాలకుడైనవాడు ప్రతి దినము ప్రజలకు దర్శనమిచ్చి వారి సాధక బాధలను, సమస్యలను, విన్నపాలను వినాలి. కొంత సమయాన్ని ప్రజా సమస్యల పరిష్కారానికి కేటాయించాలి. దీనినే ప్రజా దర్బారు అని కూడా పిలుస్తారు. రాముడు తన పాలనలో ప్రతి దినము ఈ ప్రజా దర్బారును నిర్వహించి ప్రజా సమస్యలు విని పరిష్కరించేవాడు. పాలన మీద ప్రజాభిప్రాయాన్ని తెలుసుకొని, దానిని గౌరవించి నడుచుకొనేవాడు. నేటి ప్రభుత్వాలు కొన్ని సందర్భాలలో ప్రజాసమస్యల గోడు వినరు. వారు ప్రభుత్వాల మీద తమ నిరసన గళాలను వినిపిస్తుంటారు. ఇది రామరాజ్యంలో లేదు. రాముని పాలనలో ఒక రోజు దుర్వాసుడు వచ్చాడు. అతడు శపిస్తాడని భావించి లక్ష్మణుడు ముందస్తు

అనుమతి కోరకుండానే దుర్వాసుణ్ణి రాముని వద్దకు పంపగా అతడు లక్ష్మణునిపై కోపించి అతనిని వదలివేశాడు. ఇది రాముని నిజాయితి.

రావణ సంహారము తరువాత అయోధ్యకు వచ్చిన రామునికి పట్టాభిషేకము జరిగి రాజయ్యాడు. రాముని పాలనలో ప్రజాభిప్రాయానికి పెద్దపీట వేశాడు. రాముని పాలనలో రామునితో హాస్యపూర్వకములైన మాటలు చెప్పువారిలో విజయుడు, ధుమత్తుడు, కాశ్యపుడు, మంగలుడు, కులుడు, సురాజి, కాలియుడు, భద్రుడు, సమాగధుడు తదితరులున్నారు. ఒకరోజు రాముడు నగరములోను, దేశములోను రామలక్ష్మణ భరత కైకేయిలను గూర్చి, కొత్తగా రాజుగా వచ్చిన తనను గూర్చి ప్రజాభిప్రాయాన్ని భద్రుడిని అడిగాడు. అందుకు భద్రుడు రావణుడుని చంపినందుకు ప్రజలు మెచ్చుకుంటున్నారని, కాని రావణుని ఒడిలో కూర్చున్న సీతను ఆదరించినందుకు భిన్నంగా మాట్లాడుకుంటున్నారని ప్రజలు వారి భార్యల విషయమునందు కూడా వారు సహింపవలసి ఉండును కదా అన్నాడు. రాజు ఎట్లు చేయునో ప్రజలు కూడా అట్లే అతనిని అనుసరించి ప్రవర్తించవచ్చు కదా అని అనుకొనుచున్నారని రామునికి వివరించాడు. ఆ తరువాత రాముడు లోకాపవాదాన్ని గూర్చి తన తమ్ములతో చర్చించి సీతను వాల్మీకి ఆశ్రమానికి పంపాడు. సీత అగ్ని ప్రవేశము చేయగా వాల్మీకితో సహా దేవతలందరూ సీతను మెచ్చుకొని ఈమె మహా పతివ్రత అన్నారు.

ఇక్కడ ముఖ్యమైన విషయము ప్రజాభిప్రాయ సేకరణ తరువాతే రాముడు సీతను అగ్నిప్రవేశము చేయించాడు. తన వంశ ప్రతిష్ఠతో పాటు రాజ్యప్రతిష్ఠను, పౌరుల ప్రతిష్ఠను కాపాడిన పాలనాదక్షుడు రాముడు.

రాముడు నిత్యము ప్రజలతో మమేకమై ఉండేవాడు. కాల పురుషుడు రాముని వద్దకు వచ్చి సమయము అయిపోయినది అని తెలుపగా, ఆ విషయము తనకు తెలుసని తన చుట్టూ ఉన్న ప్రజలను కూడా తనతో పాటు పరంధామానికి తీసుకువెళ్ళిన ప్రజానాయకుడు రాముడు.

# అధ్యాయము - 10

## రామాయణం - మానవ సంబంధాలు

త్రేతాయుగమైనా, ద్వాపర యుగమైనా, కలియుగమైనా మానవ జీవితంలో మానవ సంబంధాల పాత్ర అద్భుతమైనది, చాలా అవసరమైంది. జీవితములో ఒక గొప్ప కార్యాన్ని సాధించటానికి ఎంత గొప్పవాడైనా, బలవంతుడైనా, ఒక వ్యక్తి శక్తియుక్తులు చాలవు. అందుకు అనేకమంది స్నేహము, మానవ సంబంధాలు, సహాయము కావాలి. అందరూ కలసి సాధించాలి. ఇందుకు మానవ సంబంధాల పాత్ర ఎనలేనిది, అమూల్యమైనది. రామాయణంలో మానవ సంబంధాలు విస్తారంగా ఉన్నాయి. అవి తెలుసుకోవటానికి రామాయణం చదవాలి.

రామాయణంలో మానవ సంబంధాలు బలంగా ఉన్నాయి. రామలక్ష్మణులు రావణ సంహారము చేసి సీతను లంకా నగరమునుండి అయోధ్యనగరానికి తీసుకురావటములో మానవ సంబంధాల పాత్ర మరువలేనిది. సరైన మానవ సంబంధాలు లేకపోతే, కొనసాగించకపోతే రామలక్ష్మణులు రావణ సంహారము చేయుటలో, సీతను లంకానగరమునుండి అయోధ్య నగరానికి తేవటము విజయవంతమై ఉండేది కాదేమో! ప్రస్తుతము లోకంలో మానవ సంబంధాలు బలహీనపడి మానవ సంబంధాలకంటె వ్యాపార సంబంధాలు బలంగా ఉన్నాయి. దీనికి కారణము ధర్మము, న్యాయము, సత్యము లోపించటమే! మరొక రకంగా చెప్పాలంటె స్వార్ధగుణము మానవులలో అధికస్థాయిలో ఉండటమే!

రామాయణ కాలంలో ఉన్న ప్రజలు ధర్మపరులు, సత్యసంధులు, మానవ విలువలకు అధిక ప్రాధాన్యమిచ్చేవారు. వారు నిస్వార్ధపరులు గనుకనే మానవ సంబంధాలు బలహీనపడలేదు, బలంగా ఉన్నాయి.

దశరథ మహారాజు దగ్గరనుండి రామునివరకు ఆ కుటుంబంలో మానవీయ విలువలు, మానవ సంబంధాలు పటిష్ఠంగా ఉన్నాయి. ఒక్క కైకేయి విషయములో మాత్రము మానవ సంబంధాలు మంథర మాటలు విని బలహీనపడ్డాయి. రామాయణంలో రాముడు, సుగ్రీవుడు, లక్ష్మణుడు, హనుమంతుడు, విభీషణుడు, రావణుడు - వీరందరూ మానవసంబంధాలు నిర్వహించి కొనసాగించినవారే.

**దశరథుడు రాముని మధ్య ఉన్న మానవ సంబంధాన్ని పరిశీలిద్దాము.**

రామ పట్టాభిషేకాన్ని దశరథ మహారాజు ప్రకటించిన తరువాత కైకేయి పట్టుబట్టి తనకిచ్చిన వరములను నిజము చేసి భరతునికి రాజ్య పట్టాభిషేకము చేయవలసిందిగా కోరిన సందర్భములో దశరథుడు కైకేయి అంతఃపురమునకు వెళ్ళి ఆమెను బ్రతిమాలిన తీరును పరిశీలిస్తే దశరథునికి రాముని మీద ఉన్న అనుబంధం, ప్రేమాభిమానాలు, గౌరవము మనకు అర్థమవుతాయి.

అయోధ్యకాండము 12వ సర్గములో దశరథుడు కైకేయితో "రాముడు లేనిచో నాకు జీవితము లేదు... దేవీ! నాకు అహితమైన ఈ కార్యము చేయవద్దు. నీ కాళ్ళు కూడా పట్టుకొనెదను. నన్ను అనుగ్రహింపుము...". అతడు తన పాదాలు ఎక్కడ స్పృశించునో అని కైకేయి తన పాదములు దూరముగా జరిపెను. ఆమె పాదములు చేరకుండగనే రాజు రోగగ్రస్తునివలె నేల మీద పడిపోయెను.

దీనిని బట్టి మానవ సంబంధ బలాన్ని, శక్తిని రాముని మీద దశరథుడు ప్రదర్శించిన ప్రేమాభిమానాల తీరు రామునికి తెలియదు.

బలాత్కారముగా రాజ్యాన్ని చేజిక్కించుకుందామని లక్ష్మణుడు ఇచ్చిన సలహాను రాముడు త్రోసిపుచ్చాడు. దీనిని బట్టి దశరథుని మీద, భరతుని మీద రామునికున్న సంబంధము, ప్రేమ, ఆదరము విదితమగుచున్నవి. (అయోధ్య కాండము 21వ సర్గము)

అయోధ్యకాండము 39 సర్గములో దశరథ మహారాజు రామ పట్టాభిషేకాన్ని కైకేయి అడ్డుకున్నందుకు బహుగా దుఃఖించి పశ్చాత్తాపపడ్డాడు. ఇది కేవలము రామ సంబంధము వలెనే జరిగింది.

యుద్ధకాండములో ఇంద్రజిత్తు మాయా సీతను సృష్టించి ఆమె తల నరికి సీత చనిపోయినదనే వార్త వ్యాపింపచేయగా రామలక్ష్మణులు దుఃఖించారు. విభీషణుడు అది ఇంద్రజిత్తు మాయ, సీత చనిపోలేదని తెలియజేశాడు. సీతతో వారికున్న సంబంధము ఇది.

రావణుడు మాయా రామలక్ష్మణులను సృష్టించి, రామలక్ష్మణులు చనిపోయారని వారి శవాలను సీతకు చూపించగా ఆమె విలపించింది. "సరమ" సీతకు వారు చనిపోలేదని తెలియజేసింది. ఇవన్నీ మానవసంబంధాలే!

రాముడు అరణ్యావాసానికి వెళ్ళే క్రమంలో గంగానది దగ్గరకు వెళ్ళేవరకు సూర్యుడు అస్తమించాడు. అక్కడ నివసించే నిషాదరాజైన "గుహుడు" రామునికి ఆ రాత్రి ఆశ్రయమిచ్చి ఆతిథ్యమిచ్చాడు. రాముడు నిద్రకుపక్రమించగా రాత్రంగా గుహుడు లక్ష్మణునితో పాటు రామునికి కాపలాదారుడిగా ఉన్నాడు. గుహుని చర్య మానవ సంబంధమే!

రాముడు దండకారణ్యము చేరిన తరువాత దండకారణ్యములో నివసించే మునులందరు అతనిని సత్కరించారు. అక్కడున్న మునులు, ఋషులతో రాముడు మానవ సంబంధాలు కొనసాగించి ఋషుల ఆశ్రమాలు దర్శించాడు. (అరణ్యకాండము)

**రాముడు దర్శించిన ఆశ్రమాలను పరిశీలిద్దాము :**

దండకారణ్యము వెళ్ళిన తరువాత రాముడు "శరభంగ ముని" ఆశ్రమాన్ని దర్శించాడు. అక్కడ త్రిలోకాధిపతియైన ఇంద్రుని చూచాడు. ఆ దేవేంద్రునికి దగ్గరగా ఆకాశము మీద, ఆకుపచ్చని అశ్వములు కట్టిన రథాన్ని చూచాడు. బ్రహ్మలోకానికి ఆ మునిని తీసుకుపోవటానికి స్వయంగా ఇంద్రుడే వచ్చాడని రామునికి "శరభంగ ముని" చెప్పాడు. (అరణ్యకాండము 5వ సర్గము)

మానవ సంబంధాలు కొనసాగించే క్రమంలో రాముడు "సుతీక్ష్ణ మహర్షి" ఆశ్రమాన్ని దర్శించి ఆ రాత్రికి అక్కడే బస చేశాడు. (అరణ్యకాండము 8వ సర్గము)

ఆ తరువాత రాముడు "అగస్త్యాశ్రమాన్ని" దర్శించాడు. అగస్త్యుడు రామునికి

దివ్యాస్త్రములిచ్చాడు. (అవి బాణములు, ఖడ్గము). అగస్త్యుని ఆదేశానుసారము రాముడు "పంచవటి"ని చేరి పర్ణశాలను నిర్మించుకొని అందులో నివసించాడు. పంచవటిలో రాముడు జటాయువును కలిశాడు. జటయువుతో సంబంధాలు ఉన్నందునే సీతాపహరణము జరిగినపుడు రావణునితో జటాయువు యుద్ధము చేసి మరణించాడు. అగస్త్యునితో మానవసంబంధాలు కొనసాగించనందువల్లే రావణ సంహారము తరువాత సీతతో అయోధ్య నగరానికి బయలుదేరినపుడు మార్గమధ్యములో పుష్పక విమానాన్ని ఆపి అగస్త్యాశ్రమాన్ని దర్శించాడు.

సీతారాములు అత్రి ముని ఆశ్రమాన్ని దర్శించారు. అత్రి ముని భార్య అనసూయ సీతను గౌరవించి సత్కరించింది. ఆమెకు బహుమానము ఇచ్చింది. సీత ఆమెకు తన జన్మ వృత్తాంతాన్ని తెలిపింది.

భరద్వాజ ముని ఆశ్రమాన్ని కూడా రాముడు దర్శించాడు. ఈ విధంగా మహర్షులందరితో రాముడు సత్సంబంధాలు నెలకొల్పాడు. ఇవన్నీ మానవ సంబంధాలే!

కబంధుడు రామలక్ష్మణులను బంధించినపుడు అతని రెక్కలు (భుజములు) తెగనరికారు వారు. అయినప్పటికీ కబంధుడు సీతాన్వేషణ ఉపాయమును రామునితో చెప్పి సుగ్రీవునితో స్నేహము చేయమని సలహా ఇచ్చాడు.

కిష్కింధకాండములో రాముడు నిర్వహించిన మానవ సంబంధాలు అద్భుతమైనవి. వానర రాజైన సుగ్రీవునితో, అతని మంత్రులైన హనుమంతుడు, అంగదుడు, జాంబవంతుడు, నీలుడు మొదలగువారితో, వానరులతో రామలక్ష్మణులు నిర్వహించి, కొనసాగించిన మానవ సంబంధాలు రామునికి ఎనలేని మేలు చేశాయి. వారి సహాయముతోనే సీతాన్వేషణ జరిగింది. సముద్రముపై సేతువు నిర్మాణము జరిగింది. వానర సైన్యంతో సేతువు నిర్మాణం ద్వారా రామలక్ష్మణ సుగ్రీవాదులు లంకను చేరగలిగారు. సుగ్రీవునితో, అతని మంత్రులతో, వానర సైన్యముతో బలమైన మానవ సంబంధాలు లేకపోతే సీతాన్వేషణ రామలక్ష్మణులకు సాధ్యమయ్యేది కాదు.

సీతాన్వేషణలో భాగంగా రామలక్ష్మణులు ధనుర్ధరులై ఋష్యమూక పర్వతానికి వచ్చారు. వారి రాకను గురించి తెలుసుకొని, రాజ్యబహిష్కృతుడైన సుగ్రీవుడు తన మంత్రులతో ఆ పర్వతముల మీద నివసిస్తూ వారిని గూర్చి భయపడి, వాలి పంపించాడేమో అన్న అనుమానంతో తన మంత్రియైన హనుమంతుని గూఢచారిగా వారి వద్దకు పంపించి వారి సమాచారాన్ని రాబట్టాడు. హనుమంతుడు తన వాక్చాతుర్యముతో వారిని కొన్ని ప్రశ్నలడిగి, వారి హావభావాల వల్ల వారిని గూర్చి ఒక అవగాహనకు వచ్చి సుగ్రీవునితో మైత్రి వారికి లాభించగలదని రాయబారము నడిపి వారిని ఏకంగా సుగ్రీవుని వద్దకు వెంటపెట్టుకొనివచ్చాడు.

సుగ్రీవుడు వారికి నమస్కరించి తన వృత్తాంతాన్ని వారికి విన్నవించాడు. లక్ష్మణుడు సీతాన్వేషణ విషయమున సుగ్రీవుని సహాయము కోరగా అందుకు సుగ్రీవుడు అంగీకరించి సీత ముల్లోకాల్లో ఎక్కడ ఉన్నా వెదికి రామునికి అప్పగిస్తానన్నాడు. అందుకు రాముడు సంతోషించాడు. సీతను రావణుడు ఎత్తుకెళ్ళేటప్పుడు ఆమె రావణుని ఒడిలో కూర్చొని "హా రామా! హా లక్ష్మణా!!" అని అరవటము తాను విన్నానన్నాడు సుగ్రీవుడు. తన గుహలో దాచిన సీత వస్త్రమును, ఆభరణములను రామలక్ష్మణులకు చూపించాడు. ఆమె రావణుని ఒడిలో కూర్చొన్నపుడు తన వస్త్రమును, ఆభరణములను జార విడిచిందని వాటిని తాను తన గుహలో దాచానని చెప్పాడు. వారు వాటిని పరిశీలించి అవి సీతవేనని ధృవీకరించారు.

ఆ తరువాత రాముడు వాలిని హతమార్చి సుగ్రీవుని కిష్కింధకు రాజుగా చేశాడు. సుగ్రీవుని అనుమతితో హనుమంతుడు సీతాన్వేషణము కొరకు బయలుదేరి తన దేహాన్ని పెద్దదిగా చేసి ఆకాశమార్గాన సముద్రాన్ని లంఘించి (నూరు యోజనములు) సముద్రపు ఒడ్డుకు చేరిన తరువాత తన దేహాన్ని చిన్నదిగా చేసుకొని సీతాన్వేషణము కావించి సీత జాడను తెలుసుకొని కిష్కింధకు తిరిగి వచ్చిన తరువాత వానర నాయకులతో కూడిన వానర సైన్యాన్ని సిద్ధం చేసి రామలక్ష్మణ, సుగ్రీవాదులు, వానర వీరులైన అంగదుడు, జాంబవంతుడు, నీలుడు మొదలైన వారితో లంకకు బయలుదేరి సముద్రానికి సేతువును నిర్మించి, సముద్రాన్ని దాటి అవతలి ఒడ్డుకు

చేరారు. దీనంతటికి మూలము మానవ సంబంధాలే! కొన్ని కోట్లమంది వానర సైన్యము లంకలో ప్రవేశించి రాక్షసులతో యుద్ధము చేసి వారిని చంపారు. వానర రాక్షసులకు ఘోరమైన యుద్ధము జరిగింది. రాక్షసులు కొంతమంది వానరులను చంపారు. వానరులు నిరుత్సాహముతో ఉన్న సమయంలో హనుమంతుడు వారిని ఉత్సాహపరచి మరలా యుద్ధోన్ముఖులను కావించాడు.

లంక మీద యుద్ధము అనేక దశల్లో జరిగింది. మొదట వానర రాక్షసులకు, తరువాత ఇంద్రజిత్తు, కుంభకర్ణుడు రామలక్ష్మణులకు వారు మరణించిన తరువాత తుదకు రామరావణ యుద్ధము ఏడు రోజులు ఘోరంగా జరిగింది. రాముడు ఇంద్రుని రథము పై వెళ్ళి బ్రహ్మాస్త్రముతో రావణుని సంహరించగలిగాడు. రావణ సంహారము తరువాత కూడా రాముడు సుగ్రీవుడు, విభీషణుడు, వానర మంత్రులు, వానర సైన్యంతో మానవ సత్సంబంధాలు కొనసాగించి విభీషణుణ్ణి లంకా నగరానికి పట్టాభిషిక్తుని గావించి, విభీషణుడు పుష్పక విమానాన్ని తేగా వారందరితో, దేవతాగణముతో కలసి అయోధ్య నగరానికి బయలుదేరి మార్గమధ్యంలో అగస్త్యాశ్రమాన్ని దర్శించి అయోధ్యకు చేరి పట్టాభిషిక్తుడై అయోధ్య పాలనను పదివేల సంవత్సరములు కొనసాగించాడు. ఇవన్నీ మానవ సంబంధాలే.

విభీషణుడు స్వయాన రావణుని రెండవ తమ్ముడు. రావణునితో సీతను రామునికి ఇచ్చివేసి అతనితో సంధిగావించుకోమని సలహా ఇచ్చినా రావణుడు వినలేదు. రావణుని వ్యవహారము నచ్చక రాముని ఆశ్రయించాడు విభీషణుడు. రామునితో సత్సంబంధాలు కొనసాగించి మేలు చేశాడు, తాను మేలు పొందాడు.

రావణ సంహారముతో తన అవసరము తీరిందని రాముడు భావించలేదు. మానవ సంబంధాలు కొనసాగించే భాగంలో వానర రాజైన సుగ్రీవుని, హనుమంతుని, జాంబవంతుని, అంగదుణ్ణి, మిగతా వానరులను, విభీషణుణ్ణి, దేవతాగణముతో పుష్పక విమానములో అయోధ్యకు వచ్చి వారి సమక్షములో అయోధ్యకు పట్టాభిషిక్తుడయ్యాడు.

చిత్రకూట పర్వతము మీద ఉన్నప్పుడు భరతుడు తనకు రాజ్యము వద్దని,

రాముని రాజ్యాన్ని స్వీకరించవలసినదిగా విజ్ఞప్తి చేయటానికి వెళ్ళి కలిసినపుడు కుటుంబంలో పేరుపేరునా ప్రతి ఒక్కరి యోగక్షేమాలడిగి తెలుసుకొని, తండ్రి మరణవార్త విని దుఃఖించాడు. తండ్రి ఆజ్ఞను శిరసావహించాలని భరతునికి చెప్పి, రాజ్యపాలనలో అనుసరించవలసిన రాజనీతి ఉపదేశించాడు.

అయోధ్యలో పట్టాభిషిక్తుడయ్యాక రాజుగా ప్రజలతో సత్సంబంధాలు కొనసాగించాడు. పాలనపై ప్రజల అభిప్రాయాలను తెలుసుకొన్నాడు. అరణ్యావాసమునుండి తిరిగి వచ్చిన రామునికి భరతుడు రాజ్యాన్ని అప్పగించాడు. అది వారి మధ్యనున్న సత్సంబంధాలు. జిల్లా పరిషత్తు అధ్యక్షులుగా, గ్రామ సర్పంచులుగా ఎన్నికైనవారు వారి పదవీ బాధ్యతలు స్వీకరించేటప్పుడు పోటీ తీవ్రంగా ఉన్న సమయంలో రాజీమార్గంగా కొందరు కొంతకాలము, ఆ తరువాత వేరేవారు పదవి చేసేటట్లు అంగీకార పత్రాన్ని వ్రాసుకున్నా మొదట పదవి చేసినవారు వారి కాల పరిమితి దాటినా రాజీనామా చేసి అంగీకార పత్రము ప్రకారము వేరేవారికి అవకాశము ఇవ్వని సందర్భాలు, పార్టీలు మారిన సందర్భాలు ప్రస్తుతము మనం చూస్తున్నాము. మన మానవ సంబంధాలతో పోలిస్తే రామాయణ కాలంనాటి మానవ సంబంధాలలో ధర్మము, నీతి, నిజాయితీలు ఉన్నాయి. కనుకనే భరతుడు రామునికి రాజ్యాన్ని అప్పజెప్పాడు.

రామాయణంలో నిర్వహించిన, కొనసాగించిన మానవ సంబంధాలవల్ల మాత్రమే సీతను తీసుకొని రామలక్ష్మణులు తిరిగి అయోధ్యలో అడుగుపెట్టుటకు అవకాశము ఏర్పడ్డది. మానవ సంబంధాలు దశరథుని కుటుంబ సభ్యులందరిలోను పుష్కలంగా ఉన్నాయి. కైకేయి ఒక్కటే మంథర మాటలు విని మానవ సంబంధాలకు దూరమైందని లోగడ ప్రస్తావించాను.

బలమైన మానవ సంబంధాల వల్లనే కౌసల్య, సుమిత్ర స్నేహితులుగా, అక్కచెల్లెళ్ళుగా ఉన్నారు. బలమైన ప్రజాసంబంధాల వల్లే అయోధ్య ప్రజలు దశరథుని కుటుంబం మీద, రాముని మీద ఆదరణ, ఆప్యాయత, వారి ప్రేమాభిమానాలు చాటారు.

ఉత్తర కాండములో రాముడు సీతమీద వచ్చిన లోకాపవాదమును ముందుగా తన తమ్ములతో చర్చించాడు. ఆ తరువాతే సీతను వాల్మీకి ఆశ్రమానికి చేర్చాడు. మానవ సంబంధాలు కొనసాగించకపోతే రాముడు తన తమ్ములతో చర్చించవలసిన అవసరము లేదు. తానే స్వయముగా నిర్ణయము తీసుకొనవచ్చును.

రామునితో హాస్యపూర్వకముగా మాట్లాడే కొందరు సన్నిహితులున్నారు. వారిలో భద్రుడొకరు. సీత లోకాపవాదాన్ని గురించి రాముడడుగగా భద్రుడు ఉన్నది ఉన్నట్లుగా ప్రజాభిప్రాయాన్ని రాముని దృష్టికి తెచ్చారు. ఇది కేవలము మానవ సంబంధము వల్లనే భద్రుడు రామునితో ఆవిధంగా చెప్పగలిగాడు. రాముడు రాజు, పాలకుడు, తాను సామాన్య పౌరుడను అని భద్రుడు అనుకుంటే చెప్పగలిగేవాడు కాదు.

సంపాతి (గ్రద్ద) జటాయువు సోదరుడు (అన్న). అతడు మరణించగా అతని దహనసంస్కారాలను రాముడు దగ్గరుండి జరిపించాడు. ఈ చర్య మానవ సంబంధాలలో భాగమే.

కాలపురుషుడు వచ్చి రాముని సమయము అయిపోయిందని చెప్పగా రాముడు ఆ విషయము తనకు తెలుసునని చెప్పాడు. తాను పరంధామానికి వెళ్ళేటప్పుడు తన చుట్టూ ఉన్న ప్రజలను కూడా తీసుకొని వెళ్ళిన ప్రజానాయకుడు రాముడు.

రామాయణంలో ఉదహరించిన మానవ సంబంధాలు ధర్మముతో, సత్యముతో, నీతి నిజాయితీతో కూడుకొన్నవి. ప్రస్తుతము మనకున్న మానవ సంబంధాలలలో ఆ లక్షణాలు మృగ్యము. మానవ సంబంధాలకంటే మనము వ్యాపార సంబంధాలకే అధిక ప్రాధాన్యమిస్తున్నామనేది జగమెరిగిన సత్యము.

# అధ్యాయము - 11

## సత్యధర్మాల ప్రస్తావన

రామాయణంలో ప్రస్తావించిన సత్యధర్మాలను తెలుసుకోవటానికి రామాయణం చదవాలి.

భారతదేశ సంస్కృతికి, భారతీయ విలువలకి, భారతీయ జీవన విధానానికి మూలము సత్యధర్మాలు. యుగయుగాలనుండి సత్యధర్మాలను ఆదరించి, ఆచరించిన చరిత్ర భారతదేశానికున్నది. భారతదేశ జీవన విధానానికి మూలము వేదాలు : అవి సత్యధర్మాల ప్రబోధాన్ని భారతీయులకు ఉద్బోధించాయి. సత్యహరిశ్చంద్రుడు, శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, షట్చక్రవర్తులు, సతీసావిత్రి, అనసూయ, సీత ఈ దేశములో జన్మించి సత్యధర్మాలకు ఆదర్శంగా నిలిచినవారే! ప్రస్తుత భారతదేశ ఆశయముకూడ "సత్యమేవజయతే ధర్మమేవజయతే" అనగా సత్యధర్మాలు జయిస్తాయని ఈ వాక్యార్థము.

సత్యధర్మాల ప్రస్తావన రామాయణం ఏడుకాండాలలో ఉన్నది. వాటి ప్రాముఖ్యతను పరిశీలిద్దాము. ఎందరో మునులు, ఋషులు, మహర్షులు, ఋత్విక్కులు ఈ దేశంలో సత్యధర్మాలను ఆచరించి, అనుసరించి వారి వారి జీవితాలను గడిపారు. అంతటి ప్రాశస్త్యము కలవి సత్యధర్మాలు.

రామాయణ మహాభారతాలు కూడా సత్యధర్మాలు ప్రధానాంశాలుగా చేసుకొని వ్రాయబడిన గ్రంధాలే. సత్యధర్మాలను ఆచరించనందువల్లనే రామాయణంలో "వాలి", "రావణుడు" సంపదలతో కూడిన రాజ్యాన్ని పొందినా కూడా ఘోరంగా పతనము చెందారు. మహాభారతంలో కూడ ధృతరాష్ట్రునకు నూరుగురు కుమారులు ఉన్నా, దుర్యోధనుడు రారాజైనా సత్యధర్మాలను

పాటించనందువల్లనే పతనము చెంది మరణించారు. రామాయణంలో రాముడు కష్టాలను ఎదుర్కొంటూ సత్యధర్మాలను విస్మరించలేదు. ఆరాధించి అనుసరించాడు. అందుకే దేవతలు కూడా కష్టాల్లో ఉన్న రామునికి సహాయం చేశారు. ధర్మాన్ని ఆశ్రయించిన రాముడు చివరకు విజయము సాధించాడు. ఇది సత్యధర్మాల ప్రాశస్త్యము.

## 1) బాలకాండములో వాల్మీకి గావించిన ధర్మప్రస్తావనను పరిశీలిద్దాము.

విశ్వామిత్రునితో కలసి రామలక్ష్మణులు అరణ్యములో తిరుగుచూ మిథిలా నగర వనమునందున్న ఆశ్రమాన్ని చూచి దాని వివరములు అడుగగా విశ్వామిత్రుడు రామునితో "పూర్వము గౌతముడను ముని తన భార్యయైన అహల్యా సమేతుడై అనేక సంవత్సరములు ఆ ఆశ్రమములో తపస్సు చేశాడని, దేవేంద్రుడు ఆ ముని లేని సమయమున ఆ ఆశ్రమములో గౌతముని రూపంలో ప్రవేశించి అహల్యతో సంగమించాడని, ఆ ఆశ్రమమునుండి బయటకు వెళ్ళే సమయములో గౌతముడు వచ్చాడని, విషయము గ్రహించిన గౌతముడు వారిద్దరిని శపించాడని, ఇంద్రుని అంగములు పడిపోవుగాక అని, అహల్య కొన్ని వేల సంవత్సరములు ఆ ఆశ్రమములోనే తెల్లటి భస్మము రూపంలో ఉంటుందని, దశరథ మహారాజు కుమారుడైన శ్రీరాముడు ఆ ఆశ్రమాన్ని దర్శించిన తరువాత తన నిజస్వరూపాన్ని పొంది అహల్య మరలా తనతో కలసి ఉంటుందని" గౌతముడు శపించాడని విశ్వామిత్రుడు రామునికి చెప్పాడు. ఇంద్రుడు ధర్మము తప్పి ముని భార్యను సంగమించినందువల్లే అతనిని, అహల్యను గౌతముడు శపించాడు. గౌతముడు వారిని శపించటానికి కారణము వారు ధర్మము తప్పటమే! (అరణ్యకాండము 48వ సర్గము)

## 2. అయోధ్య కాండము :

అయోధ్య కాండము 14వ సర్గములో కైకేయి దశరథుడు పూర్వము తనకిచ్చిన వరములను గూర్చి గట్టిగా ప్రశ్నించి రాజు సత్యధర్మాలను తప్పకూడదని దశరథునికి "శైబ్య మహారాజు", "అలర్కుడు", "సముద్రుడు" మున్నగువారి ఉదంతాలను గుర్తు చేయు సందర్భములో సత్యాన్ని గురించి ఈ విధంగా ప్రస్తావన చేసింది. (దశరథుడు రామ పట్టాభిషేకాన్ని ప్రకటించిన తరువాత)

"సత్యము అను ఒక్క పదము బ్రహ్మరూపము. ధర్మము సత్యము మీదనే ఆధారపడి ఉన్నది. సత్యము ద్వారానే పరమపదమును చేరగలుగుతారు. ఓ పురుషశ్రేష్ఠా! నీ బుద్ధి ధర్మము మీదనే స్థిరముగా నిలచి ఉన్న పక్షంలో సత్యమును పాటించుము. నా వరాలు సఫలము అయ్యేటట్లు చేయుము. ఆ వరాలు ఇచ్చినవాడవు నీవే కదా?'' అని కైకేయి సత్యధర్మాల ప్రస్తావన కావించింది.

**2)** రామ పట్టాభిషేకాన్ని దశరథుడు ప్రకటించిన తరువాత రాముడు రథము మీద దశరథుని ఇంటికి అతని ఆశీర్వాదము కోరుటకు వెళ్ళాడు. మొదట తండ్రిని చూచి అతనికి పాదాభివందనము చేసి పిదప కైకేయి పాదములకు నమస్కరించి తండ్రి వ్యాకులమైన, వ్యథ చెందిన చిత్తముతో నిట్టూర్చుచుండుట గమనించి తల్లియైన కైకేయిని యదార్థముగా ఏమి జరిగిందో చెప్పమన్నాడు. అప్పుడు కైకేయి రామునితో ఒక అప్రియమైన విషయము నీతో చెప్పుటకు రాజుకి నోరు రావటము లేదని రాజు పూర్వము తనకొక వరమిచ్చాడని ఇప్పుడు పశ్చాత్తాపపడుచున్నాడని సత్యప్రస్తావన చేసింది.

**"రామా! సత్యము అన్నిధర్మములకును మూలమని సత్పురుషులందరును అంగీకరించిన విషయము, రాజు కోపగించి, నీ నిమిత్తమై అట్టి సత్యమును విడువకుండునట్లు చూడుము. రాజు చెప్పునది నీకు ప్రియమైనను, అప్రియమైనను 'నేను చేసెదను' అని నీవన్నచో అది అంతా నీకు నేను చెప్పెదను".** ఆ తరువాత కైకేయి మాటలు విన్న రాముడు తండ్రి వాక్కును సత్యము చేయటానికి వనవాసాన్ని అంగీకరించాడు.

**3)** అయోధ్య కాండము 19వ సర్గములో రాముడు తల్లియైన కైకేయితో ధర్మప్రస్తావన చేసి, రాజ్యాధికారము తనకు అవసరము లేదని, తండ్రి ఆజ్ఞను పాటిస్తానని కైకేయితో పలికిన మాటలు.

**"దేవీ! నేను ధన ప్రధానుడను కాను. లోక మర్యాదననుసరించవలెనని మాత్రమే కోరుచున్నాను. కేవలము ధర్మమును అవలంబించిన నేను ఋషితుల్యుడనని తెలుసుకొనుము".**

రాముని స్వరూపమే ధర్మ స్వరూపము. ఆ విషయాన్ని కైకేయి గమనించలేకపోయింది. సత్య ధర్మాలను తు.చ. తప్పకుండా పాటించిన వ్యక్తి రాముడు.

**4)** అయోధ్య కాండము **21**వ సర్గములో లక్ష్మణుడు బలాత్కారముగ రాజ్యము చేజిక్కించుకొమ్మని రాముని ప్రేరేపించినను పితృాజ్ఞపాలనమే ధర్మమని తల్లికిని, లక్ష్మణునికి నచ్చబలికిన సందర్భములో సత్యధర్మాల ప్రస్తావన కావించాడు. "లక్ష్మణా! నా తల్లి సత్యము యొక్కయు, శాంతి యొక్కయు, రహస్యము తెలియక పోవుటచే సాటిలేని దుఃఖమును పొందుచున్నది. లోకంలో అన్నిటికంటెను శ్రేష్ఠమైనది ధర్మమే. ధర్మమునందే సత్యము నిలిచియున్నది''.

రాముడు ఇంకా ధర్మాన్ని గురించి లక్ష్మణునితో ఈ విధంగా అన్నాడు. "ధర్మమునే ఆశ్రయించినవానికి ధర్మార్థకామములు మూడు లభించును. ధర్మార్థ కామములన్నియు కూడి ఉండని కార్యమును పరిత్యజించి ధర్మము దేనియందు ఉండునో అట్టి కార్యమునే ప్రారంభించవలెను. అర్థమునకు మాత్రమే ప్రాధాన్యమిచ్చువాడు లోకములో ద్వేషపాత్రుడగును. కామపరత్వము కూడా ప్రశస్తము కాదన్నాడు. ధర్మార్థ కామములపై రాముని అభిప్రాయము స్పష్టం చేశాడు. దీనిని అందరూ అంగీకరిస్తారని నేను భావిస్తున్నాను.

**5)** అయోధ్యకాండము **30**వ సర్గములో ధర్మాన్ని గురించి రాముడు తన అభిప్రాయాన్ని ఈ విధంగా వ్యక్తపరిచాడు.

"తల్లికి తండ్రికిని లొంగియుండుట అనునదే ధర్మము. అందుచే నేనా ధర్మమును అతిక్రమించి జీవించుటకు ఇచ్చగించను''.

ప్రస్తుతం మనమున్న కలియుగంలో కన్న తల్లిదండ్రులకు కూడు పెట్టకుండా వారిని ఇంట్లోనుంచి వెళ్ళగొట్టేవారిని వార్తాపత్రికల ద్వారా, టెలివిజన్‌ల ద్వారా చూస్తున్నాము. అటువంటి తల్లిదండ్రులు ఆత్మహత్యకు పాల్పడుతున్నారు. ఇది ప్రస్తుతము కొంతమందికి వారి సంతానము ద్వారా కలిగిన దుస్థితి''.

**6)** అయోధ్యకాండము **34**వ సర్గములో రాముడు సీతాలక్ష్మణ సమేతుడై రాణులతో

కూడిన దశరథ మహారాజు వద్దకుపోయి, వనవాసమునకై సెలవడిగే సందర్భములో సత్యప్రస్తావన చేశాడు. "నాకు రాజ్యమునందుకాని, సీతయందుకాని, ఈ సకల భోగములందు కాని, స్వర్గమునందుకాని, జీవితమునందుకాని కోరిక లేదు. "నీవు వనములకు వెళ్ళుము అని కైకేయి కోరినది. నేను కూడా వెళ్ళెదనని అంగీకరించితిని. ఈ సత్యమును పాలించెదను''.

ఆడిన మాట తప్పకుండుట, అసత్యము ఆడకుండుట లోకంలో చాలా అరుదుగా చూస్తాము. కొంతమంది వారి అవసర నిమిత్తము ఇతరుల దగ్గర ధనము తీసుకొని ఇచ్చినవారు మరలా గట్టిగా అడిగితే పంచాయితీ అయి చివరకు అసలు నీవు నాకెప్పుడు ఇచ్చావనే అసత్యవచనాలు వినపడుతున్నాయి. ఇవి నిత్య జీవితములో అనేకమంది చూసే సంఘటనలే! ఇక పాలకుల సంగతి చెప్పనవసరము లేదు. ఉదయము చెప్పిన అసత్యాన్ని సాయంకాలము చెప్పరని ప్రజలు భావిస్తారు. నిజాన్ని మరచిపోయినట్టు నటించి అసత్యాన్ని ఆయుధంగా చేసుకొని బ్రతికేవారి సంఖ్యకు లోకంలో కొదువలేదు.

**7)** అయోధ్యకాండము **109**వ సర్గములో రాముడు జాబాలి పలికిన నాస్తిక మతమును ఖండించి ఆస్తిక మతమును స్థాపించు సందర్భములో సత్యప్రస్తావన చేశాడు.

రాజ్యము సత్యప్రధానమన్నాడు. సత్యము మీదనే లోకము నిలబడి ఉన్నదన్నాడు. ఈ రాజధర్మము సత్యస్వరూపమైనదన్నాడు.

ఋషులు, దేవతలు సత్యము ఉత్తమ ధర్మమని అంగీకరించారు. సత్యమును పలుకువాడు ఈ లోకములో ఉత్తమమైన స్థానమును పొందునన్నాడు. అసత్యము చెప్పువానిని చూచి, జనులు సర్పమును చూచి భయపడునట్లు భయపడతారన్నారు. ఇహలోకములో సత్యమే ఉత్తమ ధర్మము. ఇది సర్వమునకు మూలకారణమని చెబుతారు. ఈ లోకంలో సత్యమే ఈశ్వరుడు, మూలము. సత్యమును మించిన ఉత్తమ ధర్మమేదియు లేదన్నాడు. దానము, యాగము, హోమము, తపస్సు, వేదములు, ఇవన్నియు సత్యము మీదనే ఆధారపడి ఉన్నవన్నారు. అందుచేత మానవుడు సత్యమునే అవలంబించవలెనన్నాడు.

ఇక్కడ నేనొక విషయాన్ని చెప్పాలి. కొన్ని సంవత్సరాల క్రితము నేను "సత్యము - అసత్యము" అనే పుస్తకమును ఆంధ్రాంగ్ల భాషల్లో వ్రాశాను. అది డి.టి.పి. కూడా చేయించాను. తెలుగులో అక్షరదోషాలను డా॥ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తిగారు చూశారు. దానికి ముందు మాటను డా॥ చేరెడ్డి మస్తాన్‌రెడ్డి గారు, డా॥ మడకా సత్యనారాయణగారు వ్రాశారు. పునరాలోచించి ఆ పుస్తకాన్ని అచ్చు వేయకుండా ఆపి వేశాను. కారణము లోకంలో అధిక శాతముమంది ప్రజలు అసత్యాన్ని ఆదరించేవారేనని నా అనుభవం ద్వారా అభిప్రాయపడ్డాను. అందువల్ల ఆ పుస్తకాన్ని ఉచితంగా పంచినా చదివేవారి సంఖ్య బహు స్వల్పంగా ఉంటుందని భావించి అచ్చువేయకుండా ఆపివేశాను. చిన్న చిన్న విషయాలకు కూడా చిన్నవారి దగ్గరనుండి పెద్దవారివరకు అసత్యాలు మాట్లాడటము అలవాటుగా మారిన సమాజములో అటువంటి పుస్తకాలకు ఆదరణ లభించకపోవచ్చునేమో!

## 3) అరణ్యకాండము :

అరణ్యకాండము 9వ సర్గములో సీత రామునికి ధర్మప్రస్తావన చేసింది. అరణ్యములో ఉన్న మునులు, ఋషులు, మహర్షులు - వారిని రాక్షసులు బాధించుచున్నారని, రక్షించమని వారు రాముని వేడుకొనగా రాముడు రాక్షసులను హతమార్చి మునులను రక్షిస్తానని వారికి మాట ఇచ్చాడు. ఆ సందర్భములో సీత రాముడు తండ్రియాజ్ఞను పాలించి అరణ్యమునకు వచ్చినాడని, అతడు ఇప్పుడు మునితో సమానమని, క్షత్రియ ధర్మాన్ని అనుసరించి మునులను రక్షించవచ్చునుకాని తానే మునిగా ఉన్నప్పుడు హింస చేయుట ధర్మము కాదని ధర్మప్రస్తావన ఈ విధంగా చేసింది.

"ధర్మము అర్థమునకు కారణము. ధర్మము సుఖమునిచ్చును. ధర్మముచే మానవుడు సమస్తమును పొందగలడు. ఈ జగత్తులో సాధ్యమైనది ధర్మమొక్కటే. నేర్పుగల బుద్ధిమంతులు ఆయా నియమములచే తమని తాము ప్రయత్న పూర్వకముగ కృశింపచేసుకొని, ధర్మమును అర్థించుచుందురు. రామా! నిత్యము నిర్మలమైన బుద్ధితో తపోవనమునందు ధర్మమునాచరింపుము".

**2)** శూర్పణఖ, రావణుని సోదరి, రాముని వివాహము చేసుకోమని కోరగా రాముడు అందుకు నిరాకరించాడు. కారణము ఆమె కోరిక ధర్మవిరుద్ధము కనుకనే!

**3)** అరణ్యావాసములో ఉన్న సీత దగ్గరకు రావణుడు కపట సన్యాసి రూపములో వచ్చి ఆమె అందానికి ముగ్ధుడై, కామమోహితుడై ఆమెను తన భార్యగా అంగీకరించమని కోరగా ఆమె ధర్మము తప్పలేదు. ఆ తరువాత ఆమెను అపహరించి లంకానగరము ఎత్తుకెళ్ళి నానా ఇబ్బందులు పెట్టినా కూడా ఆమె ధర్మమునందు స్థిరముగానున్నది. రావణుడు అధర్మపరుడు, కామమోహితుడు, పరస్త్రీలయందు నిత్యము అత్యాసక్తి కలవాడు. ఎందరో పరభార్యలను తన భార్యలుగా చేసుకొని తన అంతఃపురములో వారిని ఉంచి అనుభవించిన అధర్మపరుడు. ఎంతోమంది స్త్రీలను అనుభవించి శాపాలకు గురయ్యాడు. రావణుని చర్యలన్నీ రామాయణంలో అసత్య, అధర్మచర్యలే! కనుకనే చివరకు ధర్మము విజయము సాధించి రావణుడు ఘోరమరణము పొందాడు. ధర్మపరుడైన రాముడు విజయము సాధించి మరలా అయోధ్యకు రాజ్యాభిషిక్తుడయ్యాడు. ఇది రాముని గొప్పతనము కాదు. ధర్మము యొక్క గొప్పతనము, ప్రాశస్త్యము అని నా భావన.

## 4. కిష్కింధకాండ :

**1)** రామలక్ష్మణులు సీతాన్వేషణము చేయుచు ఋష్యమూక పర్వతానికి చేరిన సందర్భమున సుగ్రీవుడు వారి రాకను గూర్చి విని వారితో హనుమంతుని ద్వారా మైత్రీబంధాన్ని ఏర్పరచుకొని తన వృత్తాంతాన్ని వారికి వివరించాడు. ఆ తరువాత రాముడు వాలిని హతమార్చి కిష్కింధకు సుగ్రీవుని రాజుగా చేస్తానని ధర్మప్రస్తావన చేశాడు.

"ధర్మమునందు అత్యాసక్తిగల నేను ఎన్ని కష్టములలో ఉన్నను పూర్వమెన్నడూ అసత్యము పలుకలేదు. ఎట్టి పరిస్థితులలోను ఇటుపై కూడా పలుకను. దేవేంద్రుడు అంకురించిన వరి పొలమును వర్షముచేత సఫలము చేసినట్లు ప్రతిజ్ఞను సఫలము చేసెదను. భయమును వీడుము".

వాలిని యుద్ధానికి ఆహ్వానించమని, తనకు ధర్మంగా రావలసిన రాజ్యాన్ని

తనకు ఇప్పిస్తానని రాముడు సుగ్రీవునికి అభయమిస్తూ చేసిన సత్యధర్మాల ప్రస్తావన ఇది. వాలి దుశ్చర్యలు రెండు. తమ్ముడైన సుగ్రీవుని అన్యాయంగా రాజ్యమదాంధ కారముతో రాజ్య బహిష్కరణగావించాడు. రెండవది సుగ్రీవుని భార్యయైన "రుమ"ను బలాత్కారముగా చెరబట్టి తన భార్యగా చేసుకున్నాడు. వాలి చేసిన ఈ రెండు కార్యములు అధర్మ చర్యలే! అందుకు వాలి అనుభవించిన ఫలితము మరణము. **(కిష్కింధకాండము 14వ సర్గము)**

**2)** కిష్కింధకాండము **18**వ సర్గములో వాలి తన దుశ్చర్యలను సమర్థించుకొనగా రాముడు వాలి మాటలకు సమాధానం చెప్పే సందర్భంలో ధర్మ ప్రస్తావన చేశాడు.

వాలి రాజధర్మము అనుసరించి ధర్మమును చెడగొట్టినాడన్నాడు రాముడు. నింద్యమైన కర్మ చేసినాడు. కామభోగములకే ప్రాధాన్యమిచ్చాడు వాలి. అన్నగారు కన్నతండ్రి, విద్యనిచ్చిన గురువు - వీరు ముగ్గురు తండ్రులని ధర్మమార్గమునందున్న వారని తెలుసుకోవాలన్నాడు. తమ్ముడు, కుమారుడు, సద్గుణవంతుడైన శిష్యుడు - వీరు ముగ్గురూ తన పుత్రులేనని భావించవలెనన్నాడు రాముడు. అందుకు ధర్మమే కారణమన్నాడు.

**3)** కిష్కింధకాండములోనే **(18**వ సర్గము**)** రాముడు వాలినుద్దేశించి తనకిచ్చిన దండనము (శిక్ష) సమర్థనీయమేనని చెబుతూ ధర్మప్రస్తావన చేశాడు. ఏ మానవుడు కామమోహితుడై కుమార్తెనుగాని, సోదరినిగాని, తమ్ముని భార్యనుగాని పొందునో అతనికి దండనము విధింపబడును. క్షత్రియుడైన తాను వాలి చేసిన పాపకర్మను సహింపజాలనన్నాడు. ఆ సందర్భములో భరతుని ధర్మపాలనము గుర్తు చేస్తూ "ధర్మానుసారము రాజ్యపాలనము చేయు బుద్ధిమంతుడైన భరతుడు ఉత్తమమైన ధర్మమును అతిక్రమించువారిని నశింపజేయునన్నాడు. మేము భరతుని ఆదేశమును శాస్త్రమువలె పాటించుచు, అతిక్రమించిన నీవంటి (వాలివంటి) వాళ్ళను నిగ్రహించుటకై నిలచి ఉన్నామన్నాడు. ధర్మమును పాటించువాడు స్నేహితునకు ఉపకారము చేసియే తీరవలెనన్నాడు". ఇది ధర్మము యొక్క ప్రాశస్త్యము. ధర్మ ప్రాశస్త్యాన్ని అందరూ గ్రహించి వాలి ఉదంతము ద్వారా గుర్తుపెట్టుకోవాలని వాల్మీకి ఉద్దేశము. అందుకే రామునిచే ధర్మప్రస్తావన కావించాడు.

**4)** వాలి సుగ్రీవుల యుద్ధములో రాముడు వాలిని హతమార్చి సుగ్రీవుణ్ణి కిష్కింధకు రాజుగా చేశాడు. ఆ సందర్భమున సుగ్రీవుడు వానరులతో రాముని కలిసి ధర్మప్రస్తావన చేశాడు.

“రామా! పోయిన ఐశ్వర్యమును, కీర్తిని, ఈ శాశ్వతమైన వానరుల సైన్యమును నేను నీ అనుగ్రహము వలన పొందితిని. నీవు, నీ సోదరుడు అనుగ్రహించి చేసిన ఉపకారమునకు ప్రత్యుపకారము చేయకపోయినచో ధర్మమునకు విఘాతము కలిగించిన పురుషుడను అగుదును''.

ఎవరైనా మనకు ఉపకారము చేస్తే దానికి ప్రత్యుపకారము చేయుటము ధర్మమని వాల్మీకి సుగ్రీవుని ద్వారా స్పష్టము చేస్తున్నాడు. ప్రజలు దీనిని గుర్తుంచు కోవాలని వాల్మీకి భావము. కానీ లోకంలో మేలు చేసిన వారికి కీడు చేసేవారి సంఖ్య నానాటికి పెరుగుతుంది. దీనిని ఎవరూ ఖండించటము లేదు. (కిష్కింధకాండము 38వ సర్గము)

## 5. సుందరకాండము

సుందరకాండము 20వ సర్గములో రావణుడు సీతను లోభ పెట్టుటకు మాట్లాడిన తీరు ఆమెను క్షోభపెట్టింది. అప్పుడు సీత రావణునితో ఈవిధంగా అన్నది. పరభార్యాగమనము, బలాత్కరించి పరస్త్రీలను అపహరించుట - ఇది రాక్షసుల చర్య, స్వధర్మమన్నది. అందుకు రావణుడు సీతతో సౌందర్యరాశియైన ఆమెను (సీతను) చూచినచో బ్రహ్మదేవుడు కూడా విడచిపెట్టడన్నాడు. తనకు (రావణునికి) ఎంత ఐశ్వర్యము, కీర్తి ఉన్నదో చూడమన్నాడు. నారబట్టలు కట్టుకునే రామునితో ఏమి చేసెదవన్నాడు.

అందుకు సీత రామునితో పోల్చుకొనుటకు తగని తుచ్ఛుడవని ధర్మప్రస్తావన చేసింది. రావణునితో మాటలాడుటకు ఇష్టము లేకపోవుటచే మధ్య గడ్డిపరకను అడ్డముగా ధరించి ఇట్లన్నది. పరభార్యను, పతివ్రతను అయిన నేను నీకు తగిన భార్యను కాను. ధర్మమును బాగుగా చూడమన్నది. చపల స్వభావుడై, తన భార్యలతో సంతృప్తి చెందక, ఇంద్రియ నిగ్రహము లేకుండా ఉన్న నీచ బుద్ధి

కలవారిని, పరభార్యలు పరాభవమును పొందిస్తారన్నది. పెద్దపులుల గంథమును వాసన చూచిన కుక్కవాటి ఎదుట ఎట్లు నిలువజాలదో అట్లే రామలక్ష్మణుల గంథము వాసన చూచిన పిమ్మట రావణుడు వారి ఎదుట నిలువజాలడని ధర్మప్రబోధము చేసింది. పరభార్యల వ్యామోహము వల్లనే రావణుడు అంత ఐశ్వర్యవంతుడైనా, లంకాధీశుడైనా, ముల్లోకాలను గజగజలాడించినా ఘోరపతనము పొందాడు. రావణ పతనానికి నాంది అధర్మాచరణ, ధర్మవిరుద్ధంగా వర్తించటము. రాజే ధర్మవిరుద్ధంగా ప్రవర్తిస్తే ఇక ప్రజల సంగతేమిటనే ప్రశ్నకు సమాధానము దొరకని ప్రశ్నగా మిగులుతుంది. ఆ ప్రశ్నకు సమాధానమే రావణుని పతనమని వాల్మీకి స్పష్టం చేస్తున్నాడు. (సుందరకాండము 21వ సర్గము)

## 6. యుద్ధకాండము

అయోధ్య, యుద్ధకాండాలలో ధర్మప్రస్తావన విస్తరంగా ఉన్నది.

1) యుద్ధకాండము 64వ సర్గములో మహోదరుడు ధర్మప్రస్తావన చేశాడు. "ధర్మమునకు శ్రేయస్సే ఫలమన్నాడు. అధర్మానికి దుఃఖము ఫలమన్నాడు".

2) యుద్ధకాండము 83వ సర్గములో రావణుని కుమారుడైన ఇంద్రజిత్తు (మేఘనాథుడు) మాయ సీతను సృష్టించి తల నరికివేశాడు. హనుమంతుడు, మిగతా వానరులు ఆ దృశ్యాన్ని చూచారు. కలత చెందిన హనుమంతుడు సీత మరణించిందని దుఃఖించుచు ఆ విషయాన్ని రామునికి తెలుపగా రాముడు మూర్ఛపోయాడు. మూర్ఛపోయిన రాముణ్ణి లక్ష్మణుడు ఓదార్చి ధర్మప్రస్తావన చేసి ధర్మాధర్మముల మీద తన అభిప్రాయాన్ని వెల్లడించాడు.

ఉత్తమ మార్గమునందున్న, జితేంద్రియుడైన రాముని ధర్మము ఆపదనుండి రక్షించజాలకున్నదన్నారు. అందుచే ధర్మము నిష్ప్రయోజనమన్నాడు. స్థావరములు, జంగమములు అయిన ప్రాణులు కనబడినట్లు ధర్మాధర్మములనేవి కనబడుట లేదన్నాడు. అందుచేత ధర్మము లేదని లక్ష్మణుడు అభిప్రాయపడ్డాడు. స్థావరములైన వృక్షశిలాదులు ఏవిధంగా ప్రత్యక్షంగా కనబడుచున్నవో, ధర్మాధర్మములను పదార్థములు ఆ విధముగా ప్రత్యక్షముగా కనబడుట లేదన్నాడు. అట్లు కనబడినచో

రామునివంటివానికి ఆపదలు వచ్చి ఉండెడివి కాదన్నాడు. అధర్మమనేది ఉన్నట్లయితే రావణుడు నరకమును పొంది ఉండెడివాడన్నాడు. ధర్మమును అనుసరించిన రాముడు ఈ విధముగా కష్టములు పొందెడివాడు కాదన్నాడు. ఆ రావణునికి ఆపదలు రాకపోవుట చేతను, రామునికి ఆపదలు వచ్చుచుండుట చేతను అధర్మము ధర్మఫలములను (మంచి ఫలమును), ధర్మము అధర్మఫలములను (చెడ్డఫలములను) ఇచ్చుచున్నట్లు తనకు తోచుచున్నదని లక్ష్మణుడు అన్నాడు. ధర్మము చేత ధర్మఫలములను పొందునని, అధర్మము చేత అధర్మ ఫలమును పొందునని నియమము లేదన్నాడు. అధర్మము చేయువారు అధర్మఫలమునే పొందే పక్షమున జనులు అధర్మమునందు ఆసక్తి చూపుచు ధర్మమును విడిచి ఉండేవారు కాదన్నారు. ధర్మమును ఆచరించు వారికి ధర్మము చేత ధర్మఫలము లభించి ఉండెడిదన్నారు. అధర్మము చేయువారి సంపదలు అభివృద్ధి చెందుచుండుట చేతను, ధర్మప్రవృత్తి గలవారు ఆపదలలో చిక్కుకొనుచుండుట చేతను ధర్మాధర్మములు నిష్ఫలమన్నాడు.

అధర్మము పాపాత్ములను చంపివేయునని చెప్పుచుందురు. అది కుదరదు. చేసిన నాల్గవ క్షణము నశించుపోవు అధర్మమే నశించిపోయినప్పుడు ఇంక అది ఎవరిని చంపగలదని లక్ష్మణుడు ప్రశ్నించాడు. ధర్మము విషయమున కూడా ఇంతే. క్రియ అగుట చేత జరిగిన నాల్గవ క్షణమునందే ధర్మము నశించిపోవునన్నాడు. అట్లు నశించిన ధర్మము ఫలితము ఏమి ఇవ్వగలదని ప్రశ్నించాడు. అందుచేత ధర్మాధర్మములు అనునవియే లేవన్నాడు లక్ష్మణుడు.

లక్ష్మణుడు సుదీర్ఘమైన ధర్మప్రస్తావన రామునితో చేశాడు. రామునితో ఇంకా ఈ విధంగా అన్నాడు. "ఓ! శత్రుసంహారకా! సత్యము పలుకుట ధర్మమైన పక్షమున, మొదట నీకు రాజ్యమిచ్చెదనని పలికి ఇవ్వక అసత్యమాడిన, నీమీద కరుణ లేని మన తండ్రిని నీవు ఎందుచేత బంధింపలేదని" ప్రశ్నించాడు.

**Lakshmana made a lengthy speech on Dharma and Adharma in a mood of frustration. According to Lakshmana if Dharma exists, it should punish the people of Adharma atonce. But the people who followed Dharma in the world are enjoying or facing bitter troubles**

**and experiences instead of happiness and comfortable life. Whereas those who follow Adharma have been prospering. So according to Lakshmana Dharma doesnot exist. One should depend on one's own strength instead of depending on Dharma. Moreover, Lord Rama has followed the path of truth in his life. It is also not good. His own father made him the promise of making him the king of Ayodhya but could not. Why did not Rama rebel against his father ? is the question of Lakshmana. It is one of the most powerful, and reasonable speeches and a fine argument on Dharma.**

3) రావణుని సోదరులు కుంభకర్ణుడు, విభీషణుడు అధర్మపరుడైన అన్న రావణునికి సీత విషయములో ధర్మబోధను గావించిన వారే. రాముని భార్యను రామునికిచ్చి వేయమని సలహా ఇచ్చారు. కాని రావణుడు వారి మాట పెడచెవిని పెట్టాడు. అయినప్పటికి కుంభకర్ణుడు రావణుని పక్షాన ఉండగా విభీషణుడు మాత్రము రాముని పక్షాన చేరాడు. ధర్మపరుడు, ధర్మనిరతుడు విభీషణుడు. రావణుని దుర్మార్గాన్ని తప్పుబట్టి, ఖండించాడు. రాముని శరణువేడాడు. విభీషణుడు ధర్మపరుడు, ధర్మానుసారము జీవించేవాడు కనుకనే రావణ సంహారము తరువాత లంకా రాజ్యానికి పట్టాభిషిక్తుని కావించాడు రాముడు. ధర్మానికి ఫలితంగా దీనిని భావించవచ్చును. (యుద్ధకాండము)

యుద్ధకాండము 119వ సర్గములో రావణ సంహారము జరిగిన తరువాత బ్రహ్మాది దేవతలు సంతోషించారు. మహేశ్వరుడు రామునితో అదృష్టవశాత్తూ నీవు రావణసంహారము పూర్తిచేసినావన్నాడు. దశరథుడు ఇంద్రలోకమునుండి అచటకు రాగా మహేశ్వరుడు దశరథుని రాకను గురించి చెప్పగా సీతారాములు దశరథుని చూచి నమస్కరించిన సందర్భమున దశరథుడు ధర్మప్రస్తావన చేశాడు. దశరథుడు సంతోషించి రాముడు ధర్మఫలాన్ని పొందాడన్నాడు. మూడు లోకములు రాముని పూజించుచున్నవన్నాడు. సీతతో రాముడే ఆమెకు పరమదేవత అన్నాడు. లక్ష్మణుణ్ణి రామునికి సేవ చేయమని ఇంద్రలోకానికి తిరిగివెళ్ళాడు.

## 7. ఉత్తరకాండము

ఉత్తరకాండము 59వ సర్గము, పన్నెండవ ప్రక్షిప్త సర్గములో వాల్మీకి ధర్మాన్ని నిర్వచించి, ధర్మప్రాధాన్యాన్ని వివరించాడు.

శునకము విషయమున రాముడు న్యాయనిర్ణయము చేయు సందర్భములో ఈ ధర్మ ప్రస్తావన జరిగింది.

**ధరించునది కావున ధర్మము అని అందురు. ధర్మమే ప్రజలను నిలబెట్టునన్నాడు. స్థావరజంగమాత్మకమైన మూడు లోకాలని నిలబెట్టేది ధర్మమే. శత్రువులను అదుపులో ఉంచుట చేత కూడ ఇది ధర్మము.** ధర్మము చేతనే రాజులు ప్రజలను రంజింప చేస్తారన్నాడు. అందుచేత ఇది ధరింపజేయునది అని చెప్పబడినది. అదే ధర్మము అని నిశ్చయము. ఇవి శునకము రామునితో అన్న మాటలు. తానేమి చేయవలెనో చెప్పమని రాముడు శునకాన్ని అడుగగా శునకము ఈ విధముగా అన్నది. "ధర్మము చేతనే రాష్ట్రమును పొందవలెను. ధర్మము చేతనే దానిని పాలించవలెను. రామా! ధర్మము వలన సకల భయములను తొలగించు రాజు రక్షకుడు అగును".

"ధర్మము చేతనే రాష్ట్రమును (దేశమును) పాలించవలెను" అనే వాక్యాన్ని పరిశీలిద్దాము. రామాయణ కాలమైనా, నేటి కాలమైనా దేశాన్ని ధర్మముచే పాలించాలి. కాని ప్రస్తుత పాలకులు దేశంలో సత్యధర్మాలను పక్కనపెట్టి పాలిస్తున్నారని, ప్రజలు వాపోతున్నారనేది టెలివిజన్ ద్వారా, వార్తాపత్రికల ద్వారా చూస్తున్నాము. ఇది కాదనలేని సత్యము. ధర్మాచరణము ఏ వ్యక్తికైనా, ఏ రాజ్యానికైనా చాలా కష్టతరముగాను, అధర్మాచరణము సులభమని మనం భావించాలి.

**2)** ఉత్తరకాండము డెబ్బదినాలుగవ సర్గములో చనిపోయిన తన పుత్రుని తీసికొనివచ్చి ఒక బ్రాహ్మణుడు రాజద్వారము వద్ద విలపిస్తూ రామునికి కనిపించాడు. తపస్సు చేయుచున్న శూద్రుడు అధర్మము చేయుటయే బ్రాహ్మణ పుత్రుని మరణమునకు హేతువు అని నారదుడు రామునికి తెలిపిన సందర్భములో నారదుడు ధర్మప్రస్తావన చేశాడు. కృతయుగంలో బ్రాహ్మణజాతి తపోవీర్యముల చేత అధికముగా ఉండెడిది.

త్రేతాయుగములో క్షత్రియజాతి కూడా తపస్సులో ఉండుట చేత సమానములైనవి. త్రేతాయుగ బ్రాహ్మణజాతి కూడా కృతయుగ బ్రాహ్మణజాతి కంటే న్యూనమే. అప్పుడు శాస్త్రనిర్మాతలు బ్రాహ్మణ క్షత్రియులలో అధికముగా లేకపోవుటచే అందరికీ సమ్మతమైన చాతుర్వర్ణ్యమును ఏర్పాటు చేశారు. అధర్మాచరణము లేని త్రేతాయుగము ప్రకాశించుచుండగా భూమి మీద అధర్మము ఒక పాదము ఉంచెను. అప్పుడు ఆ అధర్మబంధముచే తేజస్సు కొంచెము తగ్గినది.

ద్వాపరయుగములో అధర్మము, అనృతము వృద్ధి పొందినవి. ఈ ద్వాపరయుగంలో తపస్సు వైశ్యులకు కూడ సంక్రమించింది. ఈ విధముగా తపస్సు మూడు యుగములలో క్రమముగా మూడు వర్ణములలో ప్రవేశించింది. యుగానుసారము శూద్రునకు ధర్మము (తపస్సు) లభ్యము కాలేదు. కాని కలియుగములో శూద్రునికి కూడ తపస్సు చేయుట ఉన్నది. త్రేతాయుగములో శూద్రుడు తపస్సు చేయుట గొప్ప అధర్మమన్నాడు నారదుడు. రామాయణంలో ఉన్న సత్యధర్మాల ప్రస్తావన ఇది.

సత్యధర్మాలను గురించి అనేక సందర్భాలలో రామాయణంలో చేసిన ప్రస్తావనను చూశాము. అసలు లోకంలో ధర్మాధర్మాలు అవసరమా? సత్యాసత్యాలు అవసరమా? అవి లేకుండ లోకము నడువదా? కేవలము సత్యధర్మాలు లోకంలో అమలు జరుగుతున్నాయా? - ఇత్యాది ప్రశ్నలను పరిశీలిస్తే సత్యధర్మాలు కొరవడితే లోకములో అనేక దుర్ఘటనలు, అన్యాయపూర్వకమైన చర్యలు అప్రతిహతంగా జరుగుతాయి. అసలు సత్యధర్మాలు లేకపోతే అరాచకానికి, అన్యాయానికి తెరతీసి ప్రజా జీవన విధానము అస్తవ్యస్తము, అల్లకల్లోలమవుతుంది. లోకంలో కేవలము అసత్య, అధర్మాలు మాత్రమే ఉన్నట్లయితే ప్రజాజీవనము దుర్భరంగా, నరకప్రాయంగా మారుతుంది. కనుక సత్యధర్మాల ఉనికి మానవ జీవితానికి అత్యంత అవసరము. అందుకనే సత్యధర్మాలు భగవంతుని స్వరూపము, ఈశ్వరుని స్వరూపమంటారు.

# అధ్యాయము - 12

కాలమహిమ, సూర్యునిమహిమ, రామాయణ మహాత్మ్యమును గురించి తెలుసుకోవటానికి రామాయణం చదవాలి.

కాలము అందరికంటె, అన్నింటికంటె గొప్పది. ఎంతటి మహాత్ములైనా, దుర్మార్గులైనా కాలగర్భంలో కలిసిపోవలసిందే. కాలాన్ని ఎదిరించే శక్తిగాని, కాలగతిని మార్చే శక్తియుక్తులుగాని ఎవ్వరికీ లేవు. మహోన్నతంగా విలసిల్లిన రాజ్యాలు, వ్యక్తులు, నగరాలు, నాగరికతలు కాలగర్భంలో కలిసిపోయాయి. ఇది మనకు చరిత్ర చెప్పే సత్యము. ప్రతి వ్యక్తి తన కాలమునందే పని చేయవలసి ఉంటుంది. కాలాతీతులు ఎవ్వరూ లేరు. శ్రీరాముడు, శ్రీకృష్ణుడు కూడా మానవులుగా జన్మించి మరణము పొందినవారే! ఇది కాలమహిమ.

రామాయణం కిష్కింధకాండము 25వ సర్గములో వాలి మరణించిన తరువాత వాలి భార్య తార, వాలి సోదరుడు సుగ్రీవుడు, వాలి కుమారుడు అంగదుడు శోక పీడితులైనప్పుడు లక్ష్మణ సమేతుడైన రాముడు వారిని ఓదార్చుచు కాలమహిమను గూర్చి చెప్పాడు.

ఈ లోకములో అన్నింటికి కారణము కాలమే. కాలమే కర్మలకు సాధనము. ఈ లోకములో సమస్త భూతములను ప్రేరేపించు కారణము కాలమే. ఎవ్వనిని ఎవ్వరు ప్రవర్తింపచేయరు. అట్లు ప్రవర్తింప చేయుటకు సమర్థులు కూడ కారు. లోకము తన స్వభావమును అనుసరించి ప్రవర్తించుచుండును. ఆ స్వభావమునకు, ఆ లోకమునకు కాలము ప్రధానమైన గతి. కాలము తనను కూడ అతిక్రమించదు. దానిని ఎవ్వరును మరల్చజాలరు. కాలము వలన లభించు స్వభావములను ఏ వస్తువు కూడ అతిక్రమింపజాలదు.

కాలమునకు పక్షపాతము లేదు. దానిని వశమును చేసికొను సాధనముగాని, దానిని జయించు పరాక్రమముగాని లేదు. మిత్రత్వము, జ్ఞాతిత్వము మొదలైన సంబంధము కాలప్రవృత్తికి కారణము కాదు. ఇది యెవరికిని వశమైనది కాదు. సద్బుద్ధి కలవాడు కాలపరిణామమును బాగుగా పరిశీలించవలెను. కాలము ధర్మార్థ కామములను ఒక క్రమము ప్రకారము సమకూర్చుచుండును. (కిష్కింధకాండము 25వ సర్గము)

**1) అరణ్యకాండము 69వ సర్గములో కూడా రాముడు కాలప్రస్తావన చేశాడు.**

రామలక్ష్మణులు అరణ్యావాసములో ఉండగా కబంధుడనే రాక్షసుడు వారిని చూచి మీరెవరు? ఈ ప్రదేశానికి ఎందుకు వచ్చారు? అని అడిగిన తనకు ఆకలిగా ఉన్నదని, తన నోటి వద్దకు వచ్చినవారిని వదలనని ఇంక వారి జీవితము దుర్లభమన్న సందర్భములో కబంధుని మాటలు విన్న రాముడు లక్ష్మణునితో ఇట్లన్నాడు.

"లక్ష్మణా! ఒక కష్టము వెనుక మరొక అధికమైన కష్టము వచ్చుచున్నది. నా ప్రియురాలైన సీత లభించుట లేదు. కాని ప్రాణములను తీసే ఈ దారుణమైన ఆపద వచ్చినది. అన్ని ప్రాణుల విషయమునందు కూడ కాలము శక్తి చాలా గొప్పది. నీవు నేను కష్టాల చేత ఎట్లు బాధపడుచున్నామో చూడుము. కాలానికి ఏ భూతముల విషయమందూ కూడ భారమనేది లేదు. శూరులు, బలవంతులు, యుద్ధరంగములో అస్త్రనైపుణ్యము చూపినవారు కూడ కాలము ఆక్రమించగానే ఇసుకతో కట్టిన అడ్డుకట్టవలె కూలి పోవుదురు", ఇది కాలమహిమ. కాలాన్ని గూర్చి రామాయణమిచ్చే సందేశమేమిటి? అని మనం ప్రశ్నించుకుంటే ఏ వ్యక్తి జీవితంలోనైనా కొన్ని కష్టసుఖాలు సహజము. వాటిని అనుభవించాల్సిందే. ఎవరికీ మినహాయింపు లేదు. కష్టాలకు దుఃఖించకూడదు, సుఖాలకు పొంగిపోకూడదు. ఈ సందేశము తరువాత కాలములో వచ్చిన గీతా సారాంశమే!

ఉత్తరకాండములో రామాభిషేకము జరిగిన పిమ్మట సీత లోకాపవాదమును భద్రుని ద్వారా విన్న రాముడు లక్ష్మణునితో సీతను వాల్మీకి ఆశ్రమములో వదలి రమ్మని ఆజ్ఞాపించాడు. రామాజ్ఞ ప్రకారము లక్ష్మణుడు ఆమెను రథములో తీసుకెళ్ళి

గంగానది సమీపమునఉన్న వాల్మీకి ఆశ్రమము వద్ద వదలి తిరిగి అయోధ్యకు వచ్చి రాముని సేవలో ఉండగా రాముడు సీతకోసమై దుఃఖించుచూ కనిపించాడు. ఆ సందర్భములో లక్ష్మణుడు రాముని ఓదార్చే క్రమంలో రామునిలాంటి సకల ధర్మములు తెలిసినవాడు, సత్యాన్ని అనుసరించి జీవించేవాడు దుఃఖించకూడదని అంతా "కాలగతి" అని కాలప్రస్తావన చేశాడు. సీతాపహరణము తరువాత, సీతా వియోగము జరగటాన్ని కాలమహిమగా లక్ష్మణుడు వర్ణించాడు.

## 2) సూర్యుని మహిమ (ప్రభావము)

సూర్యుని దేవునిగా కొలిచేవారు దేశంలో కొన్ని కోట్లమంది ఉన్నారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రము శ్రీకాకుళం జిల్లాలో "అరసవల్లి"లో ప్రసిద్ధ సూర్యదేవాలయ మున్నది. సూర్య నమస్కారములు చేసేవారున్నారు. సూర్యనమస్కారాలు ఆరోగ్యానికి మంచిదని నమ్మేవారున్నారు. కొంతమంది సూర్యనమస్కారాలు చేయకుండ పూర్వము భోజనము చేసేవారు కాదు.

రామాయణం యుద్ధకాండము 105వ సర్గములో రామరావణ యుద్ధము జరుగుతుంది. యుద్ధాన్ని చూడటానికి బ్రహ్మాది దేవతలు వచ్చారు. అగస్త్యుడు కూడా ఆ యుద్ధాన్ని చూడటానికి వచ్చాడు. యుద్ధములో అలసిపోయి దిగులుగా ఉన్న రాముని వద్దకు వచ్చి అగస్త్యుడు రామునికి ఆదిత్య హృదయ స్తోత్రాన్ని చెప్పాడు. ఆదిత్య హృదయ స్తోత్రాన్ని జపిస్తే శత్రువుని సంహరించవచ్చునని, అపజయము కలుగదని చెప్పి సూర్య ప్రభావాన్ని రామునికి వివరిస్తాడు. అగస్త్యుడు రామునికి చెప్పిన సూర్య ప్రభావాన్ని పరిశీలిద్దాము.

అగస్త్యుడు రాముని దగ్గరకు వెళ్ళి ఇట్లు పలికాడు. "నాయనా! ఓ రామా! నిత్యమైన ఒక రహస్య స్తోత్రమును వినుము. దీని చేత యుద్ధములో సర్వశత్రువులను జయించగలవు. పుణ్యప్రదమైన ఆదిత్య హృదయ స్తోత్రమును నిత్యము జపించవలెను. అది సకల శత్రువులను నశింపజేయును. జయమునిచ్చును. అక్షయమైన ఫలమునిచ్చును. చాలా పవిత్రమైనది. సకల పాపములు తొలగించును. చింతను, శోకమును శాంతింపచేయును. ఆయుష్షును వృద్ధి పొందించు ఉత్తమ సాధనము.

సూర్యుడు ప్రశస్తములైన కిరణములు గలవాడు. ఉదయ పర్వతమునందు ఉదయించువాడు. అస్తాద్రియందు అస్తమించువాడు. దేవతల చేత, అమరుల చేత కూడ నమస్కరింపబడినవాడు. తన తేజస్సుచే ఇతర తేజస్సులను కప్పివేయువాడు. కాంతిని ఇచ్చువాడు. సర్వలోకములను నియమించువాడు. అట్టి సూర్యుణ్ణి ఆరాధింపుము.

ఇతడు సమస్త దేవతా స్వరూపుడు, గొప్ప తేజస్సుకలవాడు. కిరణముల చేత లోకములను రక్షించువాడు. ఈ సూర్యుడు కిరణములచేత దేవగణములను, అసురగణములను, జనులను రక్షించుచున్నాడు. ఈ సూర్యుడే బ్రహ్మదేవుడు, విష్ణువు, స్కందుడు, నవప్రజాపతులు, కుబేరుడు, కాలపురుషుడు, యముడు, వరుణుడు, పితృదేవతలు, వసువులు, సాధ్యులు, అశ్వనీదేవతలు, మరుత్తులు, మనువు, వాయువు, అగ్ని, ప్రజలు, ప్రాణవాయువు - ఇవన్నీ సూర్యుడే. ఇతడు ఋతువులను నిర్మించును. శాంతిని ఇచ్చును. అదితి కుమారుడు. జగత్తు సృష్టించినవాడు. జనులను తమ తమ పనులలో ప్రేరేపించువాడు. ఆకాశమునందు సంచరించువాడు. జగత్తును వర్షాదుల చేత పోషించువాడు. కిరణములు గలవాడు. బంగారు రంగు కలవాడు. ప్రకాశించువాడు. బంగారు తేజస్సు కలవాడు. పగలు కల్పించువాడు. సూర్యుని అశ్వములు, ఆకుపచ్చనివి, వేయి కిరణములు గలవాడు. చీకటిని నశింపచేయువాడు. సుఖమును ఇచ్చువాడు. ప్రాణులను సంహరించువాడు. బ్రహ్మాండమును ప్రళయానంతరము మరల సృజించువాడు. అంశువులు (కిరణములు) గలవాడు. తపింపజేయువాడు. పగటిని కల్పించువాడు. స్తుతింపబడినవాడు. అదితి పుత్రుడు. శాంతించువాడు. అగ్నిగర్భమునందు కలవాడు. శిశిరమును నశింపజేయువాడు.

సూర్యుడు ఆకాశమునకు ప్రభువు. రాహువును భేదించువాడు. ఋగ్యజుః సామవేదముల సారమును పొందినవాడు. అధికమైన వర్షమిచ్చువాడు. ఉదకమునకు మిత్రుడు. ఆకాశమున శీఘ్రముగా సంచరించువాడు. సూర్యుడు ఎండనిచ్చువాడు. మండలము గలవాడు. శత్రు సంహారకుడు. ఉదయమున ఎఱ్ఱగా నుండువాడు. అందరికీ తాపమును కలిగించువాడు. పండితుడు. ప్రపంచ వ్యవహారము నడుపువాడు.

గొప్ప తేజస్సు కలవాడు. అందరియందు ప్రేమగలవాడు. అందరి సంసారానికి కారణ భూతుడు; సూర్యుడు; తారలకు అధిపతి. జగత్తుకు స్థాపకుడు. అగ్న్యాది తేజస్సుల మధ్య అధిక తేజస్సు కలవాడు. అట్టి సూర్యునకు నమస్కారము. ఓ! ద్వాదశ రూపములు గలవాడా! నీకు నమస్కారము. ఇది అగస్త్యుడు రామునికి చెప్పిన సూర్యప్రభావము. దీనిని అందరూ చదవాలి. సూర్యుని గురించి మనకు తెలిసినా అగస్త్యుడు చెప్పినది అంతా మనము గ్రహించాలి.

## శ్రీమద్రామాయణ మాహాత్మ్యము :

రామాయణ మాహాత్మ్యము మనకు రామాయణ ఏడు కాండములలో రెండు కాండములలో మాత్రమే లభ్యమవుతుంది. 1) యుద్ధకాండము 128వ సర్గము తరువాత, 2) ఉత్తరకాండము నూట పదకొండవ సర్గము.

ఉత్తరకాండము 111వ సర్గములో పేర్కొన్న రామాయణ మహాత్మ్యమును పరిశీలిద్దాము. ఈ మహాత్మ్యాన్నే రామాయణ కావ్య పఠన ప్రయోజనములు అనవచ్చును. వాటిని పరిశీలిద్దాము.

1) రామాయణాన్ని ప్రచేతనుని పుత్రుడు వాల్మీకి రచించాడు. దీనిని బ్రహ్మదేవుడు కూడా ఆమోదించాడు.

2) మానవుడు ఒక్క సర్గను వినినా కూడా వెయ్యి అశ్వమేధములు, పదివేల వాజపేయములు (యాగములు) చేసిన ఫలములు పొందుతాడు.

3) ఈ లోకంలో రామాయణం విన్నవాడు ప్రయాగాది తీర్థములకు, గంగానదులకు, నైమిశారణ్యములకు, కురుక్షేత్రాదులకు యాత్ర చేసినట్లే.

4) సూర్యగ్రహణ పుణ్యకాలమునందు కురుక్షేత్రములో పుట్టెడు బంగారము దానము చేసినవాడు, రామాయణము చదివినవాడు, ఇద్దరూ ఈ లోకములో సమానులే.

5) మంచి శ్రద్ధతో రామకథను వినినవాడు సకల పాపములనుండి విముక్తుడై విష్ణు లోకానికి వెళ్తాడు.

6) పూర్వము వాల్మీకి రచించిన అర్థమైన ఈ ఆదికావ్యమును ఎల్లప్పుడు భక్తితో

వినువాడు విష్ణుశరీరమును పొందును. అతని పుత్రులు, భార్యలు, సంపదలు వృద్ధి చెందుతాయి.

7) ఈ అత్యుత్తమమైన రామాయణము గాయత్రీ రూపము. ఈ సత్యమును తెలిసికొని దీనిని పరిశుద్ధమైన అంతఃకరణముతో పఠించవలెను.

8) రాముని చరిత్రను నిత్యము భక్తి పూర్వకముగా చదువువాడు, వినువాడు కూడా పాపములన్నీ తొలగి దీర్ఘాయుర్దాయవంతుడగును. శ్రేయస్సు పొందగోరు వారు నిత్యము రాముని స్మరింపవలెను. ప్రతి దినము ఈ రామాయణమును బ్రాహ్మణులకు వినిపించవలెను.

9) ఈ రామ చరితమును అంతా చదువువాడు మరణానంతరము తప్పక విష్ణులోకమునకు వెళ్ళును; సంశయము లేదు. రామాయణమును పూర్తిగా చదివినవాని తండ్రి, తాత, ముత్తాత, ముత్తాత తండ్రికూడ విష్ణువును చేరుదురు. సంశయము లేదు.

10) రాముని చరితము ధర్మార్థ కామ మోక్షములను నాలుగు పురుషార్థములను ఇచ్చును. అందువలన మానవుడు నిత్యము ప్రయత్నశీలుడై శ్రేష్ఠమైన ఈ రామాయణమును ఎల్లప్పుడు చదువుచుండవలెను.

11) రామాయణములోని ఒక శ్లోక పాదమును గాని, ఒక్క పదమునైనాగాని భక్తితో వినువాడు బ్రహ్మలోకమునకు వెళ్ళును. నిత్యము బ్రహ్మచేత పూజింపబడును.

12) దీనిని చదివినచో ఇంట్లో ఉన్న దుష్టభూతాదులు శాంతించును.

**ఇవి రామాయణ కావ్య ప్రయోజనాలు**

**ఇందుకే రామాయణం చదవాలి**

# ఉపసంహారం

రామాయణం ఎందుకు చదవాలి? అనే ప్రశ్నకు సమాధానంగా పన్నెండు అధ్యాయాలను చూశాము. సంక్షిప్తంగా వాటి సారాంశాన్ని ముగింపులో పరిశీలిద్దాము.

మొదటి అధ్యాయములో సీతారాములు లక్ష్మీదేవి, విష్ణుమూర్తి అవతారాలని తెలుసుకొన్నాము. చదువరులు ఈ విషయాన్ని నమ్మితే మిగతా అధ్యాయాలను చదవాలి.

రెండు, ఆరవ అధ్యాయములలో సీతారాముల గుణగణాలను పరిశీలించాము. వారు ఆదర్శ దంపతులు. లోకజనులు వారి ఆదర్శ దాంపత్యాన్ని వారి గుణగణాల ద్వారా తెలుసుకొని, వారు వారి తరువాత యుగాలవారు అనుసరించటానికి రామాయణం చదవాలి.

మూడవ అధ్యాయంలో సీతారాములు భూమి మీద మానవులుగా అవతరించి వారు అనుభవించిన కష్టాలు కూడా మన జీవితానికి ఆదర్శము కావాలి. చిన్న చిన్న జీవిత సమస్యలకే మానవులమైన మనం హత్యలు చేస్తున్నాము, ఆత్మహత్యలు చేసుకుంటున్నాము. వారి కష్టాలను తెలుసుకొని మనం ధైర్యము తెచ్చుకొని హత్యా విధానాన్ని, ఆత్మహత్యా విధానాన్ని విడనాడాలి. వారికంటె ఎక్కువ కష్టాలను అనుభవించినవారు మానవులలో బహుశ ఎవరూ లేరేమో! అందుకు రామాయణం చదవాలి.

నాలుగవ అధ్యాయములో రామాయణంలో నిక్షిప్తమైన మానవీయ విలువల ప్రస్తావన చేశాను. ఏ యుగములోనైనా విలువలు లేని జీవితము రాక్షస జీవితమవుతుంది. రామాయణములో ఉన్న విలువలను పాటిస్తే జీవితములో అనేక సమస్యలను అధిగమించవచ్చును. మానవ జీవితపు విలువలను మననం చేసుకోవటానికి రామాయణం చదవాలి.

ఐదవ అధ్యాయములో రామాయణ కాలమునాటి గూఢచర్య వ్యవస్థను

గురించి, నేర పరిశోధనను గురించి ప్రస్తావన చేశాను. ఏ యుగములోనైనా, ఏ దేశ పాలనావ్యవస్థలోనైనా గూఢచారి వ్యవస్థది ప్రముఖ స్థానము. పొంచి ఉన్న ప్రమాదాన్ని ముందుగా పసిగట్టి ఆయా ప్రభుత్వాలకు ముందస్తు హెచ్చరికలు జారీ చేస్తుంది గూఢచారి వ్యవస్థ. ఆనాటి గూఢచారి వ్యవస్థ పటిష్ఠంగా ఉన్నదా? నేటి గూఢచర్య వ్యవస్థ పటిష్ఠంగా ఉన్నదా? అని మనం పోలిక చేయవచ్చును. అందుకు రామాయణం చదవాలి.

రామాయణ మహాకావ్యములో హనుమంతుడు నిర్వహించిన పాత్ర అద్భుతమైనది. హనుమంతుని పాత్ర సృష్టి జరుగకపోతే రామాయణ కథ అసంపూర్ణముగా మిగిలి ఉండేది. సీత జాడ తెలిసేది కాదు. రావణ సంహారము జరిగి ఉండేది కాదు. హనుమంతుని శక్తియుక్తులు లోకానికి తెలిసేవి కావు. హనుమంతుడు నిర్వహించిన మహత్తరమైన పాత్రను తెలుసుకోవటానికి ఈ రచనలోని ఏడవ అధ్యాయము చదవాలి.

రామాయణ కావ్యంలో రాముడు నాయకుడైతే, రావణుడు ప్రతినాయకునిగా మనం భావించాలి. ఇది అద్భుతమైన వాల్మీకి సృష్టి. రామాయణ కథకు అయోధ్య నగరము ఎంత ముఖ్యమో రావణుని లంకా నగరము కూడా అంతే ముఖ్యము. రావణుడు బ్రాహ్మణోత్తముడు. వెయ్యి సంవత్సరములు తపస్సు చేసి బ్రహ్మదేవుణ్ణి మెప్పించి వరములు పొందినవాడు. లంకా నగరము సంపన్నమైన రాజ్యము. సంపద సమృద్ధిగా ఉన్నా పాలకుడైన రావణునికి విలువలు లేనందున లంకా రాజ్య పతనము తప్పలేదు. రావణుని పాత్ర విశేషాలను తెలుసుకోవటానికి రామాయణం చదవాలి. రామాయణాన్ని లోతుగా పరిశీలిస్తే రాముడు ధర్మానికి ప్రతీక. రావణుడు అధర్మానికి ప్రతీక. ధర్మాధర్మాల విచక్షణాన్ని తెలుసుకోవటానికి ఈ రచనలోని ఎనిమిదవ అధ్యాయము తప్పక చదవాలి.

రామ రాజ్య విశేషాలను, రాముని పాలనను, పాలనాదక్షతను, పాలకుల - ప్రజా సంబంధాలను, అయోధ్య ప్రజల స్థితిగతులను, మనోభావాలను తెలుసుకోవటానికి ఈ రచనలోని తొమ్మిదవ అధ్యాయము చదవాలి.

మానవ సంబంధాలు అన్ని యుగాలలో ప్రజాజీవన విధానములో

ప్రముఖపాత్రను పోషిస్తాయి. ఆంగ్లంలో ***"No Man is an Island"*** అని, ***"Man is a Social Animal"*** అని అంటారు. రామాయణ కాలమునాటి మానవ సంబంధాలు ఎలా ఉన్నాయి ? ప్రస్తుతము మనము నిర్వహించి కొనసాగించే మానవ సంబంధాలు ఎలా ఉన్నాయి ? అని ప్రశ్నించుకుంటే వీటిని పోలిక చేయటము ద్వారా పాలకులు - పాలితుల మధ్య ఉన్న సంబంధాలు, వివిధ వర్గాల ప్రజల మధ్య ఉన్న సంబంధాలు మనము గ్రహించగలము. మానవ సంబంధాలు తెలుసుకోవటానికి ఈ రచనలోని పదవ అధ్యాయాన్ని అధ్యయనము చేయటానికి రామాయణం చదవాలి.

రామాయణ కాలంలో ఉన్న సత్యధర్మాలను ఏడు కాండములలో ప్రస్తావన చేశాడు వాల్మీకి. సత్యధర్మాల స్వభావ స్వరూపాలు ఏ యుగములోనైనా మారవు గనుక వాటిని మనం మననం చేసుకోవాలి. భారతదేశ పునాదులు, భారతీయ సంస్కృతి, భారతీయ జీవన విధానమే సత్యధర్మాల మీద నిర్మితమై నేటికీ నడుస్తుంది. ప్రస్తుతం లోకంలో ధర్మము కొంత లోపించినందువల్ల అనేక అనర్థాలను మనము చూస్తున్నాము. గందరగోళ, అరాచక పరిస్థితులను ఎదుర్కొంటున్నాము. భారతదేశ ఆశయము కూడా సత్యధర్మాలతో కూడుకొన్నదే. "సత్యమేవ జయతే ధర్మమేవ జయతే" అనగా సత్యధర్మాలు జయిస్తాయని ఈ వాక్యానికి అర్థము. సత్యధర్మాలను, ధర్మార్థ కామ మోక్షాలైన చతుర్విధ పురుషార్థాలను తెలుసుకోవటానికి ఈ రచనలోని పదకొండవ అధ్యాయంలో పేర్కొన్న రామాయణంలో ఉన్న సత్యధర్మాలను తెలుసుకోవటానికి రామాయణం చదవాలి.

చివరి అధ్యాయమైన పన్నెండవ అధ్యాయంలో కాలమహిమను, సూర్యుని మహిమను, రామాయణ ప్రయోజనాలను (మాహాత్మ్యమును) తెలుసుకోవటానికి రామాయణం చదవాలి.

శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు గారు వ్రాసిన వచన రామాయణాన్ని నా ఈ రచనకు ఆధార గ్రంథముగా ఉపయోగించాను. వారికి నా ధన్యవాదాలు, హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఇట్లు
రచయిత



# గాలి సుబ్బారావు

ఎం.ఏ., ఆంగ్ల భాష, సాహిత్యం

ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్నం

తల్లిదండ్రులు : గాలి బుచ్చమ్మ, వెంకయ్య

జన్మస్థలం : నకరికల్లు మండలం, కండ్లగుంట గ్రామము

పుట్టిన తేది : ది. 1-7-1951

వృత్తి : ప్రిన్సిపాల్ (రిటైర్డ్ ది. 30-6-2009)

కొత్త రఘురామయ్య జూనియర్ కళాశాల, నరసరావుపేట

స్పెషల్ ఆఫీసర్ : పి.యన్.సి. & కె.ఆర్. డిగ్రీ & పి.జి. కళాశాలలు, నరసరావుపేట

(1991-92 - 2005-06)

మాజీ అధ్యక్షులు : ఆంధ్ర రాష్ట్ర ప్రైవేట్ ఎయిడెడ్ జూనియర్ కళాశాలల ప్రిన్సిపాల్స్ సంఘం (1995-2004)

మాజీ పాలకమండలి సభ్యులు : ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం, గుంటూరు

(మే 1995 - అక్టోబరు 2004)

ప్రతిభా పురస్కార్ అవార్డు గ్రహీత : ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం, గుంటూరు (30-9-2016)

ఇతర రచనలు :
1. మరపురాని మన నాయకులు
2. లోకరీతి (వచన శతకం)
3. శతక త్రయం (వచన శతకాలు - సత్యవాణి, అంతరాత్మ, వృత్తిధర్మం)
4. విద్యార్థులు - విలువలు
5. శతక సాహిత్యం - సామాజిక ప్రయోజనం
6. రాజనీతి - రాజ ధర్మాలు, మహాభారతం - నేటి భారతావని

పాస్ట్ రొటేరియన్